

మా తెలుగు తల్లికీ మల్లెపూదండ
మా కన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగువిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య

# హాస్యలహరి

**యువభారతి 38వ వార్షికోత్సవాల**
**సందర్భంగా ఏర్పాటు చేసిన 'లహరి' ఉపన్యాస**
**వ్యాసమంజరి 2002**

**ప్రధాన సంపాదకులు**

డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

**సంపాదక వర్గం**

డా॥ కె.బి.లక్ష్మి
శ్రీ రెడ్డి రాఘవయ్య
శ్రీ మాడభూషి అనంతాచార్య
శ్రీ ఎస్. వెంకటేశ్వరరావు
శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడు
శ్రీ కె.వి. కామేశ్వరరావు
శ్రీ ఆచార్య ఫణీంద్ర
డా॥ నాగినేని భాస్కరరావు



రిజిష్టర్ నెం. 1/64

**యువభారతి**

**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు,**
**తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001**

HAASYALAHARI
Lectures delivered by Scholars on the occasion of 38th Annual Celebrations of **YUVABHARATHI**
on 1st, 8th, 15th, 22nd, 29th December 2002.



యువభారతి 38వ వార్షికోత్సవ ప్రచురణ

| | | |
|---|---|---|
| ప్రచురణ సంఖ్య | : | 166 |
| ప్రథమ ముద్రణ | : | 29, డిసెంబరు, 2002 |
| ప్రతులు | : | 1000 |
| ముఖ చిత్రాలంకరణ | : | శ్రీశీలా వీర్రాజు |
| వెల | : | రూ. 80.00 |
| ప్రతులకు | : | యువభారతి కార్యాలయం<br>ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు<br>తిలక్ రోడ్, హైదరాబాదు -500 001 |
| సోల్ డిస్ట్రిబ్యూటర్స్ | : | నవోదయ బుక్ హౌస్<br>ఆర్యసమాజ మందిర్ ఎదురుగా,<br>సుల్తాన్ బజార్, హైదరాబాదు-500 027<br>ఫోన్: 2465 2387 |
| డి.టి.పి. ముద్రణ | : | ఓంసాయి గ్రాఫిక్స్<br>3-4-709, నారాయణగూడ,<br>హైదరాబాదు - 500 027<br>ఫోన్: 27560543 |

# ముందు మాటలు

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" - అన్న సూక్తియే ఊపిరిగా పనిచేస్తున్న సాహిత్య సాంస్కృతిక సంస్థ యువభారతి. ప్రాచీన ఆధునిక తెలుగు సాహిత్యంలోని ఉత్తమ మూల్యాలనూ ఉన్నత ప్రమాణాలనూ యువతరానికి అందిస్తూ సమాజంలో సాహిత్య చైతన్యాన్నీ, సాహిత్య అవగాహననూ పెంపొందించాలని కృషిచేస్తున్నది యువభారతి. మంచికోసం మానవత కోసం ఉద్యమిస్తూ సమకాలిక యువతరంలో నిర్మాణాత్మక దృక్కోణం ఏర్పడడానికి అనువైన వాతావరణం కల్పించాలన్నది యువభారతి ఆకాంక్ష. ప్రజాస్వామ్యంలో విభిన్న ధోరణుల మధ్య సామరస్యాన్ని, సమన్వయాన్ని సాధించడానికి సాహిత్యం ఒక సాత్త్విక సాధనం అని యువభారతి ఉద్దేశం.

యువకులలో నిక్షిప్తంగా ఉన్న ప్రతిభకు గతి కల్పిస్తే సమాజం ప్రగతిపథంలో పయనిస్తుందని యువభారతి విశ్వాసం. ఈ విశ్వాసంతోనే కడచిన 37 సంవత్సరాలుగా అనేక సాహిత్య కార్యక్రమాలను నిర్వహించింది యువభారతి. యువకుల సమగ్రవికాసానికీ వారి వ్యక్తిత్వ నిర్మాణానికి దోహదం చేసే క్లుప్తగోష్ఠులూ, పుస్తక చర్చలూ, కావ్య పఠనాలూ. సమాలోచనలూ నిర్వహించింది. సభ్యుల, ప్రముఖకవుల కవితాసంకలనాలను ప్రచురించింది. గోష్ఠులూ సదస్సులూ ఏర్పాటు చేసింది. మహాకవుల కావ్య గానాలు రికార్డు చేసింది. ఉత్తమ ఆధునిక కావ్యాలను గురించి ఉపన్యాస సభలను నిర్వహించింది. 'నందిని' పత్రికను నడిపించింది. తెలుగులోని ప్రముఖ కావ్యపద్య వ్యాఖ్యానాలతో పాటు అన్యభారతీయ భాషాకవుల కవితా వ్యాఖ్యానాలను కూడా ప్రచురించింది. కడచిన మూడు సంవత్సరాలుగా యువకుల వ్యక్తిత్వ వికాసానికి తోడ్పడే వివిధాంశాలను గూర్చి ప్రతినెలా మొదటి ఆదివారం మధ్యాహ్నం, ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారి ఆధ్వర్యంలో, నగర కేంద్ర గ్రంథాలయం వారి సహకారంతో, వారి సభామందిరంలోనే సమావేశాలను నిర్వహిస్తూ, యువతరంలో చైతన్యదీప్తికి కృషిచేస్తున్నది యువభారతి.

యువభారతి ప్రత్యేకంగా 1971 నుంచి 'లహరి' ఉపన్యాసపరంపరను నడిపించి, వాటిని గ్రంథాలుగా సహృదయలోకానికి అందించింది. అలా ఆయా వార్షికోత్సవాల కార్యక్రమ సందర్భంగా రూపు దాల్చినవే కావ్యలహరి, చైతన్యలహరి, వికాసలహరి, ప్రతిభాలహరి, కవితాలహరి, రామాయణసుధాలహరి, నవోదయలహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహితీలహరి, జగద్గురు సాహితీలహరి, నవ్యసాహితీలహరి, ఇతిహాసలహరి, వివేకానందలహరి అనేవి. యువభారతి ఇప్పటికి 165 కి పైగా గ్రంథాలను ముద్రించి తెలుగు భాషా సాహిత్యవికాసాలకు యథాశక్తి కృషి చేసింది.

ఇక, ఈ 38వ వార్షికోత్సవాల సందర్భంగా యువభారతి, ఈ డిసెంబరు నెల ప్రతి ఆదివారం సాయంకాలం 'హాస్యలహరి' అనే పేరుతో ఉపన్యాసపరంపరను ఏర్పాటుచేసి 'శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం' సుల్తాన్ బజారు, హైద్రాబాదులో సభలను నిర్వహించింది. ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలోని హాస్యరస విశేషాలతో పాటు ఆధునిక సాహిత్యంలో వెలువడిన ప్రముఖ రచయితల రచనలలోని హాస్య విశేషాలను గూర్చి విద్వాంసులచే ఉపన్యాసాలిప్పించి, ఆ ఉపన్యాస వ్యాసాలను, ఇప్పుడు ఈ 'హాస్యలహరి' గ్రంథంగా సహృదయులైన మీకు అందిస్తున్నాము. ఈ ప్రయత్నాన్ని మీరు హర్షించి ఆదరిస్తారని ఆశిస్తున్నాము. ప్రాచీన ఆంధ్ర సాహిత్య హాస్యరస విశేషాలను గూర్చి,

కందుకూరి, చిలకమర్తి, పానుగంటి, గురజాడ, మొక్కపాటి, భమిడిపాటి, మునిమాణిక్యం, ముళ్లపూడి, భానుమతి రామకృష్ణ రచనలలోని హాస్యాన్ని గూర్చి ఉపన్యసించి మాకు వ్యాసాలను అందించిన ఆచార్య ఎస్వీ రామారావు, డా॥మంజుశ్రీ, డా॥ ముక్తేవి భారతి, డా॥ వెలుదండ నిత్యానంద రావు, శ్రీ సుధామ, శ్రీ శ్రీ రమణ, డా॥ శారదా అశోకవర్ధన్‌గారలకు హృదయపూర్వక ధన్యవాదాలు సమర్పిస్తున్నాము.

ఈ చిహాస్యలహరి' సాహిత్య ఉపన్యాస సభలకు అధ్యక్షత వహించిన, సాహిత్యాచార్యులకూ ముఖ్యఅతిథులుగా విచ్చేసి తమ అమూల్య సందేశాలందించిన మాన్యమహోదయులకూ మా హార్దికధన్యవాదాలు తెలుపు కుంటున్నాము.

ఈ 'హాస్యలహరి' ద్వితీయ సభకు అధ్యక్షత వహించడమే గాక ఈ 'హాస్యలహరి' వ్యాససంపుటికి 'నవ్వు, హాసం, హాస్యం' అనే పేర హాస్యరస విశేషాలను గూర్చి తమ అమూల్యఅభిప్రాయాలను వ్రాసియిచ్చిన విద్వద్విమర్శకాగ్రేసరులూ సహృదయ శిరోమణులూ ఆచార్య సంపత్కుమారాచార్య గారికి మాహృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాము.

ఈ 'హాస్యలహరి' ఉపన్యాస సభా నిర్వహణకు, 'హాస్యలహరి' గ్రంథ ప్రచురణలో మాకు అనుక్షణం అండదండలందించి ఈ కార్యక్రమ విజయోత్సవానికి వెన్నెముకగా నిలిచిన లలితకళా హృదయులూ, సహకారమూర్తులూ, సౌజన్య సింధువులూ అయిన శ్రీ కె. వి. రమణ, ఐ.ఏ.ఎస్. వైస్‌చైర్మన్ మరియు కమీషనర్, హౌసింగ్ బోర్డు ఆంధ్రప్రదేశ్, గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాంజలులను సమర్పిస్తున్నాము.

ఈ 'హాస్యలహరి' ఉపన్యాస కార్యక్రమ నిర్వహణకు హార్దికంగా, ఆర్థికంగా సహకరించిన వదాన్యులూ, మాన్యులూ, శ్రీ ఎన్.ఎల్.నరసింహారావు, శ్రీ కె.ఎస్.రంగశాయి, శ్రీ బచ్చు జనార్దన్, శ్రీ చల్లా సాంబిరెడ్డి, శ్రీ ఎం.రామిరెడ్డి, శ్రీ వి.వి.సత్యప్రసాద్ గారలకు మా హార్దిక కృతజ్ఞతలు తెలుపుతున్నాము.

ఈ 'హాస్యలహరి' సభావేదికను సకల సౌకర్యాలతో మాకు అందించిన మాన్యులూ బహుగ్రంథకర్తలూ శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయ నిర్వాహకులు శ్రీ ఎం.ఎల్. నరసింహారావుగారికి మా హార్దిక ధన్యవాదాలు.

'హాస్యలహరి' సభానిర్వహణలో, ఈ గ్రంథరూపకల్పనలో తమ అండదండలందించిన యువభారతి సభ్యులకు హార్దిక కృతజ్ఞతలు.

ఈ 'హాస్యలహరి' గ్రంథాన్ని అందంగా అనుకున్న సమయానికి ముద్రించి, యువభారతి ఆశయాన్ని నెరవేర్చడంలో సహకరించిన 'ఓంసాయిగ్రాఫిక్స్' అధినేతలు, గౌరవనీయులైన శ్రీ ఎం.రామిరెడ్డిగారికి మా హార్దిక కృతజ్ఞతలు.

యువభారతి సభలను విజయవంతంచేస్తూ, యువభారతి ప్రచురణలను సమాదరించిన సహృదయులు ఈ గ్రంథాన్ని కూడా ఆదరిస్తారని విశ్వసిస్తున్నాము.

హైద్రాబాదు
27-12-2002

-డా॥ తిరుమల శ్రీనివాసాచార్య,
అధ్యక్షులు, యువభారతి

# నవ్వు - హాసం - హాస్యం

నవ్వు-

నవ్వు అచ్చమయిన తెలుగు మాట. 'నవ్వు' తో మనకు ఎన్నెన్నో రకాల పలుకుబడులూ, నుడికారాలూ, సామెతలూ ఉన్నాయి. నవ్వులాట, నవ్వుకోలు, నలుగురు నవ్విపోతారు, నవ్విన నాపచేనే పండింది, నవ్వునాలుగువిధాల చేటు.... ఇట్లా అనేకం. 'నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు' అంటుంది ఒక భావకవి వాక్కు. అదట్లా ఉంచి, నవ్వు తీరులు నానారకాలు. చిరునవ్వు, పసినవ్వు, ముసిముసినవ్వు, పెడనవ్వు, వెడనవ్వు, వెకిలినవ్వు, ఎఱ్ఱనినవ్వు-తిక్కనగారి రచనల్లో ఇంకా ఎన్నెన్నో రకాల నవ్వుతీరులు. సాధారణంగా 'సర్వచరాచర ప్రపంచంలోనూ నవ్వగలిగిన జీవి ఒక్క మానవుడే' అని అంటారు గాని, మనుష్యేతర జీవులుగూడా నవ్వగలుగుతాయనే అన్పిస్తుంది. మనం వ్యవహరించే నవ్వుల తీరుల్లో 'చిలుక నవ్వు' కూడా ఒకటి. చిలుక నవ్వగలిగినప్పుడు మిగతా జీవులు మాత్రం ఎందుకు నవ్వగలుగవు? కాకపోతే మనకు వాటి భాష తెలియదు. వాటి నవ్వూ తెలియదు. నవ్వు తీరూ తెలియదు. కాని, 'చిలుకనవ్వు' అనటం ద్వారా అవి కూడా నవ్వ గలుగతాయన్న ఒకానొక జీవస్పృహ, గుర్తింపు మనకు ఉండిందన్పిస్తుంది. నిజానికి మననవ్వు తీరులే మనకు పూర్తిగా తెలిసిరావటం లేదు. ఇక వాటి నవ్వు తీరులేం తెలుసుకోగల్గుతాం!

తెలియని వాటిని గురించి ప్రస్తుతానికెందుకుగాని, తెలుసుననుకొనే మనవరకు మనం చూసుకొన్నాగూడా, నిత్య జీవితంలో మనం అనేక సందర్భాల్లో నవ్వుతుంటాం. అనేక సన్నివేశాలు మనకు నవ్వు కలిగిస్తుంటయి. ఉభయత్రా 'నవ్వు' అనేది సమానమే కావచ్చుగాని, సర్వత్రా ఆ నవ్వులన్నీ ఒకే విధమయినవి కావు. కొన్ని వాటంతటవి కలిగేవి కాగా, కొన్ని కలిగించబడేవి. వీటిలో సాజాత్యం ఉండటానికి ఎంతెంత అవకాశం ఉండవచ్చునో, వైజాత్యం ఉండటానికీ అంతంత అవకాశం ఉండవచ్చు. సహజత్వమూ ఉండవచ్చు, అసహజత్వమూ ఉండవచ్చు. చిత్రమేమిటంటే, మనం సంతోషంలోనూ నవ్వుతాం, విషాదంలోనూ నవ్వుతాం. మరి ఇట్లాంటి 'నవ్వు'లన్నింటినీ ఒకే సరళ రేఖ మీదికి చేర్చటానికి వీలవుతుందా?

ఇంతకూ మనం నవ్వటమెందుకు? నవ్వకపోతే ఏమవుతుంది? అసలు మనం తెలిసి నవ్వుతామా? తెలియక నవ్వుతామా? సప్రయత్నంగానా? అప్రయత్నంగనా? ఎట్లా నవ్వినాగూడా నిజమయిన నవ్వు మన మనస్సును ఉల్లాసపరుస్తుంది. మనస్సు మీది బరువును, వత్తిడినీ తగ్గిస్తుంది. తీవ్రతను వ్యగ్రతను విరిచివేస్తుంది. గాంభీర్యాన్ని పలుచపరుస్తుంది. అందుకని, మనసారా హాయిగా నవ్వటం ఒకవిధంగా సహజమే అయినా అది లోపించకుండా,

కరుడువారకుండా నిలుపుకోవటమనేది, జీవితంలో సాధించుకోవలసిన గొప్ప అవసరమయిన విషయం.

నవ్వుకు సంస్కృతంలో ప్రత్యామ్నాయపదం 'హాసం'. ఈ పదం నుంచి 'హాస్యం' నిష్పన్నమయింది. హసింపజేసేది హాస్యం. అయితే, ఇది హాసం నుండి విడివడి ఒక స్వతంత్ర పదంగా, విశేష తాత్పర్యంతో నిలదొక్కుకున్నది. హాస్య పదానికి ఉన్నంత అర్థవ్యాప్తి 'నవ్వు'కు ఉందా? భారతీయాలంకార శాస్త్రవేత్తలు, కావ్యశాస్త్రజ్ఞులు, హాస్యాన్ని ఒక 'రస' స్థాయికి ఎదిగించారు. వారు పరిగణించిన ఎనిమిది లేదా తొమ్మిది రసాలలో హాస్యానికి ద్వితీయ స్థానాన్ని కట్టబెట్టారు. తొలిగా పేర్కొబడింది శృంగారం. దీని వెంటనే చెప్పబడింది హాస్యం. శృంగారం నుంచి హాస్యం పుడుతుందనీ అన్నారు. మరి శృంగారంతో సంబంధం లేకుండా హాస్యం పుట్టదా? ఎందుకుపుట్టదు? ఒకడికి, ఒక పెద్దసందేహం కలిగింది? శివుడు కొండమీద ఎందుకు పవళిస్తాడు? విష్ణువు సముద్రంలో ఎందుకు పడుకొంటాడు? బ్రహ్మ పద్మంలో ఎందుకుంటాడు? వీళ్లకు ఇళ్లూ, వాకిళ్లూ ఏమి లేవా? పురాణేతిహాసాదులను పరిశీలించి వీటికి సమాధానం చెప్పవలసి ఉంటుంది. అంత గంభీరమయిన విషయమిది. కాని ఒకాయన- 'శివుడద్రిని శయనించుట... నల్లిబాధపడలేకసుమీ' అని చెప్పిన సమాధానం హాస్యం కలిగిస్తున్నది. అతి గంభీర విషయాన్ని వక్రీకరించి, అతిసామాన్యవిషయంగా వ్యక్తీకరించటంతో ఇక్కడ హాస్యం పుట్టింది. ఇక్కడ శృంగారంతో సంబంధమేమీ లేదు. ఇట్లా అనేక రకాలుగా హాస్యం శృంగార సంబంధ విరహితంగా కలిగించే చాటువులు అనేకంగా ఉన్నాయి. అందువల్ల శృంగారంతోనే హాస్యం సంబంధించి ఉండాలనేది కుదిరేది కాదు. స్వతంత్రంగానూ ఉండవచ్చు. అదట్లా ఉంచి-

ఏ రసానికయినా భూమిక- భావం. ప్రధానమయిన, పటిష్ఠమయిన భావం రసానికి ఎదుగుతుంది. ఈ భావాన్ని స్థాయీ భావమంటారు. ప్రతి రసానికీ ఈ విధమయిన స్థాయి భావం - శృంగారానికి 'రతి', వీరానికి 'ఉత్సాహం. ఇత్యాదిగా గుర్తించబడింది. మరి హాస్యానికి స్థాయి భావమేమిటి? హాస్యానికి స్థాయి భావం 'హాసం' అన్నారు. హాసమనేది నిజానికి భావమా? హాసాన్ని ఆరు విధాలుగా - స్మితం, హసితం, విహసితం, ఉపహసితం, అపహసితం, అతిహసితం చెప్పిన తీరును గమనిస్తే నవ్వుతున్నప్పుడు శరీరంలో జరిగే మార్పులను చెప్పినట్టే కన్పిస్తుందిగాని, మిగతా వాటికి చెప్పిన - రతి, శోక,క్రోధ,ఉత్సాహ, భయ, జుగుప్సా, విస్మయాల వంటి భావంగా కన్పించదు, హాసం శరీర వికారం (మార్పు)గానే ఉందిగాని మనోవికారంగా అన్పించదు. నిజానికి హాస్యానికి ఉల్లాసమో మరేదో దానికి అనుగుణమయిన భావం గుర్తించవలసే ఉందేమో నన్పిస్తుంది. అదట్లా ఉంచి-

హాస్యానికి ద్వివిధ ప్రవృత్తి ఉండటం గమనించదగిన మరో విలక్షణత్వమనిపిస్తుంది. ఒకటి

కేవలం వినోదం కలిగించే ప్రవృత్తి. ఇక్కడ హాస్యం స్వతంత్రంగా అచ్చం హాస్యంగా ప్రవర్తిస్తుంది. కాగా మరొక విషయానికో భావానికో... దేనికోమరోదానికి అనువర్తిస్తుంది- అంటే, ఉపయోగపడుతుంది. ఈ ప్రకృత్తులను వైనోదికహాస్యం, అనువర్తిత హాస్యం వని వనవచ్చు ననుకుంటాను. పూర్వసాహిత్యంలోనూ, జానపద మౌఖిక సాహిత్యంలోనూ వైనోదిక హాస్యమే అధికం. రసవిచారణలోని విరోధి-అవిరోధి రసవిచారణ పరిధిలోకి ఇది రాదు. ఈ వైనోదిక హాస్యం 'విదూషక' పాత్రరూప - స్వభావకల్పనకు మూలం అయి ఉండవచ్చు. పూర్వనాటకాలలో శృంగార ప్రాధాన్యం గల వాటిల్వనే ఈ 'విదూషక' ప్రసక్తి కన్పిస్తుంది. ఈ విదూషక వాటచిత్రణకు సంబంధించి - వారిది కేలం -బఫూనరీ' అనో, తిండిపోతు వ్యవహారమనో, ఇంకేదో ఇంకేదో అనో తక్కువ అంచానా వేయటం ఇటీవల అలవాటయిపోయింది. కాగా, విదూషకపాత్ర విషయంగా ఇంతవరకు ఎవరయినా పరిశోధన చేసారో లేదో గాని చేయకపోతే జాగ్రత్తగా - అతని వేషభాష చేష్టాదులకూ ప్రయోజనానికి సంబంధించి పరిశోధించి విశ్లేషించి నిగ్గు తేల్చవలసిన అవసరం ఉంది. 'వసు-మనుచరిత్ర రచనా విమర్శ' మీద పరిశీలన చేస్తూ కాశీభట్ల బ్రహ్మయశాస్త్రిగారూ, 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత' లో విశ్వనాథ సత్యనారాయణగారూ చేసిన విమర్శ విశ్లేషణలు ఒకదారి చూపుతున్నాయి. అదట్లా ఉంచి, కేవలంగా - వైనోదిక హాస్యం పూర్వపు 'ప్రహసనా' ల్లోనూ, యక్షగానాది రచనల్లోనూ విస్తృతంగా లభిస్తుంది.

వైనోదిక హాస్యం స్వతంత్రంగా ప్రవర్తిస్తే, అనువర్తిత హాస్యం అస్వతంత్రంగా, పరతంత్రంగా ప్రవర్తిస్తుంది. ఇక్కడ హాస్యం తన మౌలికతను కోల్పోయి, మరొక భావమో, విషయమో మరింకేదో వేసుకొన్న 'వేషం'గా ప్రవర్తిస్తుంది. ఈ ప్రవర్తన ఆయా అంశాల తీవ్రతను విరిచేస్తుంది. పూర్వ రచనలను గమనిస్తే, శృంగారేతరమయిన వీర కరుణాదుల సందర్భంగా హాస్యం కన్పించకపోవటానికి కారణం హాస్యంలోని ఈ విరిచే, తేలికపరిచే, పలుచపరిచే లక్షణమే ననిపిస్తుంది. బకాసురుడి ప్రమాదం విషయంగా దుఃఖబాధాతీవ్రతతో విప్రకుటుంబమూ, వారిని ఓదార్చే కుంతీదేవి సందర్భంగా నన్నయగారు బ్రాహ్మణ బాలునితో - నేనే ఈ కర్రపుల్లతో బకాసురుడిని చంపేస్తానంటూ అనిపించిన మాటల్లో వ్యక్తమయ్యే హాస్యం అక్కడి ఉద్వేగ తీవ్రతను పలుచపరచి అక్కడి వారిని నవ్విస్తుంది. అందువల్ల హాస్యాన్ని ఉపయోగించటం చాలా జాగ్రత్తగా చేయవలసిన అంశంగా గుర్తించవలసి ఉంటుంది.

ఆధునికంగా తెలుగు సాహిత్యంలో 'హాస్య' రచనలను మొదలు పెట్టింది కందుకూరి వీరేశలింగం పంతులుగారనేది కొత్తగా చెప్పవలసిందేమీ కాదు. ఆయన అనేక ప్రహసనాలు రచించారు. వీరేశలింగంగారు మౌలికంగా సంఘ సంస్కరణోద్యమగాఢ శీలి. ఆయన అధికంగా సాహిత్యాన్ని మాదిరిగానే హాస్యాన్ని గూడా సంస్కరణ భావాభివ్యాప్తికి ఒక సాధనంగా మాత్రమే స్వీకరించారు. అంటే, ఇక్కడ హాస్యం అనువర్తిత ప్రవృత్తితోనే సాగిందన్న మాట. వీరేశలింగం గారి ననుసరించి వేదం, గురజాడ, చిలకమర్తి, పానుగంటి, మంగిపూడి, కాళ్లకూరి మొదలయిన

ఎందరెందరో రచయితలు, కవులు హాస్యాన్ని విరివిగానే కాదు, విచ్చలవిడిగా ప్రయోగించారు. వీరి రచనల్లో వైనోదిక హాస్యంకన్నా అనువర్తిత హాస్యమే ఎక్కువ. ఎక్కువ మాత్రమేకాదు, ప్రధాన మయింది గూడా. ఈ ప్రయోగంలో హాస్యం ఉద్ధృతంగానూ, సుకుమారంగానూ ప్రవర్తించిన తీరుగూడా గమనించదగింది. కందుకూరి వారిలో హాస్యం ఉద్ధతంగా - మరొక విధంగా చెప్పితే, మొరటుగా ప్రవర్తిస్తే, గురజాడవారిలో సుకుమారంగా ప్రవర్తించినట్టు గుర్తించటం సులభమే. ఇది ప్రాధాన్య వివక్షయా చెప్పటమే తప్ప అక్కడ ఇది, ఇక్కడ అది అసలే లేదనటం కాదు.

ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి ఉంది. మన తొలి తెలుగు హాస్య రచయితలు చాలా వరకు ఒక వర్గం - బ్రాహ్మణ వర్గాన్ని మాత్రమే ప్రధానీకరించి రచనలు చేసారు. గురజాడ వారి 'కన్యాశుల్కం' రూపకం చూచినా, చిలకమర్తివారి 'గణపతి' నవల చూసినా ఈ అంశం స్పష్టపడుతుంది. కన్యాశుల్కం నాటకానికి తీసుకరాబడినంత వ్యాప్తి 'గణపతి'కి లభించలేదు గాని, అది ప్రత్యేకంగా వివిధ కోణాల నుంచి అధ్యయనం చేయవలసిన 'హాస్య' రచన. ఇందుకు కారణాలను ప్రత్యేకంగా అనుశీలించవలసి ఉంటుంది.

మొక్కపాటి, భమిడిపాటి, మునిమాణిక్యం, ముళ్ళపూడి వెంకటరమణ, గోరాశాస్త్రి, శ్రీరమణ, భానుమతిరామకృష్ణ సోమరాజు సుశీల వంటి ప్రముఖ హాస్య ప్రయోగంలో రెండు విధాల హాస్య ప్రవృత్తులు విడివిడిగానూ, కలగలుపుగానూ ఎంతో రమణీయంగా అనుభవంలోకి వస్తాయి. విశ్వనాథ, బుచ్చిబాబు, శ్రీ శ్రీ వంటి వారు 'హాస్య రచయితలు'గా ప్రసిద్ధులు కాకున్నా వారి రచనల్లో - నవలలు, నాటకాలూ, వ్యాసాలూ మొదలయిన వాటిలోనూ విలక్షణ హాస్యం లాస్యం చేస్తూనే ఉంటుంది. ఈ విధంగా ఈ నాటికి చూసుకుంటే, హాస్యరచనల విషయంలో తెలుగు ముందంజలోనే ఉన్నట్టు స్పష్టపడుతుంది. వైనోదిక - అనువర్తిత విధానాల్లో ఎంతో వైవిధ్యాన్ని సాధించిన తీరూ అనుభవానికి వస్తుంది.

పూర్వం ఎన్నో 'లహరి' కార్యక్రమాల్నీ ప్రచురణలనీ సమంగా నిర్వహించిన ప్రముఖ సాహిత్య సంస్థ 'యువభారతి' 'ఈసారి' హాస్యలహరి'ని ప్రవహింపజేస్తున్నది. ప్రముఖ హాస్యరచయితలలో - అందరినీ సాధ్యం కాదు కాబట్టి కొందరిని ఎన్నుకొని, వారి రచనల్లోని హాస్యరీతిని, హాస్య సృష్టినీ, దాని వివిధ కోణాలనూ ఆలోచనకూ, అనుభవానికీ అందుబాటులోకి గ్రంథరూపంలో తీసుకువస్తున్నది. ఈ సందర్భంగా నాలుగుమాటలనూ, ఊహలనూ, ఆలోచనలనూ వ్యక్తీకరించే అవకాశం నాకు కల్గించినందుకూ, ప్రయోజనాత్మక సాహిత్య కృషిని నిర్వహిస్తున్నందుకూ అభినందిస్తూ, కృతజ్ఞతలు తెల్పుకొంటూ 'యువభారతి' కృషి పురోభివృద్ధిని సర్వాత్మనా కాంక్షిస్తున్నాను...

25-12-2002

హైదరాబాదు.

**-ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య**



# హాస్యలహరి

## ఉపన్యాసమంజరి కార్యక్రమం

*సభావేదిక:* **శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం**
సుల్తాన్‌బజార్ - హైద్రాబాదు.

*సమయం:* **సాయంకాలం 6గం॥**

| | | |
|---|---|---|
| మొదటి సమావేశం: | 1-12-2002 | ఆదివారం |
| ప్రాచీన సాహిత్యంలో హాస్యం | : | ఆచార్య ఎస్వీ రామారావుగారు |
| కందుకూరి రచనల్లో హాస్యం | : | డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు |
| అధ్యక్షులు | : | శ్రీ కె.వి. రమణ గారు, ఐ.ఏ.ఎస్ ఆం.ప్ర.హౌసింగ్‌బోర్డు ఉపాధ్యక్షులు మరియు కమీషనర్ |
| ముఖ్యఅతిథి | : | పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణ రెడ్డి గారు, రాజ్యసభ సభ్యులు |

| | | |
|---|---|---|
| రెండవ సమావేశం: | 8-12-2002 | ఆదివారం |
| చిలకమర్తి సాహిత్యంలో హాస్యం | : | డా॥ ముక్తేవి భారతి గారు |
| పానుగంటి రచనల్లో హాస్యం | : | డా॥ వెలుదండ నిత్యానందరావు గారు |
| అధ్యక్షులు | : | ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు గారు, సుప్రసిద్ధ విమర్శకులు |
| ముఖ్యఅతిథి | : | డా॥ పొత్తూరి వెంకటేశ్వరరావు గారు, ప్రముఖ పత్రికా సంపాదకులు<br><br>పూర్వ అధ్యక్షులు, ప్రెస్ ఎకాడెమి. ఆం.ప్ర. |

| | | |
|---|---|---|
| మూడవ సమావేశం: | | 15-12-2002 ఆదివారం |
| గురజాడ కన్యాశుల్కంలో హాస్యం | : | శ్రీ శంకర నారాయణగారు |
| మొక్కపాటివారి రచనల్లో హాస్యం | : | శ్రీ ఇంద్ర గంటి శ్రీకాంత శర్మగారు |
| అధ్యక్షులు | : | ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారు,<br>కార్యదర్శి, ఆంధ్ర సారస్వత పరిషత్తు |
| ముఖ్యఅతిథి | : | శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు,<br>మహాకవులు, కేంద్ర సాహిత్య అకాడమీ<br>పురస్కార గ్రహీతలు |
| నాలుగవ సమావేశం: | | 22-12-2002 ఆదివారం |
| భమిడిపాటి కామేశ్వరరావు<br>రచనల్లో హాస్యం | : | శ్రీనండూరి పార్థసారథి గారు |
| మునిమాణిక్యం రచనల్లో హాస్యం | : | శ్రీ సుధామ గారు |
| అధ్యక్షులు | : | మహామహోపాధ్యాయ<br>ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు గారు,<br>ప్రముఖ సంస్కృత విద్వాంసులు, రచయితలు |
| ముఖ్యఅతిథి | : | ఆచార్య ఎన్.గోపి గారు,<br>కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారగ్రహీతలు<br>పూర్వఉపాధ్యక్షులు, పొ:శ్రీ తె. విశ్వవిద్యాలయం. |
| ఐదవసమావేశం: | | 29-12-2002 ఆదివారం |
| భానుమతి రామకృష్ణ<br>రచనల్లో హాస్యం | : | శ్రీమతి శారదా అశోక వర్ధన్‌గారు |
| ముళ్ళపూడి వెంకట రమణ<br>రచనల్లో హాస్యం | : | శ్రీ శ్రీరమణగారు |
| అధ్యక్షులు | : | శ్రీ కె.వి. రమణగారు ఐ.ఏ.ఎస్<br>ఆం.ప్ర.హౌసింగ్ బోర్డు ఉపాధ్యక్షులు మరియు<br>కమీషనర్ |
| ముఖ్యఅతిథి | : | మాన్యశ్రీ టి. దేవేందర్ గౌడ్ గారు,<br>ఆంధ్రప్రదేశ్ హోంశాఖామాత్యులు |
| విశిష్ట అతిథి | : | పద్మశ్రీ నేరెళ్ళ వేణుమాధవ్‌గారు<br>ధ్వన్యనుకరణ సమ్రాట్ |

# హాస్యలహరి
## అనుక్రమణిక



# ప్రాచీన సాహిత్యంలో హాస్యం

**-ఆచార్య ఎస్వీరామారావు**

రసం అంటే ప్రధాన సారం. మానవ జీవిత గమనంలో వివిధ భావానుభూతులకు ప్రాధాన్యం వున్నట్లుగానే, కావ్యజీవితంలో కూడా రసభావాలు ప్రధానపాత్ర వహిస్తాయి. కవి రచనల్లో వర్ణితమైన భావాలు పాఠకుల మనసుల్లో స్థిరంగా నాటుకున్నప్పుడే స్థాయిభావాలై రసాలుగా పరిగణింపబడుతాయి. లాక్షణికులు నవరసాలను పేర్కొన్నా వాటిలో శృంగార, వీర, కరుణ, శాంత రసాలకే ప్రముఖ స్థానం వుంది. మిగిలిన రసాలు వీటికి సహాయకారులై అంగరసాలుగా పరిపోషితమైనాయి. సంస్కృతంలోని ప్రసిద్ధ కావ్యనాటకాలే ఇందుకు నిదర్శనాలు. అందుచేత మన సాహిత్యంలో హాస్యం అంగరసంగానే ప్రసిద్ధి గడించింది. ఆధునిక కాలంలో భావవైవిధ్యానికి, వస్తువిస్తృతికి అనుగుణంగా హాస్యరసప్రధానమైన రచనలు కొన్ని వెలువడ్డాయి.

హాస్యరసానికి స్థాయిభావం హాసం. వికృతమైన రూప, వేషాలు, మాటలు, చేష్టలు హాస్యరసోత్పత్తికి దోహదం చేస్తాయని లాక్షణికుల అభిప్రాయం.

**"వికృతాకార వాగ్వేష చేష్టాదే ర్కుహ కాద్భవేత్ హాస్యో**
**హాసః స్థాయిభావః" -(సాహిత్య దర్పణము-విశ్వనాథుడు)**

నవ్వలేనివారు, సంగీతాన్ని విని ఆనందించనివారు ప్రమాదకరమైన వ్యక్తులు. షేక్స్పియర్ నాటకంలోని జూలియస్ సీజర్ కాషియస్ అనే వ్యక్తిని గురించి "He hears no music, seldom he smiles" అని పేర్కొంటాడు. మొగల్ పాదుషా అయిన ఔరంగజేబ్ కూడా హాస్యాన్ని ప్రేమించేవాడు కాదని, సంగీతాన్ని గోతిలో పాతిపెట్టమనే వాడని చరిత్రకారులు చెబుతారు. అందుకే ఆధునిక కవి తిలక్.

**"నమ్మకు నవ్వలేని వాడిని, పువ్వులు చిదిమే వాడిని**
**భోగం దాని పాటని, చౌఎన్లై మాటని"**

అని హృద్యంగా, సహృదయవేద్యంగా వచించాడు.

ఏమైనా హాస్యరసపోషణ కత్తిమీది సాము వంటిది. అందుకే దాని జోలికి అందరూ వెళ్లరు. సృజనాత్మక ప్రతిభ మూర్తీభవించిన చార్లీ చాప్లిన్ వంటి అరుదైన కళాకారులే అందులో సిద్ధహస్తులు అనిపించుకొంటారు. హాస్యం ఏ మాత్రం వెగటుకలిగించినా అపహాస్యం

పాలౌతుంది. ఈ సత్యాన్ని గుర్తించిన ప్రాచీనాంధ్రకవులు హితంగా, మితంగా హాస్యరసాన్ని పోషించారు. వ్యంగ్యోక్తుల్లో, వికటోక్తుల్లో సైతం లాలిత్యాన్ని జోడించి దానికి అంగరస స్థాయిని కల్పించారు. ఆదికవి అయిన నన్నపార్యుడే అందుకు మార్గదర్శనం చేశాడు.

నన్నయ్య హాస్యం పాఠకులను పగులబడి నవ్వించదు. చిలిపితనంతో కూడి చిరునవ్వులు చిందింపజేస్తుంది. జరత్కారుడు అనే ముని బ్రహ్మచర్యం అవలంబించటం చేత అతని వంశం అనపత్యదోషానికి గురియై ఆ వంశంలోని మునులు కొందరు అధోముఖులై చెట్టుకొమ్మలకు వ్రేలాడుతూవుంటే చూసిన జరత్కారుడు ఇలా అంటాడు.

క. **కడు నుగ్రము దలక్రిందుగ**
**బడి వ్రేలుట యిదియు నొక తపంబొకొ నాకే**
**ర్పడ జెప్పుడీ తపం**
**బే దొడగెద ననవుడును నయ్యధోముఖ విప్రుల్** (ఆది. 2-141)

బాధలో వున్న మునుల స్థితిని తపస్సుగా భావించి దానిగురించి వివరంగా చెప్పమని అడిగిన అమాయకత్వం మనకు వినోదాన్ని కలిగిస్తుంది. "మా వంశంలో జరత్కారుడు అనే పాపకర్ముడు వుండటం వల్ల మాకీ స్థితి కలిగింది. అతడు కనిపిస్తే మా బాధను గురించి తెలుపవయ్యా!" అని మునులు జరత్కారునితోనే చెప్పటం కూడా చమత్కారంగా వుంటుంది.

గాంధారపతి అయిన సుబలుడు అంధులైన ధృతరాష్ట్రునికి తన కూతురు గాంధారిని ఇస్తానని అన్నప్పుడు ప్రక్కనున్న బంధుజనులు

**తే॥ అంగములలోన మే లుత్తమాంగ మందు**
**నుత్తమంబులు గన్నుల యుర్విజనుల**
**కట్టి కన్నులు లేవను నదియకాక**
**యుత్తముడు గాడె సద్గుణయుక్తి నతడు** (ఆ. 5-11)

అని అంటారు. ఉద్ధతుడైన సుబలుని ఎదిరించలేక "ముఖ్యమైన కన్నులు లేకపోయినా అతడు గుణవంతుడు కదా!" అని సమర్థించటంలో ఎగతాళి కనిపిస్తుంది. ఋష్యశృంగుని అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని ఎంతో హాస్యాన్ని అందించాడు నన్నయ్య. వేశ్యను బ్రహ్మచారిగా భావించి ఆమె పెట్టిన ముద్దును వర్ణిస్తూ ఋష్యశృంగుడు తండ్రియైన విభాండకునితో చెప్పిన పద్యం చూడండి.

**ఉ నన్నును కౌగిలించుకొని నావదనంబునకున్ నిజాస్యమా**
**సన్నము జేసి యొక్క మృదుశబ్దము సేసె మనోహరంబుగా**
**నెన్నడు నట్టిశబ్దము మునీశ్వర మున్ విన యేనెరుంగన**
**య్యన్నున బ్రహ్మచారి ముఖ మంబురుహంబు సమంబు సూడగన్** (అర. 3-107)

అర్థయుక్తికే కాక అక్షరరమ్యతకు కూడా నిధి అయిన నన్నయ్య అలతి అలతి పద ప్రయోగం ద్వారా చక్కని హాస్యాన్ని సాధిస్తాడు. బాహుకుని రూపంలోవున్న నలుని విరహ ప్రలాపాలు విన్న అనుచరుడు ఈవిధంగా వచిస్తున్నాడు.

క **అఱపొఱడు కుఱుచ చేతులు**
**నొఱవ శరీరంబు గలిగి యొరులకు జూడం**
**గొఱగాకుండియు మన్మథు**
**నొఱపుల బడియెడు నితండు యువతీప్రియుడై** (ఆర. 2-135)
వ. **వీనిచేత దలంపంబడియెడు వనిత వీనికంటె** లెస్స కాకున్నె--- **(ఆర. 2-136)**

శబ్దాశ్రయ హాస్యానికి పై పద్యం చక్కని ఉదాహరణ. శబ్దవైచిత్రి ద్వారా హాస్యప్రియత్వాన్ని ప్రదర్శించటం కూడా నన్నయ్య భారతంలో గోచరమౌతుంది. గరుత్మంతుని ధాటికి తట్టుకోలేక దేవతలు నలుగడలకు పారిపోయిన సందర్భంలో ``సురవరులు సురరాజుమరుగుసొచ్చిరి, సాధ్యులు అనాయాస సాధ్యులై పారిరి, వసువులు వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితులైరి, దిక్పాలకులు వీకుదరిగి కాందిశీకులైరి'' అనివర్ణించటంలో పదప్రయోగవైచిత్రి (pun) ద్వారా హాస్యం సుసాధ్యమైంది.

నన్నెచోడుని కుమారసంభవంలో దక్షాధ్వర ధ్వంస ఘట్టంలో కూడా ఇటువంటి చమత్కారమే గోచరిస్తుంది. గణముల దాడికి నిలువలేక వనజభవుడు వాహనం ఎక్కలేక భయంతో నేలపైబడగా మరాళమే అతణ్ణి తీసుకొని వెళ్లిందట-గరుడి నెత్తికొని చక్రిపరచినాడట. సహస్రాక్షుడు అభ్రగజము మీదికి ఎగబ్రాకి పారిపోయినాడట. కుబేరుడు తానెక్కవలసిన నరవాహనాన్ని తొందరలో తానే ఎక్కించుకొని పారి పోయినాడట. పార్వతి వన విహార సందర్భంలో భ్రాంతిమదలంకారాన్ని ఊతగా చేసుకొని చక్కని హాస్యకల్పన చేశాడు నన్నెచోడుడు-

చ॥ **చెలువలు మఱ్ఱిమ్రానిపయి జిల్కలు మూవి రమింపవానిము**
**క్కులుగని మఱ్ఱిపండులని కోయగబోయిన వారి హస్తముల్**
**దవిరులుసావి కీరములు దండడి గుట్టిన ముగ్ధలందరున్**
**గలకొన బారిరోరి యిది గాటుల మ్రాననుచున్ భయంబునన్** **(కుమార. 9-117)**

చెలికత్తెలు మఱ్ఱిచెట్టుపై వ్రాలిన చిలుకల ముక్కులను మఱ్ఱిపండులుగా భావించి కోయబోగా వాళ్ల చేతులను చిలుకలు చిగురుటాకులనుకొని కుట్టగా ఇది కాటులు వేసే చెట్టు అని భయపడి పారిపోయారట.

"హృదయాహ్లాది చతుర్ధ మూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి" అని ఉగ్గడించిన కవిబ్రహ్మ హాస్యకుశలతను ప్రదర్శించటానికి విరాటపర్వ సన్నివేశాలు బాగా ఉపకరించాయి. సైరంధ్రివలె అభినయిస్తూ భీముడు కీచకునితో ఆడిన సరసోక్తుల్లోని వ్యంగ్యం మనను నవ్వించక మానదు.

క. నా యొడలు సేర్చినప్పుడ
నీ యొడలెట్లనునొదాని నీవెరిగెదు త
న్నే యబలల తోడిదిగా
జేయదలంచితివి తప్పుసేసితికంటే! (విరా. 2-338)

క. ననుముట్టి నీవు వెండియు
వనితల సంగతికి బోవు వాడవె యైనం
దనువే బడసిన ఫలమే
కనియెద విదె చిత్తభవ వికారము లెల్లన్ (విరా. 2-332)

ఉత్తర గోగ్రహణ ఘట్టంలో ఉత్తర కుమారుడు సన్నద్ధుడౌతూ కవచమును తారుమారుగా ధరించి స్త్రీలను నవ్వింపజేశాడు. ఇక యుద్ధరంగంలో భయాందోళనలకు గురియై సారథియైన బృహన్నలను వేడుకొంటూ పలికిన అమాయకోక్తుల్లో పసితనం గోచరమై పఠితలను మరింత నవ్వింపజేస్తుంది

తే. నిష్కశత శుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టవైడూర్యములు తురగాఢ్య రథము
కరటి దశకంబు నొకయూరు పురము నొచ్చి
నపుడు యిచ్చెద నీకను నార్తుడగుచు (విరా. 4-80)

క. నాతోడి ప్రేముడిం గడు
నాతురయై యెదురు చూచు నంబకు చేతః
ప్రీతిగ చని యాయమ పొడ
సూతుం బోనీగదే విశుద్ధ చరిత్రా! (విరాట 4-81)

దరహాసరసము, వెడనవ్వు, అలతి నగవు, లోచనముల నవ్వు మెరయగా-ఈ విధంగా పలురకాలయిన నవ్వులను పేర్కొనటంలోనే తిక్కన హాస్యప్రియత గోచరిస్తుంది.

కవి సార్వభౌముడైన శ్రీనాథుని కావ్యాలకంటె చాటు పద్యాలలో అతని హాస్యకుశలత విశదమవుతుంది. కష్టమైనా, సుఖమైనా చమత్కారాన్ని జోడించి వర్ణించటం అతని వైలక్షణ్యం. హేమపాత్రాన్నం చవిజూసిన శ్రీనాథుడు దేశసంచారంలో ఎదురైన చేదు అనుభవాలను

వివరించటంలో కూడా చమత్కారం గోచరమై మనకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. పల్నాడు ప్రాంతంలోని తిండి గురించి చెప్పిన చాటువులే ఇందుకు సాక్ష్యం-

ఉ. పుల్ల సరోజ నేత్ర! యలపూతన చన్నుల చేదు ద్రాగినా
నల్ల దవాగ్ని మింగితి నటంచును నిక్కెద వేల! తింత్రిణీ
పల్లవయుక్తమై యుడుకుబచ్చలి శాకము జొన్నకూటితో
మెల్లన నొక్కముద్ద దిగమ్రింగుము నీపసగాననయ్యెడిన్

క. రసికుడు పోవడు పల్నా
డెసగంగా రంభయైన యేకులె వడుకున్
వసుధేశుడైన దున్నును
కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్ (చాటు మణి 1-పు. 125)

దక్షిణదేశ యాత్రలో తారసిల్లిన అరవపిల్లమీద చెప్పిన పద్యం ఎంతో నవ్వు తెప్పిస్తుంది.

మేత కరిపిల్ల పోరున మేకపిల్ల
పారుబోతు తనంబున పందిపిల్ల
ఎల్ల పనులను జెరుపంగ పిల్లిపిల్ల
అందమున కోతిపిల్ల యీ యరవపిల్ల (చాటు. 1-పు. 130)

ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుడు శృంగార ప్రియుడుగా చెలామణీ కావటానికి అతని పద్యాల్లో ప్రతిబింబించే రసికతాభావమే కారణం. శృంగార రసం హాస్యాన్ని ఆలంబనం చేసుకొన్నప్పుడు ఎంతగానో అలరిస్తుంది. అందుకే అవి రెండూ మిత్రరసాలుగా పేర్కొనబడ్డాయి. అభిజ్ఞాన శాకుంతలంలో శకుంతల బిగుతైన తన కంచుకాన్ని వదులు చేయమని కోరినప్పుడు పెరుగుతున్న నీ యౌవనాన్ని నిందించుకో అని చెలులు చేసిన పరిహాసంలోని సున్నితత్వం ఆహ్లాదకరమైనది. అయితే శృంగారం పేరిట హాస్యం మితిమీరితే వెగటు కలిగించకమానదు. శృంగార నైషధంలో బువ్వపుబంతి సన్నివేశంలోని పద్యాలు అందుకు నిదర్శనమని సహృదయుల అభిప్రాయం. కాని చాటుపద్యాలలో తొంగిచూస్తే శ్రీనాథుని రసికత ఇందుకు అపవాదంగా వినోదాన్ని కలిగిస్తుంది.

ఉ. తొలకరిమించు తీవగతితోప దుకాణము మీదునున్న య
య్యలికుల వేణితో తములపాకుల బేరములాడబోయినే
వలచుటకేమి, శంకరునివంటి మహాత్ముడు లింగరూపియై
కులికెడు దాని గబ్బి చను గుబ్బల సందున నాట్యమాడగన్ (చాటు. మణి. 1-పు. 123)

వికటానుకరణంలో హాస్యాన్ని అందించే పేరడీలు ప్రాచీన సాహిత్యంలోనూ కనిపిస్తాయి. వీరులు రణరంగంలో మరణిస్తే స్వర్గభోగాలను పొందుతారన్న కవిసమయాన్ని కోడిపుంజులకు అన్వయిస్తూ క్రీడాభిరామకర్త నుడివిన పద్యం హాస్యభరితమైన పేరడీగానే చెప్పవచ్చు.

**హా! ఖగేంద్రులార! కయ్యమున నీల్గి**
**పోవుచున్నారె మీరు దేవతాభువనమునకు**
**మీరు రంభాతిలోత్తమా మేనకాది**
**భోగ కార్యార్థమై కోడిపుంజులార!** (క్రీడా. 236)

శ్రీకృష్ణదేవరాయలను శ్రీకృష్ణునితో పోల్చి కవయిత్రిమొల్ల చెప్పిన చాటుపద్యాన్ని అనుకరిస్తూ తెనాలి రామకృష్ణుడు వచించిన పద్యం కూడా ఈ కోవలోకే వస్తుంది-

సీ. **అతడు గోపాలకుండితడు భూపాలకుం**
**డెలమి నాతనికన్న నితడు ఘనుడు**

..............................................................

కృష్ణుడాతండు శ్రీమహాకృష్ణుడితడు (మొల్ల)

సీ. **అతడంబకు మగం డితడమ్మకు మగండు**
**నెలమి నాతనికన్న నితడు ఘనుడు**
**అతడు శూలము ద్రిప్పు నితడు వాలము ద్రిప్పు**
**నెలమి నాతనికన్న నితడు ఘనుడు**
**అతడమ్మున నసేయు నితడు కొమ్మునడాయు**
**నెలమినాతనికన్న నితడు ఘనుడు**
**అతనికంటను చిచ్చు నితనికంటను బొచ్చు**
**నెలమి నాతని కన్న నితడు ఘనుడు**
**దాత యాతండు గోనెల మోత యితడు**
**దక్షుడాతండు ప్రజల సంరక్షుడితడు**
**దేవుడాతండు కుడితికి దేవుడితడు**
**పశుపతి యతండు శ్రీమహాపశువితండు** (తెనాలి రామకృష్ణుడు)

పరమశివునికీ, ఎద్దుకూ సామ్యాన్ని కల్పించటం ద్వారా చమత్కృతిని సాధించాడు. సమకాలీన కవులపై రామకృష్ణుని అధిక్షేప పద్యాలు హాస్యభరితాలై సాహితీప్రియుల నాలుకలపై నడయాడుతున్నాయి. లఘ్వక్షరములతో కూడిన అల్లసాని పెద్దన, 'అమవసనిసి' పద ప్రయోగం పై రామకృష్ణుని ఆక్షేపణ చూడండి.

ఎమితిని సెపితివి కపితము
భ్రమపడి వెరి పుచ్చకాయ వడిదిని సెపితో
యుమెతకయ తిని సెపితివో
యమవసనిసి యనెడి మాట యలసని పెదనా! (చాటు 1-పు. 143)

వరూధిని 'కలస్వనంబుతో', (మనుచరిత్ర) సత్యభామ బాలపల్లవ గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వని'తో (పారిజాతాపహరణం), గిరిక 'కాంభోజీమేళ విపంచికా రవసుధాపూరంబు తోరంబుగా' (వసుచరిత్ర) శోకించిన పద్యాలు ప్రసిద్ధాలు. ఈ ముగ్గురు నాయికల ఏడ్పులు విన్న రామకృష్ణుడు

అల్లసాని వాడల్లనల్లన యేడ్చె
ముక్కుతిమ్మన ముద్దు ముద్దుగా నేడ్చె
భట్టుమూర్తి బావురుమని ఏడ్చె (చాటు. మణి. 1-పు.147)

అని చమత్కరించినాడు. కట్టుకథలలో వికటకవిగా పేరుపొందిన తెనాలి రామకృష్ణకవి పాండురంగ మాహాత్మ్య రచనలతో ప్రౌఢకవిగా యశస్సు నార్జించాడు. ఆ ప్రౌఢ ప్రబంధంలోని నిగమశర్మకథ మొ॥ ఘట్టాలలో కూడా అతని హాస్య ప్రియత ద్యోతకం కాకమానదు.

ఉత్ప్రేక్షాతిశయోక్తులతో కూడిన వర్ణనా భరితమైన ప్రబంధ సాహిత్యంలో కూడా హాస్యసన్నివేశాలు చోటు చేసుకొన్నాయి. విటులు పుష్పలావికలతో చేసే నర్మగర్భ సంభాషణల్లో చతురోక్తులు గోచరిస్తాయి-

"వెలది యానీ దండ వెల ఎంత? నా దండ
కును వెలబెట్ట నెవ్వని తరంబు?
కలువ తావులు గాన మలికదంబక వేణి?
కలువ తావులు వాడకయ కలుగునె" (ఆముక్తమాల్యద 2-19)

పింగళిసూరన కళాపూర్ణోదయంలోని సంఘటనలు షేక్స్‌పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' ను పోలి వుండటం కాకతాళీయమే అయినా రెండూ యించుమించు ఒకే కాలంలో వెలువడటం వింత గొల్పుతుంది. కళాపూర్ణోదయంలోని ఇద్దరు రంభల వివాదం సవతుల కలహాన్ని ప్రతిబింబిస్తూ హాస్యయుతంగా కొనసాగుతుంది. ఇద్దరి మధ్యాచిక్కి ఉక్కిరిబిక్కిరవుతున్న నలకూబరుణ్ణి నారదుడు ప్రశ్నించే తీరు వినోదాన్ని కలిగిస్తుంది.

నలకూబర! నీ కిందే
చెలువ ప్రియవధూటి నాకు జెపుమా? దానిన్
తెలియక దీవింపగ రా

"దలరు/డొకరొకళ్ల ప్రేమ" ననుచున్ (కళా. 3-211)

(నీ ప్రియవధూటి ఎవరో చెబితేగాని మీ ప్రేమ వర్ధిల్లాలి అని దివించలేనుగదా)

సవతుల కలహం వారికి ఎలా వున్నా, చూసే వారికి మాత్రం వినోద భరితంగానే వుంటుంది. కూచిమంచి తిమ్మకవి 'శివలీలావిలాసం' లోని గంగా గౌరీ సంవాదం ఇందుకు సాక్ష్యం. జానపదగేయాల్లో కూడా గంగాగౌరీ కథ రక్తి కట్టింది.

"గంగవైతే నీవు గగనమందుండక
మగని శిరమెక్కుట తగునటె గంగా
చాపలమ్మే నీవు జాలారి దానవు
నిన్నెట్లు వలచెనే నీలకంఠుండు"

ఆధునిక యుగంలో హాస్యభరితమైన శతకాలు వెలువడినాయి కాని ప్రాచీన శతక సాహిత్యంలో హాస్యంకంటే కేవలం అధిక్షేపమే పై చేయిగా కనిపిస్తుంది. వేమన పద్యాల్లో మాత్రం అధిక్షేపంతోపాటు స్వచ్ఛమైన హాస్యం చోటు చేసుకొంది. మచ్చుకు రెండు ఉదాహరణలు.

పాల సాగరమున పవ్వళించినవాడు
గొల్లయిండ్ల పాలుగోరనేల
ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపి
విశ్వదాభిరామ వినురవేమ

గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిమార్గ మదియె ముందుగా చూపురా
విశ్వదాభిరామ వినురవేమ

ప్రాచీనములైన చాటువుల వలెనే అర్వాచీన కాలంలో కూడా వివిధ అంశాలపై హాస్యభరితమైన చాటూక్తులు పెక్కు లభ్యమవుతున్నాయి. నల్లి, ఎలుక, నస్యం ఇలా లోకంలో ఎదురయ్యే చరాచర వస్తుజాలాన్ని తమ ఉక్తి చాతుర్యంతో హాస్యమయం చేశారు తెలుగు కవులు.

శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లిబాధ పడలేక సుమీ!

అతడు సామాన్యుడే నరేంద్రాలయాంత
రంతరానేక పేటికా క్రాంత వస్తు
హరణ సురధాణి, యవ్వినాయకు పరాణి
చారుతరమూర్తి, మూషక చక్రవర్తి
నస్యము, శీతమత్తగజనాశన హేతువిచారధీర పం
చాస్యము, సుప్తిరోగ నిబడాంధ తమః పటాలార్క బింబసా
దృశ్యము, వేద శాస్త్ర పటు దివ్యసుపండిత వాగ్విచిత్ర సా
రస్యము, రాజవశ్య ఖహిరాణ్మణికైన నుతింపశక్యమే
భుగ భుగమని పొగలెనయగ
నగణితముగ నాజ్యధార లాహుతి గాగా
నిగమాది మంత్రయుతముగ
బొగ ద్రాగనివాడు దున్నపోతై పుట్టున్

ఈ విధంగా ప్రాచీనాంధ్రకవులు సముచితంగా హాస్యరసాన్ని పోషించి రజజ్ఞులను ఆనందింపజేశారు.

**హాస్య గుళికలు**

ఏరికి తలవంచను - నే
ధీరుడనని పలికి పొడుగు దీర్ఘము తీసే
వీరుడు సైతము నెలకొక
మారును తలవంచు గదర మంగలి ముందున్!

కందములో అందముగా
సుందరినే పొగడుచుండ చురచుర జూచెన్
ముందర గల ఆమె మొగుడు-
మందుడ - నే చూడలేదు - మక్కెలు విరిగెన్!

అంతరిక్ష నౌక నధిరోహణము చేసి
అందుకొనెను మనుజు డంబరమును-
అందలేదు మనుజు డదియేమి చిత్రమో!
అతని చేయి తోడ అతని వీపు!

-ఆచార్య ఫణీంద్ర



# వీరేశలింగం హాస్యరచనలు

డా॥ అక్కిరాజు రమాపతిరావు

సాధారణంగా లోకంలో పెద్ద తప్పుగాని, చిన్నతప్పుగాని చేసినవారిని తప్పు పడితేవాళ్ళు ఒప్పుకోరు. చీవాట్లు పెడితే చీదరించుకుంటారు. ఆగ్రహిస్తే కక్ష పెంచుకుంటారు. తీవ్రంగా విమర్శిస్తే తిరగబడుతారు. తాముచేస్తున్నది తప్పు అని వాళ్ళు అనుకోరు. పరివర్తనం ఈ విధంగా తేవడం జరగనిపని.

అట్లాకాక వాళ్ళ ప్రవర్తన ఎంత అనౌచిత్యమో, సిగ్గుచేటో, ప్రమాదకారో, సాంఘిక విరుద్ధమో, తనకూ తనవారికి కూడా ఎంత అప్రదిష్ఠా పాదకమో హాస్యస్ఫోరకంగా గ్రహించగలిగేటట్లు చేస్తే ఆ ప్రయత్నానికి ప్రయోజనం సిద్ధిస్తుంది. తప్పుచేస్తున్న వారిని, అక్రమ ప్రవర్తకులను నగుబాట్లపాలు చేయడమన్నమాట అది.

తప్పుచేసిన అపాత్రుడు కూడా తన పాత్రను చూసి నవ్వుకోవాలి. సిగ్గుపడాలి. ముఖం వంచుకోవాలి. తలదించుకోవాలి. లోకవిరుద్ధంగా నడుచుకుంటే నగుబాట్ల పాలవుతామని గ్రహించాలి. అదీ ప్రహసనరచనా పరమోద్దేశం. వ్యక్తిగానీ, వ్యవస్థగానీ తప్పుదారిన పడినప్పుడు, సమాజానికి అపకారం చేస్తున్నప్పుడు బాధ్యతగల రచయిత ఆ తప్పులు ఎత్తిచూపుతాడు. అధిక్షేపిస్తాడు. కుటుంబం పట్ల తండ్రిలాగా తహతహలాడతాడు. తీవ్రంగా దండిస్తే, బహిష్కారం విధిస్తే కుటుంబ సంబంధాలు విచ్ఛిన్నమైపోతాయని నయానాభయానా తన పిల్లలకు ప్రబోధిస్తాడు. వాళ్ళ ప్రవర్తనలోని తప్పువాళ్ళే గ్రహించేట్లు చేస్తాడు. అదీ గొప్ప రచయిత చేసే పని. ప్రహసనరచన లక్ష్యం ఇదే. అంతేకాని చేష్టాగతమైన, వాచ్యమైన వినోదాన్ని, జుగుప్సాకరమైన హాస్యాన్ని సృష్టించడం కాదు ప్రహసనరచయిత చేయవలసిన పని.

ప్రహసనం అనే పేరులోనే బాగా నవ్వించడం అని అర్థం వుంది కదా. ఈ విధంగా నవ్వు తెప్పించడం అసభ్యంగా ఉండకూడదు. అశ్లీలం జొరబడకూడదు. కేవలం వికట చేష్టలవల్ల, అంగవైకల్యం వల్ల ఉత్పన్నమయ్యే హాస్యం, అది శుభ్రమైన హాస్యం కాదు. వికలమైన హాస్యమే అవుతుంది.

కరుణకూ, హాసానికీ సంయోగం కుదరదంటారు కాని, సమాజంపట్ల కరుణే గొప్ప రచయితలో అధిక్షేప రచనకు ప్రేరేపిస్తుంది. వాళ్ళది ధర్మాగ్రహం. అయితే కరుణ వాళ్ళ

సృజనతశక్తి అంతర్వాహిని. అందువల్ల వాళ్ళు చిన్నపిల్లలు పెద్ద తప్పులు చేసినా జాలిపడ్డట్లు, హాస్యంగా తీసుకున్నట్లు, సంఘంలోని లోపాలనుబయటపెట్టి ఆ బలహీనతలు కలవాళ్ళను మందలించటానికి పూనుకుంటారు.

సాహిత్య రంగంలోకాని, ఆధ్యాత్మిక జగత్తులోకాని, సంఘసంస్కర్తలలోకాని ప్రాచార్యులైన వారు, ప్రవక్తలైనవారు, ప్రవర్తకులైనవారు హాస్యప్రవృత్తి కల వారేనని మనకు సర్వేసర్వత్ర దేశీయంగానూ, అంతర్దేశీయంగానూ తెలుస్తూనే ఉంది. సాంఘిక చైతన్యాన్ని చేకూర్చిన ప్రతి మేధావీ కరుణాంతరంగుడే. లోకాన్ని బుజ్జగించి, లాలించి, నవ్వించి ప్రబోధం చేసినవాడే. ముఖ్యంగా సాహిత్యంలో అధిక్షేపానికి వున్న స్థానం ఆగ్రహానికి లేదు.

పరుల దోషాలను వెల్లడించడానికి హాస్యం పదునైన ఆయుధం. హాస్యం చేయడం ఆత్మీయతను వ్యక్తీకరిస్తుంది. తీవ్రనిరసనం ఆధిక్యతను ప్రదర్శించుకుంటుంది. నిష్కల్మషమైన, అవ్యాజమైన అంతఃకరణమే హాస్యప్రవృత్తికి, లోకం బాగుపడాలనే తాపత్రయానికీ, ఉద్విగ్నతకూ మూలమనిపిస్తుంది.

గొప్ప గొప్ప విద్వాంసులలో, తత్వవేత్తలలో, ఆత్మగుణసంపన్నులైన బోధకులలో, మహారచయితలలో లోకప్రవృత్తి పట్ల ఒకనెనరు, కరుణ ఉండటం వారి వారి వ్యక్తిత్వాలను పరిశీలించినప్పుడు స్పష్టమే.

వీరేశలింగం పంతులుగారికి కోపం ఎక్కువని ఆయన సమకాలికులు వ్రాశారు. ఆయన కూడా తన ఆగ్రహ ప్రవృత్తిని గూర్చి పలుసార్లు ప్రస్తావించారు. అయినా ఆ కోపమంతా ఆ అసహనమంతా, సామాజిక దురన్యాయాలపట్ల, అసంబద్ధతలపట్ల నిరసనమేననుకోవాలి. "అల్పశ్చకాలో, బహువశ్చవిఘ్నః" అనే ఆవేదన, అశాంతి, ఉద్వేగం, అనుకోవాలి. వీరేశలింగం సంకల్పించింది బ్రహ్మాండమైన కార్యక్రమం. ఒకవైపున ఆయన సంఘంలోని దుష్టశక్తులతో పోరాడాడు. రెండో పక్కన సమాజంలో భావవిప్లవం, సంస్కారచైతన్యం తీసుకొనిరావడానికి పాటుపడ్డాడు.

పందొమ్మిదోశతాబ్ది ఉత్తరార్థానికి తెలుగునాట సాంఘిక పరిస్థితులు శోచనీయంగా ఉన్నాయి. ప్రజల నిత్యజీవితంలో స్వార్థపరత్వం, కపటం, వంచన, అన్యాయపు ప్రవృత్తి ఎక్కువైనాయి. ఉన్నత విద్యా వర్గాలలో కూడా అక్రమధన సంపాదన కాంక్ష, భోగభాగ్యాలపట్ల లాలస, స్త్రీలపట్ల అమానుషమైన నిర్బంధం, వేశ్యావృత్తి, ఉద్యోగ నిర్వహణలో అవినీతి సర్వసామాన్యమైపోయినాయి.

"శాస్త్రములు పుస్తకంబుల శరణుపొందె, లంచములు మించె, చేటుకాలంబు వచ్చె, దుష్టులెల్లను ఉద్యోగధుర్యులైరి, అయ్యొ దేశము తానధమాధమంబు' అని వావిలాల

వాసుదేవశాస్త్రి 1975లో వేల్సు యువరాజు భారతదేశ పర్యటనకు వచ్చినపుడు మొరపెట్టుకున్నాడు. మీ పరిపాలన ఇట్లా ఉంది అని అన్యాపదేశమేమో తెలియదు. రాజమహేంద్రవరంలో ఆనాడు కవిత్రయంగా ప్రసిద్ధికెక్కిన వారిలో వావిలాల వాసుదేవశాస్త్రి గారు ఒకరు.

అట్లానే అదే కాలానికి సంబంధించి సమాజ పరిస్థితులను ఆదిభట్లనారాయణదాసు స్వీయచరిత్రలో ఇట్లా సమీక్షించారు. 'కోర్టుల ప్రమాణముల న్యాయముల బద్ధములకు, పోలీసులు దొంగతనములకు, దేవాలయములు వెలయాండ్రకు, కలిమి పాపమునకు, చెలిమి మోసమునకు, మున్సిపాలిటీలు మురికికి, 'హేతుభూతములుగా దోచెడిని' అన్నారాయన.

గురజాడ అప్పారావు చిత్రించిన కన్యాశుల్కంనాటి సాంఘిక పరిస్థితులు హృదయ విదారకాలే కదా. అతి బాల్య వివాహాలు, నిర్బంధవైధవ్యం, ముక్కు పచ్చలారని పసికూనలను కూడా కాటికి కాళ్ళు చాచిన వృద్ధులకు కట్టబెట్టడం, అప్పట్లో సహజ సాంఘిక ఆచారాలుగానే చెలామణి అయ్యేవనుకోవాలి.

అందువల్ల సంఘంలోని దురాచారాలన్నిటితోనూ వీరేశలింగం తలపడవలసి వచ్చింది. "వారి శ్రేయస్సును గోరియే మన వారిలో గల దుర్నీతి రుజలను బాపియిటువంటి ప్రియ గ్రంథౌషధ ప్రయోగము వలన బాగుజేయజూచితినిగాని వారి యందలి ద్వేషభావముచేత గాదు" అనీ సంఘములో గల వివిధ దురాచారములను వెల్లడిపరచివానిని మాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగానూ ' ప్రహసన రచనకు పూనుకున్నాన'ని ఆయనే చెప్పుకున్నారు.

ఆనాటి సంఘంలో ప్రజల మూలుగుల్ని పీల్చివేస్తున్న ఉద్యోగస్థుల లంచగొండితనం, వేశ్యాలంపటత్వం, పురోహితవర్గం వారిదంభప్రవర్తన, మతాచార పరిరక్షకుల అవినీతి, ఆత్మవంచనలను వీరేశలింగం ప్రహసనాలకు ఇతివృత్తం చేసుకున్నాడు.

ఇందుకోసం ఆయన పత్రికలు నడిపాడు. ప్రబోధసంస్థలు నిర్వహించాడు. ఉపన్యాసాలు చేశాడు. ఇందుకు తనలోని హాస్యరచనా సామర్థ్యాన్ని ఆయన చక్కగా వినియోగించుకున్నాడు. వ్యాధి తీవ్రతను బట్టి సాంఘిక దురాచార శస్త్రచికిత్సలను కూడా ఆయన నిర్వహించవలసి వచ్చింది. అప్పుడు కటువ్యంగ్యాన్ని, తీవ్రమైన అధిక్షేపాన్ని, చురుకైన హాస్యాన్నికూడా ఆయన ప్రయోగించాడు. ఆనాటి ప్రముఖులను ఆయన రచనలు నొప్పించాయి. ఆయన నడిపిన పత్రికలపై న్యాయస్థానాలలో అభియోగాలు కూడా ఆయన ఎదుర్కోవలసి వచ్చింది. అయినా ఆయన జంకలేదు.

ఆ రోజుల్లో ఇంకా హిందూ సమాజంలో మతపీఠాలు హిందువుల సాంఘికజీవితంతో

జోక్యం చేసుకుంటూ ఉండేవి. ముఖ్యంగా అగ్రవర్ణాలవారు ఈ పీఠాలపట్ల భయభక్తులతో మసలు కోవలసివచ్చేది. లేకపోతే ఆ పీఠాధిపతులు సంఘంలోంచి ఆ కుటుంబాల వారిని వెలివేసేవారు. వాళ్ళకు జీవితం దుర్భరం చేసేవారు. ఆయా నగరాలలో ప్రముఖుల ఇళ్లల్లో పాదపూజలు స్వీకరించి భోగభాగ్యాలతోడంబంగా విలాస జీవితంగడపటానికి కూడా కొందరు పీఠాధికారులు సంకోచించేవాళ్ళుకారు. ఆ పీఠాలదగ్గర ఉదరపూరణంకోసం చేరిన శిష్యులు సాంఘిక సంబంధాలలో అనుచితంగా ప్రవర్తించినా అటువంటి వారికి కాపుదల ఉండేది. ఇటువంటి పీఠాధిపతులు సమాజంలో సదాచారాన్ని, ఆధ్యాత్మిక భావాలను, ప్రజలలో స్వసంస్కృతి పట్ల అభిమానాన్ని, పాపభీతినీ, దైవచింతననుగూర్చి పట్టించుకోకుండా, ఇటువంటి ప్రబోధం చేయడానికి తమకు అర్హతలేకపోయినా తామేమో మతప్రతినిధులుగా వ్యవహరించేవాళ్ళు.

ఇటువంటి ఒక పీఠాధిపతిని గూర్చి వీరేశలింగం ఒక ప్రస్తావనలో వేళాకోళం చేశాడు. ఒక గృహస్థు ఇంట్లో పాదపూజలు పొంది భిక్ష స్వీకరించి సంతుష్టిగా భోజనం చేసి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో ఆ ఇంటి ఇల్లాలు స్వాములవారు ఏదైనా తమకు ఆధ్యాత్మికబోధ చేస్తారేమోనని 'స్వామిభగవద్గీతలు తీసుకొనివచ్చేదా' అని అడిగిందట. అప్పుడు స్వామి అమ్మా! చాలా భుక్తాయాసంగా ఉంది, కాస్త విశ్రమించి, రెండు గడియలైన తర్వాత తెస్తే పుచ్చుకుంటాను అన్నారుట. అంటే ఆయన వాటిని ఏదో ప్రత్యేకమైన పిండివంట అనో, మధురపదార్థమో అనుకున్నాడు కాని, హిందువులు తలదాల్చే పవిత్రగ్రంథం అనుకోలేదని వీరేశలింగంగారి వ్యంగ్యాస్త్రం. ఇటువంటి పీఠాధిపతులు కూడా అప్పట్లో కొందరుండేవారని వీరేశలింగం తమ జీవిత సంఘటనలలో ఉదాహరించారు.

ఇక ఆ కాలంలో పూర్వాచారపరాయణులతో ఆయన తన సర్వశక్తులు వొడ్డి ఎదుర్కోవలసివచ్చింది. సంఘంలో స్థిరంగా పాదుకొనిపోయిన భావాలను, దురాచారాలను, ఆనవాయితీలను, అవివేకాలను హేతువాదపూర్వకంగా ఖండించడం, భావపరివర్తన తేవడం ఎంతో కష్టం.

సమాజంలో సర్వానర్థాలకూ మూలకారణం మహిళ చదువుకోకపోవడమే, ఆమెను సంఘం విద్యావంతురాలిని చేయకపోవడమే అని వీరేశలింగం పంతులుగారి దృఢవిశ్వాసం. అందువల్ల ఆయన బాలికాపాఠశాలల స్థాపనకోసం పాటుపడ్డాడు. ఆడపిల్లలు చదువుకోవాలని ఉద్బోధించారు. మహిళలకోసం ప్రత్యేకించి పత్రికలు నడిపాడు. వాళ్ళకు పురుషులతోపాటు సామాజిక చైతన్యం ఉండాలనీ, హక్కులుండాలనీ, సమానత్వం సాధించాలనీ ఆయన ప్రబోధించాడు. కుటుంబం కుదురుకు మూలమైన స్త్రీ చదువుసంస్కారాలు లేనిదైతే ఆ సంఘంలో అనర్థకరమైన పరిణామాలు చోటుచేసుకుంటాయని ఆయన ఆవేదన చెందాడు.

అయితే పూర్వాచార పరాయణులకు ఆయన ఉద్యమం నచ్చలేదు. స్త్రీలు గడపదాటి బయటకు వస్తే లోకమంతా తారుమారైపోతుందని గగ్గోలు పడ్డారు. వీరేశలింగం సంఘంలో ఏదో పెద్ద అలజడి సృష్టిస్తున్నాడని ఆందోళన చెందారు. స్మృతి శ్రుతులు శాస్త్రం సదాచారం ఇందుకు విరుద్ధంగా ఉన్నాయని పూర్వాచార పరాయణులు వాదించారు. వాళ్ళూ కొన్ని పత్రికలు నడిపారు. కొక్కొండ వెంకట రత్నం పంతులుగారి ఆంధ్ర భాషా సంజీవని, దాసుశ్రీరాములుగారి అనల్పజల్పితాకల్పవల్లి, అటువంటి పత్రికలు. వేశ్యావృత్తిని నిర్మూలిస్తే వాళ్ళెట్లా బ్రతకాలనీ, సంఘంలో పడుపువృత్తిలేకపోతే కుటుంబ స్త్రీలు కూడా జారిణులవుతారనీ, ఇప్పటి వరకూ స్త్రీ విద్య సంఘంలో ఆదృతం కాకపోయినంతమాత్రాన సంఘానికి ఎటువంటి నష్టమూ వాటిల్లలేదనీ, స్త్రీ పురుషులు యుక్తవయస్సులో కలసి మెలసి చదివినందువల్ల, సన్నిహితంగా ప్రవర్తించినందువల్లా అనర్థకాలు సంభవిస్తాయనీ ఛాందసవర్గం ఆ రోజుల్లో వాదించేవారు. వీరేశలింగంపంతులు వివేకవర్ధిని, సత్యసంవర్ధిని, సతీహితబోధిని వంటి పత్రికలు స్థాపించి అవినీతి, అక్రమ ప్రవర్తనం, దురాచార దుర్మార్గవర్తనం నిరసించగా పిదపకాలం దాపురించిందనీ, వర్ణ సంకరం జరగబోతుందనీ, విచ్చల విడితనం ఎక్కువవుతుందనీ అంగలార్చారు పూర్వాచా పరాయణులు.

వీరేశలింగంగారి వివేకవర్ధనిని అపహాస్యం చేసి అందులోని భావాలను వెటకారం చేయడానికి కొక్కొండ వారు తమపత్రికకు అనుబంధంగా హాస్యవర్ధని అనే ప్రత్యేక విభాగాన్ని ప్రారంభించారు. ఆయన వివేకవర్ధనిని కూడా వేళాకోళం చేసేవారుట. అది ఎట్లానంటే వివేకవర్ధనిని తిరగేసి చదువుతూ, 'నిర్ధవకవేవి' అంటే వితంతువు ముండితశిరస్సు అని అర్థం చెప్పేవారుట. సౌభాగ్యచిహ్నాలైన నెరికురులు లోపమైనాయని. విశ్వస్త అని. అట్లానే కొన్ని హాస్యసంభాషణలు సృష్టించి అందులో వీరిగాడనే పాత్ర ప్రవేశపెట్టారుట కొక్కొండవారు. అది గ్రహించి వీరేశలింగం పంతులుగారు కూడా తమపాత్రలలో ఒకరికి 'నత్తి' సృష్టించి తన పేరు కొండ వెంకడు అని చెప్పడానికి కొ.కొ.క్కొ కొండ వెంకడు అనిపించేవారుట.

కాబట్టి వీరేశలింగంగారి రచనలలో హాస్యప్రియత్వాన్ని, ప్రవృత్తిని, సామర్థ్యాన్ని వెలికి తెచ్చినవారు కొక్కొండ వేంకటరత్నంగారనే చెప్పాలి. కొకొక్కొండవారు తమపత్రికకు 'హాస్యవర్ధిని' అనుబంధంగా ప్రచురించడం ప్రారంభించగానే వీరేశలింగం కూడా ఆయన అక్షరాయుధాలతో ఎదుర్కోవడానికి సిద్ధపడ్డాడు. వివేకవర్ధనికి కూడా ఒక అనుబంధాన్ని ప్రకటించడానికాయన పూనుకున్నాడు. తన హాస్యానుబంధానికాయన 'హాస్య సంజీవని' అని పేరు పెట్టాడు. మళ్ళీ దీంట్లో కూడా ఇంకో ప్రత్యేకానుబంధాన్ని ఆయన ప్రవేశపెట్టాడు. ఈ ప్రత్యేకానుబంధానికాయన కోదుభాషా సంజీవని అని పేరు పెట్టారు. అంటే కొండకోనల్లో జీవించే గిరిజన, వనజన, ఆదిమ జాతుల జీవిత వ్యవస్థను తెలియజేసే సమాచారం గల విభాగమన్నమాట. ఎన్నో వేల సంవత్సరాల నుంచి వాళ్ళు జీవించటం లేదా మనమూ అలాగే అడవుల్లోకి పోయినిక్షేపంగా,

నిరాక్షేపణీయంగా బతకవచ్చు అని వ్యంగ్యం.

వీరేశలింగం రచనలలో లలితమృదులమైన హాస్యంకంటే కటు, వ్యంగ్యవిలసితమైన హాస్యమే ఎక్కువ. అయితే సులలితమైన హాస్యం కూడా లేకపోలేదు. రాజశేఖరచరిత్రలో నీలాటిరేవున ఆ ఊరి ఆడవాళ్ళు తమ తమ కష్టాలను ముచ్చటించుకునేప్పుడు అలాంటి హాస్యరచన చేశాడాయన. ఊళ్ళోని ఆయా ఇళ్ళ మగవాళ్ళ నిర్వాకాలు ఎటువంటివో ఆ ఆడకూతుళ్ళ మనోవ్యథలలో ప్రసక్తమైనాయి. "ఈ లోకంలో అత్తలంతా ఒక్కసారి చచ్చిపోతే సంసారాలకు ఎటువంటి బాధలూ ఉండవు" అని ఓ కొత్తకోడలు మెటికలు విరుస్తుంది. భూతవైద్యుల మంత్ర తంత్రాలన్నీ ఎంతటి బూటకాలో ఆయన సృష్టించిన ఉదంతాలవల్ల ద్యోతకమవుతుంది. అది విషాదహాస్యాన్ని సృష్టిస్తుంది. ముఖస్తుతులు చేసేవాళ్ళు తమ పబ్బం ఎట్లా గడుపుకుంటారో ఆయన ప్రసక్తం చేసినప్పుడు మృదుహాస్యం వ్యక్తమవుతుంది.

ఆనాటి సాంఘిక పరిస్థితులను గూర్చి ఆయన ఇట్లా ఎత్తిపొడిచారు స్వీయచరిత్రలో "వేద పాఠశాలలకును శాస్త్ర పాఠశాలలకును చిల్లి గవ్వ యియ్యనొల్లని వ్యర్థ శ్రోత్రియులు సహిత మధికారుల మెప్పునకయి యీ వేశ్యల పాఠశాలలకు నెలకయిదులు, పదులు రూపాయలు చందాలిచ్చుచుండిరి".

"చాటున లక్ష దుష్కార్యములు చేయుచున్నను, బాహ్యవేషధారణమునందు మాత్రము లోపము లేకుండనున్నచో వారి ప్రవర్తనము సంపూర్ణముగా నెరిగియు నట్టివారి కందరును సభలో సహితము మంచినడవడి గల వారికి చేయుదానికంటె నెక్కువ మర్యాదను చేయుచుండిరి'. అని రాజశేఖరచరిత్రలో వేష్టపడ్డారాయన.

ఓడలు బండ్లయిన చందాన గృహపరిస్థితులు తారుమారు కాగా కాలినడకన కాశికి బయలుదేరిన రాజశేఖరుడుగారు పెద్దాపురం మజిలీలో ఒక సత్రంలో బసచేస్తారు. ఆ సత్రపు బ్రాహ్మణుడితో కాలక్షేపపు కబుర్లలో "మీ ఊళ్లో గొప్ప పండితులున్నారా!? అని అడుగుతాడు రాజశేఖరుడు. అప్పుడాసత్రపు వంట బ్రాహ్మణుడు ఆస్థాన పండితుడయిన హరిపాపయ్య శాస్త్రులుగారున్నారు. ఆయన యెప్పుడు ఎవ్వరితోను ప్రసంగింపడు కనుక అందరికంటెను గొప్ప పండితుడనివాడుక. ఆయన యొకసారి యీ సత్రములో జరిగిన సంతర్పణమునకు భోజనమునకు వచ్చినప్పుడు విశేషముగా మాటాడకపోయినను భుజించినందున ఆయన గొప్ప పండితుడనియే నేను నమ్మినాను" అని చెప్పాడు. ఇంకొక పండితుణ్ణి గూర్చికూడా సత్రపు వంట బ్రాహ్మణుడు ఇట్లా చెప్పాడు. 'మాగురువులు భానుమూర్తిగారు వేదాంత శాస్త్రమందు నిరుపమానమయినప్రజ్ఞగలవారు. నాకు మొన్న రోగము వచ్చినప్పుడు పుణ్యలోకము వచ్చుటకు తగిన సదుపాయము చేసి పదిరూపాయలను పట్టుకొని పోయినాడు. ఆ మరునాడే దొంగవస్తువొకటి ఆయన అధీనంలో కనపడటం"వల్ల ఆయనను పోలీసులు రాణాకు

తీసుకొనిపోయినార'ని చెపుతాడు. ఈ విధంగా కపట పండితులను, వైద్యులను ఆయన తన రచనలలో పదే పదే 'యద్దేవా' చేశారు.

ఆసత్రపు బ్రాహ్మణుణ్ణే రాజశేఖరుడుగారు, సంధ్యావందనం వేళ అయిందికదా 'సంధ్యావందనం చేశావా?' అని అడుగుతాడు. అప్పుడా సత్రపాకశాలనిర్వాహకుడు 'ఎన్నడో వడుగునాడు నేర్చుకొన్న సంధ్యావందనం మరచిపోయాను. ఇప్పటిదాకా జ్ఞాపకం వుంచుకొన్నానాఏమిటి?' అంటాడు. 'పోనీ అర్ఘ్యమైనా విడిచావా?' అంటే 'ఒక్క అర్ఘ్యమేకాదు, సంధ్యావందనమంతా విడిచాను' అంటాడు బ్రాహ్మడు. ఈ విధంగా సమయం, సందర్భం ఏ కాస్త దొరికినా, సమాజంలోని అగ్రవర్ణాల వారి దాంభికపువర్తనను, ఆచరణ శూన్యమైన శాస్త్రోపదేశాలను వీరేశలింగం వెక్కిరించారు.

ఇక పెద్దాపురం దగ్గర భీమవరం అనే పల్లెలో జరిగిన వైష్ణవస్వాముల శిష్య సమాశ్రయణ వృత్తాంతాన్ని వేళాకోళం చేశారు వీరేశలింగంపంతులుగారు తన రాజశేఖర చరిత్రలో.

'ఒక వైష్ణవ స్వామి పల్లకిలో గూరుచుండి యిరు ప్రక్కలనిద్దరు వింజామరలు వీచుచుండ కరదీపికలనేకములు వెలుగ నూరేగుచుండెను! ఆయన పల్లకితోపాటే నడుస్తున్నఒక వైష్ణవుడు రాజశేఖరుడు గారికి పరిచితపూర్వుడేకాబట్టి ఆయన్ను పిలిచి ఇట్లాముచ్చటించారు రాజశేఖరుడుగారు. ఆ పల్లకిలో కూచున్న వైష్ణవస్వామిని గూర్చివాకబు చేస్తూ రాజశేఖరుడు ఇట్లా అడిగారు! 'వెనుకనేను చూచినప్పుడు మీరు గురువులుగాను, మీకాయన శిష్యుడుగాను ఉండెడివారు కారా?' దీనికి ఈ స్వామి ఇట్లా సమాధానం చెప్పారు. 'మాలో మాకటువంటి భేదము లేదు. నాకు శిష్యులున్న గ్రామములో నతడు శిష్యుడుగాను, అతనికి శిష్యులున్న గ్రామములో నేను శిష్యుడనుగాను మారు చుందుము' అంటారు.

మా తాతలు పండితులు, మాకు చదువురాకపోతేనేం? వాళ్ళ శిష్యులను పంపకం చేసుకున్నాము అంటాడీయన. ఈ విధంగా ఆనాటి సమాజంలోని వికృతాలన్నిటినీ వీరేశలింగం తన రచనలలో అధిక్షేపించారు.

సత్యవతీచరిత్రలో అత్తాకోడళ్ళ తగవులూ, తోడికోడళ్ళ మాత్సర్యాలు నిర్వేదపూరిత హాస్యస్ఫూరితంగా వీరేశలింగం చిత్రించాడు. ఉద్యోగస్థులలోని లంచగొండితనం, నాటువైద్యుల డంబాచార ప్రవర్తనం, స్త్రీల ప్రసూతివేళ మోటు చికిత్సలు వ్యంగ్యం స్ఫురించేట్లు వర్ణించారు. ఈ నవలలో ఒకసతీసహగమన వృత్తాంతం వస్తుంది. దాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. ఇంగ్లీషువాడు వచ్చిన తరువాత పూర్వపు కట్టుబాట్లు, సంప్రదాయాలు ఎట్లా పాడైపోయినాయో, ఈ నవలలో ఒక వృద్ధురాలు వాపోతుంటే విషాదకరమైన హాస్యం స్ఫురిస్తుంది. అంతేకాక ఆనాటి సమాజంలోని అహేతుకమైన మూఢవిశ్వాసాల నన్నిటినీ వీరేశలింగం తన నవలలో, వ్యాసాలలో తూర్పారపట్టారు.

ఇక ఆయన హాస్యం బాగా పదును తేరింది. 'సత్యరాజాపూర్వదేశయాత్రలు' అనే ప్రహసన ప్రాయమైన నవలలో, ఇంగ్లీషులో జోనాథన్‌స్విఫ్ట్ రచించిన 'ది గలివర్సు ట్రావెల్స్' ఆధారం చేసుకొని తెలుగులో వీరేశలింగం పంతులు రెండు భాగాలుగా 'ఆడు మళయాళం', 'లంకాయాత్రలు'గా ఈ హాస్యరచన చేశాడు. కథాప్రవర్తకుడైన సత్యరాజాచార్యులు తన విదేశ యాత్రలలో చూసిన వింతలు, విచిత్రాలు, అద్భుతాలు, ఈ రెండు భాగాలలో వర్ణితమైనాయి. ఉపోద్ఘాతంగా సత్యరాజాచార్యుల స్వీయచరిత్ర మొదటి ప్రకరణంగా 'ఆడుమళయాళం'లో కనపడుతుంది. ఈ స్వీయచరిత్రలో కూడా సమకాలం నాటి సాంఘిక పరిస్థితులు, ఉద్యోగస్థుల లంచగొండితనం, పెండ్లి పేరంటాల ఆర్భాటాలు, వేశ్యావృత్తివల్ల సంఘంలో సంభవించే అనర్థాలూ వర్ణితాలు.

ఆ రోజుల్లో విశాఖపట్నం నుంచి చెన్నపట్నం పోవాలంటే పొగఓడలే శరణ్యం. నాలుగురోజుల ప్రయాణకాలం పట్టేది. సత్యరాజాచార్యుల సముద్ర ప్రయాణం కూడా చాలా వినోదాత్మకంగా వర్ణించారు వీరేశలింగం. ఇక చెన్నపట్నంలో అరవభాషయాస, వాళ్ళవింత తెలుగు కూడా హాస్యయుతంగా ఆయా సంఘటనలద్వారా వీరేశలింగం చిత్రించాడు. అన్నసత్రాల అనాచారం వర్ణించాడు. పేరుకు ధర్మసత్రమేగాని అన్న విక్రయం వింతలు అభివర్ణించాడు. బ్రాహ్మణులధంభ ప్రవర్తనను, అనాచారాన్ని ఆక్షేపించారు.

ఈ 'సత్యరాజాపూర్వదేశయాత్రల'ను వీరేశలింగం ఎంత చాతుర్యంగా రచించాడంటే ఈ నవల వాస్తవంగా జరిగిన కథే అనీ సత్యరాజాచార్యులవారి చిరునామా తెలుపవలసిందనీ ఆయనకెన్నో ఉత్తరాలు వచ్చాయట. ఎన్నో కష్టాలు పడి సత్యరాజుగారు ఆడు మలయాళం చేరారు. అక్కడ సమాజ వ్యవస్థను చూసి ఆయన చాలా ఆశ్చర్యపడ్డాడు. తన మాతృదేశంలో లాగా కాకుండా అక్కడ అంతా ఆడవాళ్ళదే పెత్తనం. ఉద్యోగాలన్నీ వాళ్ళే చేస్తారు. ఆ దేశంలో పురుషులు చదువుకోరు. చదువుకోకూడదు. వాళ్ళెప్పుడూ గృహ నిర్బంధంలోనే ఉంటారు. అక్కడ భోగపురుషులుంటారేకాని భోగస్త్రీలుండరు. అక్కడి భాష కూడా వింత భాష. వాళ్ళవేషం కూడా సత్యరాజుగారికి చాలా విస్మయం గొలిపింది. సత్యరాజాచార్యులు ఆడుమళయాళంలో ప్రవేశించగానే ఆయన్ని అక్కడి భటులు నిర్బంధిస్తారు. అయితే ఒక అధికారి(ణి!) ఆయనపై జాలికలిగి తన ఇంటికి తీసుకొనివెళ్ళి అక్కడ ఆయనకు వసతి సౌకర్యం చేస్తాడు. క్రమంగా ఆదేశభాష నేర్పిస్తాడు. "మూడు మాసములలో వారి భాష నొకరీతిగా నేను ధారాళముగా మాటాడుటకు నేర్చుకొన్నాను" అని సత్యరాజాచార్యులవారే శెలవిచ్చారు.

మాతృదేశంలో స్త్రీలు ఆచరించే శిష్టాచారమంతా ఆడుమళయాళంలో పురుషులు నిర్బంధంగా ఆచరించాలి. హిందూదేశంలో వితంతువైన స్త్రీకి తలగొరిగించినట్లే ఆడుమళయాళంలో పత్ని మరణించినపుడు పురుషుడికి ముక్కుకోసివేస్తారు. ఇందుకు కారణం

అటువంటి పురుషుడు పాప కార్యప్రవృత్తుడై వ్యభిచారాది దోషాలకు పాల్పడడని. అతణ్ణి ఏ స్త్రీ దగ్గరకు రానీయదని పూర్వాచార పరాయణులు, వైదికాచారనిరతులమని ప్రకటించుకొనేవాళ్ళు భర్తృహీనలశీలం, పరిరక్షించే ఉద్దేశంతోనే ఏకాదశి ఉపవాసాలు, ముండిత శిరస్సు, అధఃశయనం, కఠోరనియమాలు విధించినట్లుగా సమర్థించడాన్ని ఏవగించడానికే విధురులైన ఆడమళయాళం పురుషులను ముక్కిడులుగా చేయడమని అర్థమవుతూనే ఉంది. దీని కోసం నాసికాకృంతనోత్సవం కూడా ఆదేశంలో జరుపుకుంటారట. హిందూ దేశంలో స్త్రీలు మూడువందల అరవైనోములు నోచే ఆచారం ఉండగా ఆడుమళయాళంలో పురుషులు అంతకన్నా ఎక్కువ నోములునోయడం పూర్వాచార సంప్రదాయమని వీరేశలింగం కల్పించారు. భారతదేశంలో పతిభక్తి ఎంతటి విశిష్టమైన ధర్మమో ఆడుమళయాళంలో పత్నీభక్తి అంతకన్నా ఎక్కువ ధర్మం, సదాచారం. శిష్టాచారం, పురుషులకు పత్నీభక్తినే విధించే, బోధించే శాస్త్రాలు వాళ్ళ రండీభాషలో ఎన్నో ఉన్నాయి. మహిళ కాళ్ళు కడిగి ఆ శ్రీపాదతీర్థాన్ని పురుషుడు సేవించాలని స్మృతిశ్రుతులు విధిస్తున్నాయక్కడ. ఆ బాల్యంలో అక్కడ పత్నీభక్తిని పాఠశాలల్లో, శుభకార్యాలలో, సదాచార గోష్ఠులలో బోధిస్తుంటారు. అయితే ఆ దేశంలో కూడా ఇప్పుడిప్పుడే సంఘసంస్కరణ ప్రయత్నాలు తలెత్తుతున్నాయి. పురుషుల సామాజిక ప్రతిపత్తిని కోరేవారు. బలపరచేవారు కొందరు స్త్రీలలో ఉద్యమిస్తున్నారు. ఆ ప్రయత్నాలకు అనేక విఘ్నాలు ఎదురైనా ఆ మహిళలు తమ ప్రయత్నాలు కొనసాగిస్తూనే ఉన్నారు. అని సత్యరాజాచార్యులు ఆ దేశపు విపరీతస్థితులను చూసి ఖేదమోదాలు అనుభవిస్తాడు. ఆడుమళయాళంలో పత్నిని 'పంథీ' అంటారు. భర్తను 'భూడా' అంటారుట. పంథీ అనే శబ్దానికి యజమానురాలు, కుటుంబ వ్యవహర్త అని అర్థమట. అట్లానే 'భూడా' అనే మాటకు దాసుడు అని అర్థమట. లోబడి అణిగిమణిగి ఉండవలసినవాడు అని ఈ శబ్దార్థం.

ఆ భాషలో 'పత్నీవ్రతధర్మ బోధిని' అని ప్రశస్తమైన ధర్మశాస్త్ర గ్రంథం ఉంది. అందులోని ముఖ్యాతిముఖ్యమైన తొమ్మిది పద్యాలు సత్యరాజాచార్యులవారు తెనిగించారు. అందులో ముఖ్యాతిముఖ్యమైన పద్యాలిట్లా ఉన్నాయి:

"పురుషుని కిమ్మహి పత్నియె
పరమంబగు దైవతంబు పత్నీ సేవన్
నిరతము చేసెడి పురుషుడె
పరమున నిహమున సుఖంబు బడయుంజుమ్మీ

ప్రతి దినంబును పురుషుండు పత్నికంటె
ముందుగా లేచి నదిలోన మునిగి జలము

కలశమునదెచ్చి నిజపత్నికాళ్ళు కడిగి
తాను స్త్రీ పాదతీర్థంబు తాగవలయు
దూరమున జూచిపత్నిని
గౌరవమునలేచి యొంటి కాలున బురుషుం
డోరగ వంగంగ వలయును
కూరిమి కూర్చుండ నిల్వగూడదుసుమ్మీ
పురుషుండుగార్దభమునున్
స్థిరమగుదండనము లేక చెడి పోదురిలన్
కరుణదలంపక నెలకొక
పరియైనం గొట్టవలయు పత్ని పురుషునన్

ఈ విధంగా హిందూ దేశంలో మహిళపట్ల కనపరుస్తున్న వివక్షకు వీరేశలింగం ఈ రచన వ్యాజంగా దుయ్యబట్టాడు.

వీరేశలింగం హాస్యరచనలలో కటువ్యంగ్యం, తీవ్రకాకువు కొన్ని చోట్ల దర్శనమిస్తుంది. చమత్కార హాస్యం కూడా లేకపోలేదు. 'కలిపురుష శనైశ్చర విలాసం'లో కల్లుకెంగిలి లేదు అని చెపుతూ

**'పొగచుట్టకు సతిమోవికి**
**అగణితముగ మద్యమునకు నమృతమ్మునకున్**
**తగ నుచ్ఛిష్టములేదని**
**ఖగవాహనుతోడకాలకంఠుడు బలికెన్**
**అని సురాపానమత్తుడై శని అభిభాషిస్తాడు.**

గురజాడ అప్పారావు కన్యాశుల్కం నాటకంలో ఈ పద్యాన్ని అనుకరించి గిరీశం చేత వెంకటేశానికిట్లా బోధచేయిస్తాడు.

**ఖగపతి అమృతముతేగా**
**భుగభుగమని పొంగిచుక్కభూమిని పడియెన్**
**పొగచుట్టైజన్మించెను**
**పొగతాగని వాడుదున్నపోతైపుట్టున్**

ఇంతేకాక వీరేశలింగం బ్రాహ్మవివాహాన్ని ప్రతిబింబించే సన్నివేశాలు, సంఘటనలు, కల్పనలు గురజాడ కన్యాశుల్కంలో ఉన్నాయి. ఇతివృత్తం కూడా చాలావరకు సంవదిస్తుంది.

గురజాడకుముందే వీరేశలింగం కన్యాశుల్కంపేర ఒక ప్రహసనం రచించాడు. కన్యాశుల్కం దురాచారం వల్ల సమాజంలో ఎన్ని అనర్థాలు సంభవిస్తున్నాయో కూడా ఆయన వ్యాసాలు వ్రాశాడు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి ప్రహసనం వ్రాసింది వీరేశలింగమే. ఆ కాలంలోని సర్వసాంఘిక దుర్మార్గాలను ఆయన ప్రహసనాల ద్వారా లోకానికి వెల్లడి చేశాడు. ఆయన నూరు ప్రహసనాలు దాకా ఆయన రచించాడు. అవి మూడు చిన్న సంకలనాలుగా వెలువడ్డాయి. ఆయన సర్వరచనలు పదకొండు సంపుటాలుగా వెలువడినప్పుడు ప్రహసనాలనే మొదటి సంపుటంగా ఆయన ప్రకటించాడు. వీరేశలింగం ప్రహసనాలను గురజాడ అప్పారావు కూడా మెచ్చుకున్నాడు. మునిసిపాలిటీలలో, న్యాయస్థానాలలో, విద్యాలయాలలో, దేవాలయాలలో, ప్రభుత్వశాఖలలో చోటుచేసుకున్న అక్రమ ప్రవర్తనలను అవినీతినాయన ప్రహసనాలద్వారా బట్టబయలు చేశాడు. ప్లీడరు నాటకమని పేరుపొందిన ఆయన వ్యవహారధర్మబోధినిలో ఆనాడు పోలీసులు, ప్లీడర్లు, న్యాయాధికారులు సాగిస్తూవచ్చిన దౌర్జన్యాన్ని, అవినీతిని బట్టబయలు చేశాడు.

సాహిత్యంలో కూడా ఆయన పేరడీరచనలు చేశాడు. తొట్టతొలుతటి సంచిక హాస్య సంజీవనిలోనే ఆయన వికట కావ్యం అభాగ్యోపాఖ్యానం వెలువడింది. అప్పటికాయనకు వయస్సు 30 సం.రాలు కూడా లేవు. అప్పటి వరకూ తెలుగు సాహిత్యంలో వచ్చిన మూసకట్టు ప్రబంధ ధోరణులను అధిక్షేపించడానికే, వేళాకోళం చేయడానికే వీరేశలింగం ఈనూట పదహారు గద్య పద్యాత్మకమైన రచనలు చేసినట్లు కనపడుతుంది.

ప్రతి ప్రబంధంలోనూ ఒక రాజు, ఆయన నగరం, అందులోని చాతుర్వర్ణాలు, ఆ ఊరి వైభవం వర్ణితంకావడం, ఆ రాజుగారు వేటకు వెళ్ళడం, అక్కడ ఒక సుందరి ఆయనకు తటస్థపడడం, ఆమెను ఈయన, ఈయనను ఆయమ మరులుకొనడం, వాళ్ళ విరహావస్థ, పరస్పరం దూతకృత్యం, ఇత్యాదివర్ణనలన్నీయథావిధిగా ఉంటాయి. ఇటువంటి వర్ణనలను అపహాస్యం చేయడానికే వీరేశలింగం అభాగ్యోపాఖ్యానం రచించాడు. పులిపాడు (వ్యాఘ్రాఖ్యపట్టణం) ను అభాగ్యుడనే దానవరాజు పరిపాలిస్తుంటాడు. ఆయన ఒకరోజు వేడుకమీద వేటకు బయలుదేరుతాడు. పౌరాంగనలందరూ ఆయన్ను దర్శించాలని ఉవ్విళ్ళూరుతారు. ఆయన వేటాడిన జంతువులు కుందేళ్ళు. అక్కడొకపాడు పడ్డ దేవాలయంలో 'రక్తవర్ణాలకసైరిభాంగి, మర్కటానన, పర్వతమధ్యభార'ను రాజు చూస్తాడు. ఇక విరహం, తక్కిన వర్ణనలన్నీ యథావిధిగా సాగిపోతాయి. వ్యభిచారం వల్ల సంభవించే సర్వానర్థాలు ఈ ప్రహసనాప్రాయమైన పద్యరచన ద్వారా వీరేశలింగం వెల్లడించారు.

మహారణ్యపురాధిపత్యంలో కూడా ఒక వంచకుడు సంఘంలో ప్రముఖస్థానాన్ని ఎలా సముపార్జించాడో వ్యంగ్యంగా చెప్పిపాడిచే కథ. వీరేశలింగం రచనలను, ఆయన సృష్టించిన హాస్యాన్ని గూర్చి తెలుసుకోవాలంటే ఆయన కాలం నాటి సాంఘిక నేపథ్యాన్ని ముందుగా అధ్యయనం చెయ్యాలి. అప్పుడుగాని వీటి స్వారస్యం బాగా బోధపడదు.

ఆ వ్యాఘ్రాఖ్యపట్టణం ఏలేరాజును ఇట్లా వర్ణించాడు వీరేశలింగం

**"అతనికి బొట్టకోసినను నక్షరమొక్కటిలేదు; కాగడన్**
**వెతికినతెల్విలేదు; దయవీసమునుం గలనైన లేదు, ప్రో**
**న్నత నయవిద్యలేదు పదునాల్గుపుటంబులు పెట్టికాల్చినన్**
**చతురతవాతపెట్టినను సత్యము జిహ్వకు రాదొకప్పుడున్'**

ఈ రచనను గూర్చి' నేకల్పింపంబూనిన హాస్యరస ప్రధానంబగునభాగ్యోపాఖ్యానంబు' అనే చెప్పుకున్నాడు వీరేశలింగం. అరణ్యవాసం చేస్తున్న ధర్మరాజు దగ్గరకు ఒక పరిహాసకుడు వచ్చి ఈ కథను చెప్పినట్లు వీరేశలింగం కథోత్పత్తిని ప్రసక్తం చేశారు. ఇక వీరేశలింగం రచన 'సరస్వతీ నారద విలాపం' కూడా హాస్యరచనమే. శబ్దార్థచమత్కారాలు లేకుండా కేవలం అక్షర క్రీడలో నిమగ్నులైన కవుల రచనలను గూర్చి దుఃఖిస్తూ సరస్వతీదేవి ఒక విపినంలో దుఃఖిస్తుంది. నారదుడు కూడా సంగీతం సానివాళ్ళపాలైనందుకు దుఃఖిస్తూ అక్కడికే చేరుకుంటాడు. తల్లీకొడుకులు తమ దురవస్థను ఒకరినొకరు చెప్పుకుని దుఃఖించడం ఈ ఖండకావ్యం ఇతివృత్తం.

ఇక వీరేశలింగం రచించిన తిర్యగ్విద్వన్మహాసభ', 'మహారణ్యపు రాధిపత్యం' కూడా ప్రహసనప్రాయరచనలే. కాటిదగ్గరశవాన్ని ఆశించి నక్క, గద్దలు ఏ విధంగా పోటీపడతాయో ఆ విధంగా పురోహితవర్గం ప్రవర్తించారని అధిక్షేపించాడు వీరేశలింగం.

శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపై
పవళించుట నల్లిబాధ పడలేక సుమీ!



# హాస్యవాఙ్మయ నిర్మాత చిలకమర్తి

డా॥ ముక్తేవి భారతి

**హా**స్యవాఙ్మయ నిర్మాతగా తెలుగుసాహిత్యంలో ఒక ప్రత్యేకమైన స్థానముంది చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారికి, ప్రహసనాలలోనేకాక, చిలకమర్తివారు తమ రచనలన్నిటిలోనూ హాస్యాన్ని పండించటం విశేషం.

హాస్యం మనసుకీ, శరీరానికీ కూడా ఆరోగ్యాన్ని అందిస్తుందని అందరూ అంగీకరిస్తారు.

హాస్యం అంటే?

హాస్యం రసమనిచెప్పేవాదం భరతుని కాలంనుంచే ప్రసిద్ధమైంది. భారతీయులు రసప్రవృత్తికి, పురుషార్థసాధనకి సంబంధాన్ని భావించారు. కనుక హాస్యం కూడా హాసభావోత్పత్తితోపాటు, ఒక పురుషార్థ ప్రయోజనాన్ని సాధించాల్సి వుంది.

హాస్యం ఎలా కలుగుతుందీ అంటే-

"సహ వికృతి వేషాలంకార ధార్ష్ట్యలౌల్య కలహాసత్ప్రోలాష వ్యంగ్య దర్శనదోషోదాహరణాది ఖర్విభ వైరుత్పద్యతే"- "విపరీతౌలం కారైర్యికృతాచారిభిదాన వేషైశ్చ, వికృతిరంగవికారైః హసతీతి రసస్స్మృతో హాస్యంః"-

"విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారి భిః నీతస్సదస్య రస్యత్వం హాసో హాస్య ఇతీ అతః"-

-ఎన్ని విధాలుగా హాస్యాన్ని గురించి నిర్వచించినా, మానవ ప్రకృతిని వికృతిని చూపించి లోకాన్ని నవ్వించి, వికృతి వివేకాన్ని కలిగిస్తూనే, ప్రకృతివైపు సామాజిక మనఃప్రవృత్తిని మరల్చాలి అనేదే మూలం - వికృతిని అభినయంలో ఆకార వాగ్విశేష చేష్టాదులవల్ల నటుడు సాధిస్తాడు- ఆకార వికృతి ఆంగికాభినయానికి, వేషవికృతి ఆహార్యాభినయానికి, వాగ్వికృతి వాచకాభివయానికి, చేష్టావికృతి కొంత ఆంగికానికి, కొంతసాత్త్వి కాభినయానికి సంబంధించి వుండటం రూపకాలలో గమనిస్తాము. హాస్యం విభావ అనుభవసంచారీ భావాలచే సభ్యులను రంజింపచేస్తుంది. హాస్యం ఆత్మస్థమనీ, పరస్థమనీ రెండు విధాలుగా చెప్పబడింది. స్వకీయమైన హాస్యకల్పన తనను నవ్వించి, ఎదుటి వారినీ నవ్వించవచ్చు. పరస్థహాస్యం ఉద్దేశపూర్వకమైందే కనక పరులకు హాస్యం కలిగి తీరుతుంది.

ఆధునికుల్లో, రచనద్వారా హాస్యాన్ని పండించిన మునిమాణిక్యం నరసింహారావుగారు హాస్యాన్ని గురించి వివరించారు. ''దైనందిన జీవితంలో ఒక ఆచారాన్ని ఆదర్శాన్ని మనం ఆచరిస్తాం. దానికి విరుద్ధమైన స్వల్ప విషయమైనా అపహాస్యం కలిగిస్తుంది. అందుకే నవ్వు సంఘంలోని వ్యక్తుల్ని విమర్శించడానికి ఉపయోగించే ఆయుధమవుతోంది. నవ్వటంలో ఒక సత్యపరిశీలనా దృష్టి ఒక నీతిబోధ లేకపోలేదు''. (మన హాస్యము-మునిమాణిక్యం నరసింహారావు)

కనక, హాస్యం హృదయాన్ని కదిలించగలదని అందులోనూ అధిక సంఖ్యాక హృదయాలను రంజింపజేయగల శక్తిదానికుందని అంగీకరించాలి.

హాస్యానికి సంబంధించిన అన్ని లక్షణాలు, నిర్వచనాలు అందిపుచ్చుకుని, తన రచనలలో పొందుపరిచిన మహాకవి చిలకమర్తి. చిలకమర్తివారు నాటకాలు, నవలలు, ప్రహసనాలు, కథలు, నవ్వులగని, వినోదాలు, స్వీయచరిత్ర-ఇలా ఎన్నెన్నో రచనలు చేసారు. వీటన్నిటిలోనూ హాస్యం తళుక్కున మెరిపించి కొన్నిట, పరోక్షంగా నిల్చింది కొన్నిట. ప్రత్యక్షమైంది కొన్నిట. నాటకాలలో విదూషకాదిపాత్రలు హాస్యరసోత్పత్తికి ప్రవేశపెడతారు నాటకకర్తలు.

గయోపాఖ్యాన నాటకం చిలకమర్తి వారికి ఎనలేని కీర్తిని సంపాదించి పెట్టింది. శ్రీకృష్ణుల చెలికాడైన కౌశికుడు, రుక్మిణీదేవి చెలికత్తె హంసపదికల సంభాషణలలోని హాస్యం కథ ముందుకు సాగిపోయినా పాఠకుడి మనసులో కదులుతూనే ఉంటుంది. బృందావనానికి బయలుదేరాలి అనేది సందర్భం.

రుక్మిణీదేవి పవ్వళించిన దగ్గర, వెన్నెలలో ఒకమంచంమీద గుర్రుపెట్టి నిద్రపోతోంది హంసపదిక. ఆ పరిచారికని లేపాలని ప్రయత్నిస్తున్నాడు కౌశికుడు.

''చిన్నప్పుడు పగటివేషములలో ఎగిరి జంతువుల కూతలు సరిగా కూయుట నేర్చుకొనిన విద్యావంతుడనగుటచే, ఆమె మంచము క్రిందదూఱి కుక్కమొఱిగినట్లు మొఱుగ నారంభించితిని''-ఆ విషయం హంసపదికగ్రహించింది. బెత్తముతో బాదింది. ''నేను, నేనే, కుక్కనుగాను, కొట్టకే'' అని మొరపెట్టుకుంటే, ఆహంసపదిక, ''నీవు కుక్కవే, మాటలు నేర్చిన కుక్కవు సుమా అని రెట్టించింది. ఆ కౌశికుడు దెబ్బలుతినలేక, గోళ్ళతోదాని ఒళ్ళు బరికి, పళ్ళతోదాని చేతులు కరిచి, ఏలాగో ప్రాణాలు దక్కించుకుని బయటపడ్డాడు. ఈ సంఘటన నాటకంలో చూస్తుంటే నవ్వకమానరు ప్రేక్షకులు. హంసపదిక కౌశికుని కవ్విస్తూ ఆయన నరసింహావతారమెత్తాడు. నీవు గడియ కిందట గ్రామసింహావతారమెత్తావు అంది. చిలకమర్తివారి గయోపాఖ్యానం నాటకంలో ఈ పాత్ర సృష్టి చమత్కార సంభాషణల ద్వారా హాస్యాన్ని సృష్టించే ప్రయోజనం కలదే. పారిజాతాపహరణ నాటకంలో కైరవుడు శ్రీకృష్ణుని చెలికాడు. హంసపదిక

రుక్మిణి చెలికత్తె-వీరి సంభాషణలో కూడ చాలా హాస్యం గుమ్మరించాడు చిలకమర్తి. కైరవుడు ఆకాశంవైపు చూస్తూ, "ఈ సూర్యచంద్రబింబములు కాలపురుషుడను వర్తకుని చేతి తక్కెడ సిబ్బులట్లున్నవి" అంటాడు. చంద్రాస్తమయాన్ని, సూర్యోదయాన్ని చూస్తుంటే ప్రకృతి సొగసుకి ఆ కైరవుని మనసు అలా పరవసించటంతోనే హాస్యముత్పన్నమయింది. రుక్మిణి ఆ కైరవునితో శ్రీకృష్ణుని గురించి అడుగుతుంటే, అన్నీ అసందర్భపు ప్రేలాపనలు చేసాడు కైరవుడు. రుక్మిణి వానితో "ఏమి నీకు పిశాచము పట్టినదా ఏమి, అసంబద్ధములు పల్కెదవు" అంది కోపంగా. వెంటనే "నేనే బ్రాహ్మణ పిశాచమునై అందరను బీడించెదను. నన్ను బీడించువాడెవ్వడు" అన్నాడు. ఆ మాట రుక్మిణి .....ఏమీ నీ హాస్య ప్రసంగము అని ఈ విప్రకుమారుని ప్రసంగము నా కోపము నగము చల్లార్చినది అనుకుంది మనసులో.. అంటే, ఇంత చిన్న మాటచమత్కారంతో, హాస్యప్రయోజనాన్ని సాధించారు చిలకమర్తి. చమత్కార వచనముచేత నిజము అబద్ధం లాగ, అబద్ధం నిజంలాగ చేయటం ద్వారా నవ్వుపుడుతుందిక్కడ.

నరకాసురవధ అనే నాటకంలో మందపాలుడు, వజ్రకంసుడు అనే వారిద్దరూ నరకాసురుని బంట్లు, వీరి స్వర్గంలో ప్రవేశించారు. కానీ వాళ్ళకి స్వర్గం నచ్చలేదు. ఎందుకంటే,

"స్వర్గముపై గల దురభిమానముచే దీనినంతగా వర్ణింతురేకాని, దీనియందేమి గొప్ప యున్నదీ! ఈ మందాకినినది ఒక సముద్రమంతయున్నది. కాని ఇందు నాకు కావలసిన చేపలు, జెల్లలు, నత్తలు, పీతలు, రొయ్యలు లేనే లేవు. ఈ నదికన్న మా వూరి చెరువే నయము. ఈ వేల్పువీటియందు తాటిచెట్టే లేదు కదా. అన్నము తిని నీళ్ళు తాగి యెరుగని యీ నిర్భాగ్యులగు దేవతలకు తాటిపండు తినునంతటి భాగ్యము కూడ లభించునా" అని మందపాలుడు దేవతలపై జాలిపడి, తను ఇక్కడ కూర్చుంది రంభను చేపట్టి తీసుకుపోవాలనిట-ఆరంభ ఏమైందో ఎవరూ చెప్పటం లేదని రంభకోసం వెతుకుతుంటే, మందపాలునికి, నరకుని మరో సేవకుడు వజ్రకంఠుడు కనిపించాడు. రంభ కనిపించిందా అని అడిగాడు వజ్రకంఠుణ్ణి. ఆ రంభ ఎలా ఉంటుందో కొంచెం ఆనవాలు చెప్పు అన్నాడు వజ్రకంఠుడు. మందపాలుడు రంభ ఆనవాలు చెప్పాడు, "-అది చక్కని చుక్క. దాని శరీరకాంతి తాటి పీశమువలె పచ్చగనుండును. దాని తలవెండ్రుకలు మసిబొగ్గులో జీడిగింజలో అనుకొనవలెను. దానికొప్పుమాల కాకివలె, అప్పుడే ఆవములోనించి తీసిన పిడతవలెనల్లనై పెద్ద దిగనుండును. దాని జడ ఇనుపగరిట కాడవలెనుండును. కన్నులు ఆలిచిప్పలు. దాని పెదవి కొత్తావకాయ పేడువలె ఎర్రనైయుండును. మొగయు ఇత్తడి సిబ్బవలె గుండ్రముగా నుండును. అది సొక్కుచు సోలుచు, నిక్కుచు, నీల్గుచు చుక్కల్లో చంద్రునిలాగ, గజ్జెల గోడిగలాగ, రామచిలుకలాగ, గోరింకలాగ, పిగిలిపిట్ట లాగ, నెమలి పెంటిలాగ, హంసలాగ, తళతళలాడుతూ, పకపక లాడుచూ, "అచ్చము బోగము దానివలె" నుండును అన్నాడు. అంతేకాక, దాన్ని

చూస్తేమహామునులకయినా మనసుకదులకమానదు అన్నాడు మందపాలుడు. అది నీకు కనిపించిందా అని అడిగితే వజ్రకంఠుడు. " ఆ నిన్నరాత్రికలలో కనబడినది" అన్నాడు. నరకాసురుని సైన్యం స్వర్గంపైకి దండయాత్ర చేయగానే రంభాదులంతా తప్పించుకు పారిపోయారు. అయినా, రంభాసంభోగం కోరేవారంతా యుద్ధంలో మరణించాలి ముందు, కనక "నీ ఒక కత్తితో పొడిచికొని చచ్చిపొమ్ము అప్పుడు నీకు రంభపొత్తు కలుగుతుంది" అన్నాడు వజ్రకంఠుడు.

-ఈ నాటకంలో హాస్యసంభాషణలు చాలా వున్నాయి. ఈ హాస్యంలో చాలా అధిక్షేపముంది.

చిలకమర్తివారు చాలా నాటకాలు రచించారు. వాటన్నిటిలోనూ చిన్నపాత్రలేకాక, ఇతర పాత్రలలో కూడా హాస్యం అక్కడక్కడ జొప్పించి, హాస్యప్రయోజనాన్ని సాధించారు చిలకమర్తి.

చిలకమర్తివారు సాంఘిక, చారిత్రక, పౌరాణికనవలలు చాలా రాసారు. రామచంద్ర విజయము, గణపతి, రాజరత్నము మొదలైన సాంఘిక నవలలలో సమయోచితంగా హాస్యాన్ని ఆ పాత్రలరూపచిత్రణలో సంభాషణా తీరులో ప్రయోగించారు చిలకమర్తి. అన్ని రచనల లక్ష్యం ధర్మం విజయం పొందటం, అధర్మం నశించటమే. ఈ లక్ష్యసాధనకి హాస్యం ఆయుధంగా వాడటం చిలకమర్తి రచనలో విశేషం. చిలకమర్తివారు నవలల్లో వీధిబడిగురించి రాస్తూ, ఆనాటి విద్యావిధానాన్ని సునిశితమైన హాస్యంతో తెలియజేసారు. పిల్లవాడు బడికి వెళ్ళే దృశ్యాన్ని చిలకమర్తి వర్ణిస్తూ, "వెయ్యేల, దొంగతనము మొదలయిన క్రూరకృత్యములు జేయు మహాద్రోహులను కూలాడజెరసాలకు పంపక ఈ బడికి పంపిన వారెన్నడును నేరములు చేయరు' ' అంటారు. రామచంద్ర విజయమనే నవలలో ఆ రకమైన పాఠశాలలు, ఆ పాఠశాలల్లో ఉపాధ్యాయులు, వీరు విధించే శిక్షలు కళ్ళకు కట్టినట్టు చూపటమే చిలకమర్తి వారి లక్ష్యం.

హాస్యవాఙ్మయ నిర్మాతగా చిలకమర్తికి గొప్పస్థానం కల్పించిన నవల 'గణపతి.' ఇది సాంఘికనవలగానేకాక హాస్య నవలగా ప్రసిద్ధిచెందింది. ఒకనాటి తెలుగుదేశ సాంఘిక స్థితిగతులకి దర్పణమిది. విద్యావిహీనుడై, బంధుజనాదరణలేని నిర్భాగ్యుడై, ఆనాటి దురాచారాలైన మేజువాణీ లాటి వానిపై మోజు వదులుకోలేని యువకుడు గణపతిపాత్రను సృష్టించారు చిలకమర్తి. గణపతిలోని లోపాలను సమర్థించేందుకు తల్లిపడేపాట్లు, శవవాహకుల స్వార్థపరత్వాన్ని, నిరక్షరాస్యులైనా ఉపాధ్యాయపదవికి సిద్ధమయ్యే పంతుళ్ళను, కడుపుబ్బ నవ్వించే సన్నివేశాలతో 'గణపతి' నవలను పాఠకులకు అందించారు చిలకమర్తి.

గణపతి నవల ఎందుకు రాయాల్సొచ్చిందీ అనే విషయమే హాస్యంగా చెప్పారు చిలకమర్తి. మిత్రుని ఇంటికి విందుకెళ్ళారు. ఆ విందులో వడ్డన సమయంలో, మధ్యలో చాలా ఆలస్యమయిందట. అంతలో చిలకమర్తి కునుకు తీసారు. ఆ కునుకులో ఒక కలవచ్చింది.

ఆ కలలో గణపతి ప్రత్యక్షమయ్యాడు. "నా చరిత్ర మీరు తప్ప వేరు ఎవ్వరు వ్రాయజాలరు' ' అన్నాడు గణపతి.

గణపతిలో మూడు తరాల చరిత్ర రాసారు. గణపతి తాత పాపయ్య, గణపతి తండ్రి గంగాధరుడు-తరువాత గణపతి "సింగమ్మకు వరప్రసాదియై పప్పుబోట్ల వంశరత్నాకర పూర్ణచంద్రుడై యీ కథానాయకుడైన గణపతి జన్మించెను" అన్నారు. గణపతికి నాలుగేండ్లు నిండక మునుపే తండ్రి మరణించాడు. గణపతి, తల్లితో సహా మేనమామ యింటికొచ్చాడు.

గణపతి చరిత్ర వ్రాయకపోతే ఏమవుతుందో కూడా చిలకమర్తికి కలలో కనిపించిన గణపతి చెప్పాడు. "కాశీలో గోహత్య చేసినట్లే. ప్రయాగలో బ్రహ్మహత్య సల్పినట్లే. కురుక్షేత్రములో కుక్కను తిన్నట్లే. మీరు వ్రాయనిపక్షమున నేను దయ్యమునై మిమ్ములను మీ వంశమువారిని బదునాలుగు తరములవరకు బట్టుకొని పీకికొని తినియెదను. జాగ్రత్త! మీరు వ్రాసిన తరువాత నా చరిత్రము పఠియించిన వారికి పంచమహాపాతకములు కలుగును. పఠియింపనివారు చెదపురుగులై పుట్టి మరియొక జన్మమున పుస్తకమును దినివేయుదురు." చిలకమర్తి కునుకులోంచి లేచేసరికి, వడ్డన బ్రాహ్మణుడు చిలకమర్తి చేతిమీద వేడి చారు పోసాడు. ఇలా హాస్యంగా ప్రారంభించిన గణపతి నవలను హాస్యనవలల స్థానంలో గొప్ప స్థానం పొందేలా రచించారు చిలకమర్తి.

గణపతి బడికిపోవటం ఒక వింతదృశ్యం. యమకింకరుల్లాంటి పిల్లలు గణపతి కాళ్ళు చేతులు పట్టుకొని బడికి ఈడ్చుకు పోతారు రోజూ. గణపతి ఆ పిల్లల్ని గోళ్ళతో బరికి, గిల్లి, పళ్ళతో కొరికి, ఉమ్మి, నోటికొచ్చినట్టు తిట్టి, పెద్ద గోల చేస్తాడు. గణపతికి చదువు అబ్బలేదు. గణపతికి చిన్నప్పట్నుంచీ గుర్రమెక్కాలని కోరిక. ఆ కోరిక తీరటం కష్టంకనక గాడిదనెక్కినా ఫరవాలేదు అనుకున్నాడు గణపతి. గణపతి గాడిదపై ఊరేగటం గొప్ప హాస్యసన్నివేశం. పైగా గుర్రానికి గాడిదకి తేడా లేదని గణపతి వాదించటం మరో విశేషం. గుర్రములాగ దానికీ నాలుగు కాళ్ళున్నాయి మనుష్యులను మోయగలదు. పైగా గుర్రానికి ఒక సాల కావాలి. గాడిదకి అక్కర్లేదు. అయినా గాడిదనెక్కితే నవ్వుతారు. 'ఒకరి చర్యతో నాకు పనిఏమి. "నేను కుక్క నెక్కుతాను, గుర్రము నెక్కుతాను, గాడిదనెక్కుతాను" అంటాడు ధైర్యంగా. తల్లి మందలిస్తే తల్లిని రకరకాలుగా ఒప్పిస్తాడు. ఊరివారితో అంటాడు. "భాగ్యవంతుడు వరి అన్నం తింటాడు. పేదవాడు జొన్నకూడు తింటాడు. ఉన్నవాడు ఏనుగునెక్కుతాడు. మరొకడు గుర్రమెక్కుతాడు. లేనివాడు గాడిదనెక్కుతాడు-అయినా, గాడిద గొప్పతనం మీకేం తెలుసు, శ్రీకృష్ణమూర్తి వారి తండ్రియైన వసుదేవుడు ఆపదవచ్చినపుడు గాడిదకాళ్ళు పట్టుకున్నాడా, ఏనుగుకాళ్ళు పట్టుకున్నాడా, గొర్రెకాళ్ళు పట్టుకున్నాడా, గుర్రంకాళ్ళు పట్టుకున్నాడా" అంటాడు గణపతి. గొప్ప హాస్య సంభాషణలు కొనసాగించారు చిలకమర్తి ఇక్కడ.

గణపతికి కోటు తొడుక్కోవాలనే కోరిక. అందుకని గణపతి భోక్తలకు పైను గుడ్డలు ఇస్తే తీసుకోవద్దని, కోటుగుడ్డలీయాలని, లేకపోతే బ్రాహ్మణార్థం చేయని ఒక నాయకునిలా గొడవ ప్రారంభించాడు. ఈ విషయంలో రెండుపక్షాలుగా విడిపోయి, కొట్లాటలు జరిగాయి. గణపతి మిత్ర బృందాన్ని పోగుచేసి, మనదీ శరీరమే. వీనికీ ముచ్చట్లుంటాయి. కనక శ్రాద్ధకర్మలో కోటుగుడ్డలే కావాలని అందరమూ అరవాలి అని చెప్పాడు. ఈ కోటుగుడ్డ కథ చివరికి ఆ ఇంటి యజమాని గణపతిని బాది వెళ్ళగొట్టడంతో ముగిసింది.

ఇలాంటి హాస్య సన్నివేశాలెన్నో ఉన్నాయి గణపతి నవలలో. ఇవేకాక గణపతి ఉపాధ్యాయకత్వంలో హాస్యం పొట్టచెక్కలయ్యేలా చూపినా, అది అధిక్షేపాత్మకమే.

గణపతి సిద్ధాంతం ప్రకారంపంతులు పాఠాలు చెప్పక్కర్లేదు. భయము చెప్పాలి. "చదువు చెప్పుట కష్టమనుకున్నావా ఏమిటీ, దాశరథీ అని రెండు కూనిరాగాలు తీసి చెప్పగానే సరా ఏమిటి. భయము చెప్పాలి, అదీ ప్రజ్ఞ, అదీ సొగసు. పంతులుగారిని చూడగానే గజగజవణికి మూర్ఛపోవాలి పిల్లవాడు. వాడే పంతులు అంటాడు గణపతి. గణపతి నవలలో చిలకమర్తివారు "శ్రీరఘురామ, చారుతులసీదళధామ-అనే దాశరథి శతకపద్యానికి గణపతి చెప్పిన ప్రతి పదార్థతాత్పర్యాలు సాహిత్యంలో ఒక హాస్య ఉదాహరణగా మిగిలింది. ఒకనాడు శ్రీరాములవారు పైత్యముగ ...................కాపించుకున్నారు. ఆ దేశంలో కరివేపాకు లేనందున తులసిదళాలే అందులో వేసి రంగరించారు. ఆ చారు తాగబట్టే శ్రీరాములవారికి కఫముపోయింది. ఆ చారు తాగబట్టే అంటూ నోటికి వచ్చినట్టు చెప్పాడు ఉపాధ్యాయ గణపతి.

గణపతి పిల్లల్ని శిక్షించే పద్ధతి వింటుంటే నవ్వు ఆగదు ఎవరికైనా. బెత్తము పట్టుకున్న గణపతి దండధరునిలా కనిపిస్తాడు పిల్లలకి. గోడకి చేరబడి దౌడలునొప్పి పెట్టేవరకు చుట్ట తాగుతాడు. పిల్లవాడు ఆలస్యంగా బడికి వస్తే ఆలస్యంగా వచ్చావా అని బాదుతాడు. ముందువస్తే, ఇంట్లో పనీపాటా లేదా అని బాదుతాడు. పాఠం గబగబా అప్పగిస్తే 'వెనకనించి నిన్నెవరుతరుముతున్నారు' అని బాదుతాడు. మెల్లగా పాఠం అప్పగిస్తే, అన్నం తినలేదా, లంఘనాలున్నావా అని బాదుతాడు. పాఠం గట్టిగా అప్పగిస్తే, నాకేమన్నా చెముడా, దెయ్యపుగొంతుతో అలా అరుస్తావు అని బాదుతాడు. బెత్తము దాస్తే పిల్లవాడు చెడిపోతాడని రోజూ నాలుగైదు బెత్తాలు పిల్లల వీపుమీద విరిగిపోతాయి గణపతి చేతిలో.

"చిలకమర్తి వారి నవల గణపతిలో ప్రతివాక్యంలోనూ హాస్యమే. ఆ నవల చదివి కడుపుబ్బ నవ్వి, నవ్వి, నలుగురితో ఆ హాస్యం పంచుకోకపోతే తోచదు. అయినా ఇది హాస్యనవల కాదు, అధిక్షేపాత్మక నవలే అని మనసు చెప్తుంది. చివరికి-నవ్వులేకుండా గణపతి నవల చదవలేరెవరూ.

చిలకమర్తివారి రాజరత్నము నవల సాంఘిక సంస్కరణలో భాగంగా స్త్రీ జనోద్ధరణ లక్ష్యంగా రచించిన నవల. ఇందులో దామోదరయ్య వివాహ సందర్భంలో మధ్యవర్తిగా ప్రవర్తించే పాత్ర. ఆ పాత్ర గురించి, "దామోదరయ్యంటే అబద్ధాల సముద్రం" అని పరిచయం చేసారు.

"నా శక్తి మీరెరుగనిదికాదు. కోర్టులో మీరు తెచ్చిన దొంగ వ్యాజ్యములో నిచ్చిన యబద్ధసాక్ష్యములో నొక్కసారైనా పట్టుపడినానా! ఎన్ని తప్పుదస్తావేజులు మీ సెలవు ప్రకారము వ్రాసినాను కాదూ, నా వ్రాతయొకసారయినా పట్టుపడినదా! సాక్ష్యమిచ్చినా నంటే రాతిగోడపెట్టినట్టేకదా. ఎంతెంత కార్యములయినా జయించి రాగలను" అంటాడు. ఈ మాటలు వింటుంటూ ఆ పాత్రను తల్చుకుంటే నవ్వురాక మానదు. ఇలాటివారా వివాహాలలో పెద్ద మనుష్యులు అనిపించును.

చిలకమర్తి వారి హాస్యం అంటే ప్రహసనాలగురించే ఎక్కువగా చెప్పుకుంటాము. ప్రహసనం ఆధునిక సాహిత్యంలో నవ్వు పుట్టించటానికే పుట్టినట్లు అనిపిస్తుంది. అయినా సాంఘిక స్థితిలోని వికృతిని చూపించటం దాని లక్ష్యం.

ప్రహసనాల గురించి భరతుని నాట్యశాస్త్రం వివరించింది. శుద్ధ సంకీర్ణ భేదాలతో ప్రహసనాలు రెండు విధాలు. భవతో-పాపన-విప్ర-శాక్యాదులను గూర్చిన హాస్యవాదములతో కూడినది, కుత్సిత పురుషులతో కూడినది, పరిహాసభాషణులతో నింపినది, విశిష్ట భావద్యోతకములగు కథాఖండములను, నియతగతికల ఇతివృత్తములను కలిగినట్టిది శుద్ధ ప్రహసనమనీ, విట, ధూర్త, బంధక సంకులమగునది సంకీర్ణ ప్రహసనమనీ చెప్పబడింది. ప్రహసనమనగా పరిహాస ప్రధానములైన అభిభాషణములు అధికముగ గలది అని చెప్పబడింది. ప్రాచీనులు ప్రహసన పాత్రల ప్రవృత్తులను, అప్పటి సామాజిక పరిస్థితులను బట్టి వివేచించారు. చిలకమర్తి ఆధునికునిగా వికృతి స్వభావమున్న ప్రతిపాత్రనూ సమకాలీన సమాజంలోంచే ఎన్నుకున్నాడు. అధికారాలను బట్టి, ఉత్తమ, మధ్యమ, అధమ పాత్రలున్నాయి. స్వీయస్థ, పరస్థ హాస్య ప్రయోగాలున్నాయి. సమకాలీన సమాజంలోని వివిధ పాత్రలను, ప్రవృత్తులను, భాషా విశేషాలను, సంభాషణా చమత్కారాలను, శబ్దాశ్రిత హాస్యాన్ని భావాశ్రిత హాస్యాన్ని, అర్థాశ్రిత హాస్యాన్ని ఎన్నో విధాలుగా చిలకమర్తివారు వారి ప్రహసనాలలో ఉపయోగించారు.

హాస్య ప్రహసనాలలో కేవలం హాస్యాన్నే దృష్టిలో పెట్టుకుని అందులోని వ్యక్తుల్ని, పరిస్థితుల్ని, సంభాషణల్నీ హాస్యాత్మకంగా సృష్టించారు. హాస్య ప్రహసనాలలో బధిర చతుష్టయము, గయ్యాళిగంగమ్మ, జనాభానాటకము, అద్భుత కవిత్వము ముఖ్యమైనవి. బధిర చతుష్టయంలో చెవిటి శంకరప్ప, అతని భార్య సింగమ్మ ఒకరితో ఒకరు సంభాషిస్తారు. ఒకరిమాట ఒకరికి వినపడకపోవటం వల్ల, హాస్యం జనించింది. కథలో విశేషం లేకుండా హాస్యంతో రక్తికట్టాయి యవి:

'కడియాలవారింటికి భోజనానికి వస్తారా'- భార్య

'కడియాలు చేయించాలా నీకు, భర్త

'కడియాలు కాదు అందెలు చేయిస్తాను'-భర్త

'అందాలా, ముసలిదానికి అందాలెందుకు'-భార్య

'నేను సంసారిని' - భార్య

'కంసాలిని పిలవమంటావా'-భర్త

అంటే, ఇక్కడ శబ్దాన్నాశ్రయించి మాటపుట్టి అసంబద్ధసంభాషణ జరిగింది. తరువాత శంకరప్ప దగ్గరికి గంగన్నవస్తాడు. 'నీవు నరసాపురం నుంచా రావడము అంటే, 'నరసరాజుగారి యింట్లో పెండ్లయింది' అని, అయ్యో, నరహరిగారు పోయారా' -ఇక్కడ వివాహం గురించి ఒకరు చెప్తుంటే శవాన్ని గురించి మరొకరు మాట్లాడారు. చివరకు "భూలోక నారదుడనని వచ్చిన పేరురానే వచ్చింది..నాకు వచ్చిన పేరు ఛచ్చినా పోదు. వాళ్ళజుట్టూ, వీళ్ళజుట్టు ముడేసి, వీలైతే కోర్టులోకి లాక్కుపోయి, ఏదోవిధంగా నాలుగుడబ్బులు పోగుచేసుకోవటమే ప్రయోజకత్వం'' అని నారాయణమూర్తి అనే పాత్రతో చెప్పించి నవ్వుపుట్టిస్తారు చిలకమర్తి. ఇక్కడ హాస్యము శబ్దాశ్రయ హాస్యము.

గయ్యాళి గంగమ్మ ప్రహసనంలో అమాయకుడయిన భర్తని గయ్యాళిభార్య పెట్టే బాధలు, ఆమె చేసే విపరీతపు పనులు హాస్యాన్ని కలిగించాయి. అతిథిని వెళ్ళగొట్టేందుకు, గంగమ్మ ఉపాయంపన్ని, నూకాలమ్మకు పూజచేసి, ఆ పత్రంతో అతిథి తలపగలగొట్టి నైవేద్యం పెట్టాలని, అందుకే స్నేహితుడు అతన్ని భోజనానికి పిలిచాడని అబద్ధం కల్పించి చెప్పింది గంగమ్మ. ఆ అతిథి ఆమె మాటలు నమ్మి... "నిజము చెప్పిన తల్లివి నీవు. నాకు కూతురుపుడితే నీ పేరు పెట్టుకుంటా. ఇంకో జన్మమున నీ కడుపున కొడుకై పుడతా నా చర్మము కోసి చెప్పులు కుట్టించినా నీ ఋణము తీరదు తల్లీ'' అని పలుకుతుంటే పాఠకుడికి నవ్వు తప్పకవస్తుంది ఆ పాత్రల సంభాషణలు వింటుంటే. ఇది భావాశ్రయ హాస్యము. వైపరీత్యము వున్నచోట ఆ భావం దాని స్థితిని కోల్పోతుంది. గయ్యాళిగంగమ్మ జగన్నాథముతో మాట్లాడే మాటల్లో వున్న వైపరీత్యం హాస్యానికి కారణం.

జనాభా నాటకంలో చిలకమర్తి ప్రతి సంభాషణలోనూ హాస్యాన్ని నింపారు. జనాభా నాటక కర్త ఎవరు అంటే,

ముగ్గువలె బాతు వలె వాడి బుగ్గవలెను
సీమ సున్నము వలె చల్ల చెలువమునను
నెరసినట్టి వెంట్రుకలట్లు యెముకలట్లు

సూడ కొంగలవలె నొప్పు గొప్పగాను' అంటూ పరిచయం చేయటం, దుష్కవిభల్లూక నిప్పు పెట్టె అనీ, ప్రతివాద భయంకర దుడ్డుకర్రయని అనేకమంది మహరాజులు బిరుదులిచ్చి గౌరవించారని సూత్రధారుడు చెప్తాడు.

ఇంటింటా తిరిగే ఎన్యూమరేటర్లు భాష సంస్కృతి తెలియనివారైతే వచ్చే చిక్కులు చిలకమర్తి ఈ ప్రహసనంలో బాగా తెలియజేసారు. బొట్టులేని ఆడపిల్లను భర్తపేరు అడిగితే ఆమె విధవ అంటుంది ముసలమ్మ ఎన్యూమరేటరుతో. అతను, మరో ఆమె స్నానం చేసి ఇంకా బొట్టుపెట్టుకోని ఆమెని చూస్తూ ఈమె విధవేనా' అంటాడు.

భిన్నమైన మతాచారాలున్న వ్యక్తులు ఒకరికొకరు ఎదురుపడితే వారిభాషణలోవుండే హాస్యాన్ని చిలకమర్తి చూపారు.

రహమాన్ అంటే ఎన్యూమరేటరు, 'అరె ఏం బలే తమాసాలు వోయి మీ కొంపల్లో, మాకిదూసలాము-మీకీ, హిందుల్ పేర్లు లిఖోమని' మాకి తహసిల్దారు పంపియేశ్నాడు' అంటాడు. ఆ యింట్లో పెద్ద కొడుకు పేరు రమణయ్య అంటే మర్నయ్య అని రాస్తాడు. రత్తమ్మ అంటే రక్తమ్మ అంటాడు. 'అరెరక్తం పేరు ఎవరూ పెట్టుకోరోయి. ఎంత కాఫర్లోయి మీకు' అంటాడు.

ఇది శబ్దాశ్రయహాస్యం. అన్య భాషాపద ప్రయోగంతో హాస్యం పుట్టింది.

అద్భుత కవిత్వ ప్రహసనంలో ప్రాచీన కవిత్వం పాషాణమని, నవీన కవిత్వం గొప్పదని చెప్తారు శిష్యులు గురువుతో.

**"తోటకూర తెచ్చి దొడ్డిలోన తరిగి**

**కుండలోన బెట్టి కుదుమగాను**

**క్రింద మంటబెట్ట ఉడకకేంజేస్తుంది**

**దాని కడుపు కాల ధరణిలోన**-ఈ పద్యం

ఎని గురువుగారు నవ్వితే శిష్యులకి కోపం వచ్చింది.

మీ భారతాల్ గీరతాల్ ప్రబంధాల్ గిబంధాల్ అన్నీ కూడా దీపావళమావాస్యకి తూటాల్ మతాబాల్ క్రొవ్వొత్తుల్ పేకజువ్వల్ కట్టేస్తా'- ఇలాంటి ధోరణికి గురువుగారు నవ్వి, నేను చెప్తా అంటారు.

**అనవేమ మహీపాలా**

**చూపులుం గాడ్పు లెస్సలు**

**యుద్ధమందు మహావీర్లు**

శాబాసునై భళాముండా
ధీ యో యోనః ప్రమోదయాత్'

చెప్తాడు ఇది శబ్దాశ్రయ హాస్యం. నిరర్థక పద ప్రయోగం. దీనివల్ల వెక్కిరిస్తున్నట్టుగా ఒక భావం తోస్తుంది. అసందర్భ పదప్రయోగం హాస్యాన్ని కలిగిస్తుంది.

బలవంతపు బ్రాహ్మణార్థ ప్రహసనంలో కరణం తన తల్లి తద్దినం విషయం మరిచిపోతాడు. పురోహితుడు జ్ఞాపకం చేస్తాడు. దారినపోయే ఓ బ్రాహ్మణుని తెమ్మని వెట్టివాడ్ని పంపుతాడు. వాడు దారినపోయే పురుషోత్తమావధానిని అడ్డగిస్తాడు.

'మావూరి కన్నపాయనింటో చద్దెన్నమట. అదేదో నీకు పెడతారంట. రా 'అంటాడు వెట్టివాడు. పురుషోత్తమావధాని రానంటే, 'నువ్వేం తాలుకాచ్చేరి బంట్రోతువా, పోలీసు జవానువా, ముంచీబువా, కరణానివా, నీకు దడ్చేటందుకు అని బలవంతంగా లాక్కెడతాడు.

మరొక ప్రహసనంలో, ఒకరు మరణిస్తే పిండంకాకులు ముట్టుకోవు. కాఫీ ఉప్మాలు తనకిష్టమని వాటితో పిండం పెట్టమని ఆ మరణించిన వ్యక్తి, కొడుక్కి కనిపించి చెప్తాడుట. అప్పుడు ఆ మాటను అందరూ తిరస్కరిస్తారు. అప్పుడు ఆ కొడుకు అంటాడు. ''మన్మథుడు శివునికంటిమంటికి దగ్ధమైతే, ఆ మన్మథుని భార్య రతీదేవి, వసంతునితో చెప్పలేదా-పువ్వుతేనెతో తర్పణమిచ్చి, పుష్పాళ్ళతోపిండం పెట్టమని-అక్కడ ధర్మశాస్త్రమేమయింది- మీ ధర్మశాస్త్రాలు తీసికెళ్ళి తుంగలో తొక్కండి'' అంటాడు ఆ కొడుకు. అందరికీ ఉప్మాకాఫీలు ఇచ్చి ఇదే శ్రాద్ధమంటాడు కొడుకు. చిలకమర్తి వారికీ శ్రాద్ధకర్మలలో నమ్మకం లేదు. చిలకమర్తివారి ప్రహసనాలు హాస్యంగా అనిపించినా సాంఘిక దురాచారాలను ఎత్తిచూపాయి.

చిలకమర్తివారు ప్రహసనాలలో పేరడీలు చేసినవి చాలా వున్నాయి. పేరడీ అనేది ఒక విశిష్ట సాహిత్య ప్రక్రియ. పేరడీ ప్రధాన లక్ష్యం హాస్యోత్పత్తి. దీని ప్రధాన లక్షణం అనుకరణ. పాశ్చాత్య ప్రక్రియలు మన సాహిత్యంలో ప్రవేశించినట్టే పేరడీ కూడ ప్రవేశించింది. ఉన్న అర్థాన్ని విపరీతంగా మార్చటం, పాట, పద్యం మొదలైన వాటిని అనుకరించటం, రచయిత శైలిని అనుకరణద్వారా అపహాస్యం చేసే రచన, -ఇలా రకరకాల నిర్వచనాలున్నాయి పేరడీకి.

చిలకమర్తి పేరడీ రచనలు బాగా చేసారు. ముందుగా తయారుచేసే వస్తువులపైన, ఔషధ ప్రకటనలపైన, మూఢనమ్మకాలపైన, పురాణాలపైన, వీలునామాల పద్ధతిపైనా ఇలా నిత్యం జీవితంలో ఎన్నిటిపైనో పేరడీ చేసి హాస్యం సృష్టించారు చిలకమర్తి.

భగవద్గీతకి పేరడీలాగ కలిగీత అని రచించారు చిలకమర్తి. లోకంలో ధర్మోపదేశం చేసే గ్రంథం భవద్గీత అని అనుకుంటాము. భగవద్గీతకంటె ఎక్కువగ మహాధర్మములను బోధించు

మహాగ్రంథము కలదు. అది కలిగీత అన్నారు చిలకమర్తి. భగవద్గీతలో పద్దెనిమిది అధ్యాయాలుంటే కలిగీతలో పదిహేను అధ్యాయాలున్నాయి. అక్కడ కృష్ణుడు రథసారథి అయితే, ఇక్కడ కలిపురుషుడు రథసారథి.

కలిపురుషుడు చెప్పున్నాడు. "సంతోషపూర్వకముగా నేనుండునట్టి స్థలములు చెప్పెద వినుము. వేశ్యాంగనాగృహములు నాకు పరమప్రీతికరములైన ఆలయములు. మరియు సారాదుకాణములు, జూదపుపాకలు, కోడిపందెముల తలలు, నరహంతకుల హృదయములు. ఈత తోటలు, తాడితోటలు, గంజాయి వనములు నాకు విహార భూములు. నా అవతారంబుల నింకను చెప్పెదను... వృక్షములలో గంజాయిమొక్కను నేను, నాభిచెట్టును నేను. నల్లమందుమొక్కను నేను. జంతువులలో పెద్దపులిని నేను. లంచగొండి అధికారిని నేను. దొంగసాక్ష్యము నేను... అబద్ధమును నేను-వేయేల సమస్తమును నేను."

భగవద్గీతకి పూర్తిగా వ్యతిరేకంగా కనిపించేది కలిగీత. అంటే సామాజిక దురన్యాయాలను మెత్తగా చెప్తూ, పశ్చాత్తాపుల్ని చేయటం ఈ పేరడీ రచనలో చిలకమర్తి ఆశించిన హాస్య ప్రయోజనం.

చిలకమర్తి పురాణ పద్ధతిని కూడా పేరడీ ద్వారా హాస్యం సృష్టిస్తూ రచించారు. సాధారణంగా సూతపౌరాణికుడు శౌనకాది మహామునులకు కథలు చెప్పటం ప్రసిద్ధిగన్న విషయం. చిలకమర్తి దీన్ని చాకలిపురాణంగా రచించారు. ఇది వరకు లోకంలో ఎన్నడు కనీవినీ ఎరుగనిది కొత్తది చెవులకింపయినది అయిన ఒక ఇతిహాసం చెప్ప మని మునులు సూతుని కోరారు. ఇలాటి ప్రశ్న ఇంతకుముందు శనైశ్చరుడు విఘ్నేశ్వరునడిగాడు. ఆ విఘ్నేశ్వరుడు చెప్పిన కథ మీకు చెప్తానన్నాడు సూతుడు.

విష్ణుమూర్తి పాము మీదపడుకోటానికి గల కారణము, నూలు బట్టలు కట్టుకోక, పట్టుబట్టకట్టుటకు కారణము, శివుడు దిగంబరుగుటకు కారణము చెప్పమని కోరాడు. వీటన్నిటికీ సమాధానము చాకలివారే. చాకలివారి బాధలు పడలేకనే. 'దుప్పట్లు మాసిపోతాయి. వాటిని చాకలికి వేయాలి. చాకలి సమయానికి తేడు. తెచ్చినా చిరిగిపోయి వుంటాయి. శివుడి విషయం వస్తే ఆయన ధనంలేనివాడు. ఇల్లు వల్లకాడు. పుఱ్ఱెల్లో భోజనం. చాకలితో బట్టలుతికించుకోటానికి డబ్బెక్కడనుండి వస్తుంది. కనక దిగంబరుడై యుండి, ఎవరైనా పెద్దలు వచ్చినపుడు సభ్యతకోసం పులితోలు చుట్టుకుంటాడు. ఇన్ని చెప్పి ఈపురాణం చాలా కొత్తది. దీన్ని గోప్యంగా వుంచాలి అన్నాడు విఘ్నేశ్వరుడు శనైశ్చరుడితో. ఈ పేరడీ కేవలం హాస్యాత్మకంగా చెప్పినా సంప్రదాయపద్ధతిలో రాయటం చిలకమర్తివారి ప్రత్యేకత.

చిలకమర్తివారు దివాలాదేవి వ్రతము అనేదొకటి రచించారు. తెలుగుదేశంలో వ్రతాలు

చేయటం పరిపాటి. వ్రతం అయ్యాక ఫలశ్రుతి వుంటుంది. ఈ వ్రతం చేయించే పురోహితుడు ప్రశ్నోత్తర పద్ధతిని పాటించి పాఠకులకి ఆనందం కలుగజేసాడు.

నారదుడు బ్రహ్మకు నమస్కరించి ఇలా అన్నాడు. "మహాత్మా బ్రహ్మదేవుడా, భూలోకమందు మనుష్యులు అనేకులు ధనము లేక యిబ్బంది పడుచున్నారు. కొందరు ధనము చాలా సంపాదించి ఐశ్వర్యముతో తులతూగుచున్నారు. ధనములేని ఆ పేదవారందరూ విస్తారము కష్టపడకుండా ధనవంతులగుటకు ఏదైన ఉపాయమున్నదేమో ఆనతియ్యవలయును". అని నారదుడు తాను లోకసంచారికనుక అన్నిలోకాల్లోనూ ఈ వ్రతాన్ని ప్రచారం చేస్తానన్నాడు.

ఆ వ్రత విధానం బ్రహ్మచెప్పాడు నారదునికి. మడి స్నానం అక్కర్లేదు. బ్రాహ్మణుడు వచ్చి సంకల్పం చెప్పక్కర్లేదు. ఈ వ్రతం కలిపురాణంలో చెప్పబడింది. కలిపురుషునికి, కక్కుర్తి అనే మహాదేవికి జన్మించిన మూడవ కూతురు దివాలాదేవి.

ఈ దేవిని ఆరాధించేవాడు కష్టపడరాదు. నౌకరీ చేయరాదు. వేషం ఎంత డబ్బుసరిపోదంటే దేవతకి అంత ఆనందం. ఎక్కువ వడ్డీకి అప్పులు తేవాలి. నమ్మకం కుదిరేవరకు వడ్డీయిచ్చి, తరువాత ఎగ్గొట్టాలి. భూములు ఇండ్లుకొని భార్యాబిడ్డల పేర రాయించాలి. వ్యాపారం క్షీణిస్తున్నకొద్దీ డబ్బా దర్పం ఎక్కువగా వుండాలి.

అప్పులవాళ్ళు ఇంటి మీదికొస్తే కోర్టుకెళ్ళి ఇన్సాల్వెన్సీ పిటీషన్ దాఖలు చేయాలి. ఇదే దివాలాదేవి వ్రతం. సిగ్గు, బిడియం ముందుగానే విడిచేయాలి. దొంగేడ్పులు ఏడ్వాలి. చిలకమర్తి వ్రతకథలను అధిక్షేపించారు హాస్యంతోనే.

ఉగాదినాడు పంచాంగశ్రవణం తప్పక దేవాలయాల్లో వుంటుంది. చిలకమర్తి ప్రమాదీచ సంవత్సర ఫలితాలు అని, రాక్షససంవత్సర పంచాంగము అని చమత్కారంగా, హాస్యంగా రచన చేసారు. అతి సామాన్యమైన విషయాన్ని మహోదాత్తంగా చెప్పి నవ్వించటం ఈ పేరడీ లక్షణం. చంద్రగ్రహణాలు పున్నమిరాత్రిలో, సూర్యగ్రహణాలు అమావాస్య పగటిలో పట్టును అని, గర్భిణీస్త్రీలలో కొందరికి ఆడశిశువులు, మరికొందరికి మగశిశువులు కలుగును అని, జోడులేని వాళ్ళ కాళ్ళు కాలును, గొడుగులేని వారి నెత్తి మాడును అని పంచాంగ ఫలితాలు చెప్పటం చమత్కారం. మంచికవిత్వం 1/2పాలు, తుక్కుపుస్తకముల వృద్ధి 981/2, నిజమైన దాతృత్వం, డాబుల దాతృత్వం 99, బిరుదుల దాతృత్వం 76, మొగమాట దాతృత్వం 24, - ఇలాగ చాలా ఫలితాలు చెప్పి, చిలకమర్తి పంచాంగ శ్రవణం అనే దాన్ని హాస్యంపట్టించారు.

యక్ష ప్రశ్నలు అనేది పేరడీ చేసిన చిలకమర్తి చిక్కయ్య; నారాయణప్ప అనే ఇద్దరు వ్యక్తుల్ని ప్రవేశపెట్టారు. ప్రశ్నోత్తరాలున్నాయి ఇందులో. మగవాడికి మగడెవడు అని ప్రశ్నిస్తే చెప్పినట్టు వినని భార్య అన్నది సమాధానం. అలాగే, మనుష్యులలో పశువులు, పశువులలో

మనుష్యులు ఉన్నారంటారు, వారెవరూ అనే ప్రశ్నకి మోసం చేసి దొంగగడ్డితినే మనుష్యులు మనుష్యులలో పశువులు. ఎవరిచేలోనూ పడక తిన్నగా తనదారినతను ఇంటికివచ్చే పశువు పశువులలో మనిషి అనేది సమాధానం. యక్షప్రశ్నలకి పేరడీ కలియుగ యక్ష ప్రశ్నలు.

చిలకమర్తివారు పేరడీరచనలు చాలా చేసారు. ఇవేకాక హాస్యంగా ఔషధప్రకటనలు అంటూ, వ్యాపారులు తమ వస్తువును అమ్ముకోటానికి ఎన్ని విధాల ప్రకటనలిస్తారో చెప్పారు.

ఆ మందుల పేర్లలోనే హాస్యం వెదజల్లారు. జ్వరమూషిక మార్జాలము, ఈ మందు తయారు చేయటానికి ముప్పయి సంవత్సరాలు పట్టిందట. ఈ మందు వాడేవారు, అన్నము, రొట్టెలు, పళ్ళు, పాలు పెరుగు, ఉప్పు, పులుపు పిండివంటలు, మంచినీళ్ళు విసర్జించాలట. అకాల మరణజంబాల మార్తాండము-ఈ మందు తీసుకుంటే నూటేభైఏళ్ళు బతుకుతారట. ఈ మందులో గొప్ప గొప్ప వారికిచ్చామని సత్ఫలితాలు కలిగాయనీ చెప్పి సర్టిఫికెట్లు చూపటం కూడావుంది. ఇది ఔషధ ప్రకటలను హేళన చేయటమే.

చిలకమర్తి లండను సంకల్పము అని రచించి, అది పూర్వాచార పరాయణులైన శ్రోత్రియ కర్మిష్ఠులకు ఉపయోగించేలా, థేమ్సు నదిలో స్నానమాచరించి సంకల్పం చెప్పుకొనే విధంగా మంత్రాల్ని రాసియిచ్చారు. ఆచమనము-లండన్‌వేస్వాహా-జూశౌసేస్వాహా-క్రైస్తవవేస్వాహా-ఇంగ్లండ్, స్కాట్లండ్, ఐర్లండ్, తత్కైస్తోర్వరౌణ్యం-జుహోవాదేవశ్య ధీమహీ-ధీయోయోనః ప్రచోదయాత్-మమ, ఉపాత్తధనవ్యయం ద్వారా-కాంటి నెంటల్‌టూర్, సంప్రాప్త్యర్థం-సమ్యగ శిక్షితాంగ్లేయ భాషా సంశయ నివారణార్థం... శ్రీమల్లండన్నామక మహాక్షేత్రే-అస్మిన్ వర్తమాన వ్యవహారికహూణమాసేన-క్రిస్తోరనంతరం వింశతి తమ శతాబ్దే -అఖండథేమ్సు నద్యాం వీరభద్రశర్మాహం జ్ఞాన స్నానం కరిష్యే-

ఈ సంకల్పంలో వచ్చే నవ్వు శబ్దాశ్రయ హాస్యానికి చెందింది. ఇది అన్యభాషాపద ప్రయోగం వల్ల సాధించారు చిలకమర్తి. రెండు భాషల సంయోగం వల్ల వికృతి జనించిందిక్కడ. అర్థంవైపు దృష్టిమరల్చకుండా శబ్దంవైపు దృష్టి మరల్చటంతోనే హాస్యం ఉద్భవించింది.

చిలకమర్తివారి రచనలలో హాస్యం వున్నా, ప్రత్యేకంగా హాస్యరచనలు కొన్ని చేసారు. వినోదములు, నవ్వులగని ముఖ్యంగా చెప్పుకోవాలి. మనోరమ, దేశమాత పత్రికల్లో నవ్వులగని వినోదములు వెలువడ్డప్పుడు ప్రజాదరణపొందాయి. చిలకమర్తి హాస్యలతలు, నేటి కార్టూన్లు, జోక్సులాంటివే.

చిలకమర్తి వారి వినోదములు ఒకటి, రెండు భాగాలు ప్రచురింపబడ్డాయి. ఇందులోని కథలు ఆంధ్రజనుల నోటంట అక్కడక్కడ చెప్పుకోబడ్డవే. ఈ కథలన్నీ హాస్యపూరితాలు. నీతిబోధకాలు. చిన్న సంభాషణలు కొన్ని, చిన్న చిన్న సంఘటనలు కొన్ని, కథాంశాలు కొన్ని,

సభలో జరిగిన సంభాషణలు కొన్ని ఇందులో కూర్చారు చిలకమర్తి.

అడిదము సూరకవి తాటాకుమీద రాసిన భారతాన్ని చేతపట్టుకు వెడుతున్నాడు. ఒక వెలమ దొర చూసి, అయ్యా ఈ వేళ వర్జ్యమెప్పుడో చెప్పండన్నాడు. నేను కవిత్వము చెప్తాను గానీ పంచాంగము చెప్పను అన్నాడు సూరకవి. 'అంత పెద్దపుస్తకము చదువుకొన్నవాడవు. పంచాంగము చెప్పుట తెలియదా' అన్నాడు వెలమదొర.

ఒకనాడు వెలమదొర పెద్దకత్తిపట్టుకు పోతుంటే సూరకవి చూసాడు. అయ్యా, నాకు క్షురకర్మచేయగలవా అని అడిగాడు. వెలమదొర కోపంతో నేను మంగలిననుకొంటివా అన్నాడు. కత్తియింతపొడవుగా ఉన్నది. క్షురకర్మకు పనికిరాని దాని ప్రయోజనమేమి' అని పరిహసించాడు సూరకవి.

అలాగే, కుక్క తరుముకొస్తుంటే భయపడి పరుగెత్తి, తన స్నేహితులున్న చోటుకెళ్ళాడు అడిదము సూరకవి. ఆ స్నేహితులు నవ్వి, 'గాడిదలా ఇలా పరిగెత్తి వచ్చావే అన్నారు. కుక్కకు భయపడి వచ్చాను. కానీ యిప్పుడు మందలో కలిసాను కనక భయము తీరినది అన్నాడు.

ఒక పిల్లాడు సంధ్యావందనము మరిచిపోయి, తండ్రిదగ్గర మళ్ళీ నేర్చుకోవాలనుకున్నాడు. నాయనా నాకు సంధ్యావందనము నేర్పుమని కోరాడు. ఆమాట విని తండ్రి పిల్లవానిపై మండిపడి ఓరీ, పశువా, ఐదేళ్ళక్రిందట నేర్చుకొన్న నీకే జ్ఞాపకము లేపుడు అరువది సంవత్సరముల కిందట నేర్చుకున్న నాకాజ్ఞాపకముండుట. ఇట్టిమాటలెప్పుడూ అనబోకని మందలించాడు.

ఒక కాపువానింటికి ఒక బంధువు వచ్చాడు. మీకు పశువులున్నవా అని అడిగాడు. ఆ కాపు "మావీ మా యజమానివి కలిసి వేయి పశువులు' అని చెప్పాడు. మీవెన్ని వారివెన్ని అన్నాడు బంధువు. ఇక చెప్పకతప్పదని వారికి తొమ్మిదవందలతొంభైతొమ్మిది, నాది ఒక కుంటి ఆవు అన్నాడు.

బెల్లము తనను అందరూ తింటున్నారు, ఈ కష్టము కలుగకుండ చేయుమని బ్రహ్మనికోరింది. బ్రహ్మ ఆ బెల్లముతో, "ఓసీ, చాటుననుండి మాట్లాడుము. ఎదుటనుంటివా నాకును నిన్ను తినబుద్ధి పుట్టగలదు' అన్నాడు.

వినోదములు మొదటి భాగంలోనే 171 వినోదాలున్నాయి. రెండవ భాగంలో 124 వినోదాలున్నాయి. తామర్లేను, ఔరంగజేబు, భోజరాజులకాలం గురించిన, సంస్థానాల గురించిన హాస్యపు సంభాషణలు, సన్నివేశాలు చెప్పారు వినోదములు రెండో భాగంలో ఎక్కువగా. చాటుపద్యాలెన్నో ఇందులో చోటుచేసుకున్నాయి. ఆంధ్రదేశంలో ప్రచారంలో వున్న ఈ

వినోదాలలో సునిశితమైన హాస్యం వుంది. నవ్వులగని అనే పుస్తకంలో కూడా ఒకటి, రెండు భాగాలున్నాయి. ఇవన్నీ హాస్యగుళికల్లా కనిపిస్తాయి. 'ప్రశ్నలు' అనేవి కొన్ని చిలకమర్తి కూర్చారు.

*1. ప్రశ్న: భాగ్య వంతుడెప్పుడు బీదవాడుగును?*

*ఉత్తరం: పన్నులిచ్చుకోవలసి వచ్చినపుడును, కొడుకుకాని తమ్ముడుకాని చనిపోయిన తరువాత కోడలుకో, మరదలుకో మనోవర్తి యిచ్చుకోవలసి వచ్చినపుడు మనుష్యులు పేదవారగుదురు.*

*2) పేదవాడు భాగ్యవంతుడెప్పుడగును?*

*ఉత్తరం: తనకుగాని తన కుమారునికిగాని, తన తమ్మునకుగాని పెండ్లి సంబంధము వచ్చినపుడు ప్రతిమనుష్యుడు గొప్ప వడ్డీ వ్యాపారము చేయువాడగును. ఈనాముదారుడగును.*

*3) ముసలివాడు చిన్నవాడెప్పుడగును.*

*కళత్రము నష్టమయినపుడు ముసలివాడు తప్పక పడుచువాడగును.*

ఇలాగ ప్రశ్నజవాబులే కాక మరెన్నో అంశాలు హాస్యపూరితాలు ఈ నవ్వులగనిలో వున్నాయి.

ఒకాయన వయసు నలభై సంవత్సరాలు. ఆ విషయం మేజిస్ట్రేటు కోర్టులో వచ్చినపుడు. నాలుగేళ్ళనాడు నలభై సంవత్సరాలన్నారు, ఇప్పుడూ నలభై సంవత్సరాలే అంటావేమిటీ అని అడిగితే. నేను ఒకేమాటమీద నిలబడతాను అప్పుడొకమాట ఇప్పుడొకమాట మార్చను అన్నాడు ఆ కలియుగహరిశ్చంద్రుడు.

ఒకరు జ్యోతిష్కుని అడిగారు, కుక్క కుడినుండి ఎడమకు పోయిన మంచిదా, ఎడమనుంచి కుడికిపోయిన మంచిదా అని. 'మీదపడికరవకపోతే మంచిది' అని చెప్పాడా జ్యోతిష్కుడు. ఈ రోడ్డు ఎక్కడికెడుతుందీ అంటే, ఎక్కడికీ వెళ్ళదు. నేను పుట్టినప్పట్నుంచీ ఇక్కడే వుంది అనటం, మీయింట్లో ఇవాళ కూరలేంచేసారూ అంటే తినేసాం అనటం ఇప్పటికీ జోక్‌గా చెప్పుకుంటున్నది ఆనాడు చిలకమర్తి చెప్పిందే.

నవ్వులగనిలో వృద్ధ వివాహం, యోగనందస్వామి, శతఘంటావధానం, రంగధామోపాఖ్యానం, రంభామేనక సంవాదం, మొదలైన ఎన్నో ప్రహసనాలున్నాయి.

ఇవేకాక చిలకమర్తి జీవితంలో ఎన్నో సంఘటనలలో హాస్యాన్ని వెదజల్లారు. స్నేహితులమధ్య కూర్చున్నప్పుడు చిలకమర్తి చమత్కార సంభాషణలద్వారా హాస్యాన్ని పండించేవారు.

ఒకసారి చిలకమర్తివారు, ఇమ్మానేని హనుమంతరావునాయుడుగారు, టంగుటూరి ప్రకాశము ఇంకా మరికొందరు కలసి ఒక సాయంకాలము ముచ్చటలాడుకొంటున్నారు. హనుమంతరావుగారు పకోడీలు తెప్పించి పంచిపెట్టారు. ప్రకాశముగారో, ఎవరో, "మీరు

పకోడీలమీద పద్యములు చెప్పండి. పద్యమునకొక పకోడి బహుమానమిచ్చెదము అన్నారు. ఆమాటవిని చిలకమర్తి ''కవులకక్షరలక్షలిచ్చెడి కాలము గతించినది. పద్యమునకు పకోడినిచ్చెడు దుర్దినములువచ్చినవని' ప్రత్యుత్తరమిచ్చాడు. వెంటనే ఆశువుగా కొన్ని పద్యాలు పకోడీలపై చెప్పారు.

**వనితల పలుకులయందున**

**ననిముష లోకమున నున్న దమృతమటంచున్**

**జనులనుటెగాని లేదట**

**కనుగొన నీయందమృతము కలదుపకోడీ,**

**ఎంచుకు పరమాన్నంబులు**

**ఎందుకు పలుపిండివంటలెల్లను నాహా!నీ**

**ముందర దిగదుడుపున కని**

**యందును సందియము కలుగదరయ పకోడీ!**

ఇలా ఎనిమిదిపద్యాలు చెప్పారు చిలకమర్తి.

చిలకమర్తి హాస్యవాఙ్మయ నిర్మాతగా తెలుగు సాహిత్యంలో గొప్పపేరు పొందారు. చిలకమర్తివారి రచనలన్నిటిలోనూ హాస్యం వెల్లివిరియటం విశేషం. హాస్యాన్ని ఆయుధంగా వాడుకోవటం తెలిసిన రచయిత చిలకమర్తి.

మన సాహిత్యంలో హాస్యరసపోషణ రాజుల కాలంలో ఉదాత్త సాహితీ ప్రయోజనాన్ని ఆశించింది. సంధియుగంలో హాస్యరసపోషణ వినోదార్థం బయలు దేరింది. కందుకూరి వారి యుగంలో హాస్యరసపోషణ సంఘసంస్కరణకుపయోగించింది.

హాస్యం ద్వారా ఒక సత్య పరిశీలనా దృష్టిని, ఒక నీతిబోధని అందించిన మహర్షి, హాస్యవాఙ్మయ సృష్టికర్త చిలకమర్తి లక్ష్మీనరసింహపంతులుగారు తెలుగు సాహిత్య చరిత్రలో వైతాళికుడు.

**పాల సాగరమున పవ్వళించినవాడు**
**గొల్లయిండ్ల పాలుగోరనేల**
**ఎదుటివారి సొమ్ము లెల్లవారికి తీపి**
**విశ్వదాభిరామ వినురవేమ**



## చతురవచోవిలాసుడు! హాస్యరచనా విదగ్ధుడు

# పానుగంటి

డా. వెలుదండ నిత్యానందరావు.

'నేను పండితుడను గానని యీ యూరి వారెఱుగుదురు. పైగ్రామముల వారెరుంగుదురు. సాహిత్యహీనతలో జగమెరిగినవాడను గాని సాధారణుడనుగాను. ఇట్టినన్ను, బరిషత్తు (యువభారతి) వారేల ఎన్నుకొనవలయునో నాకు తెలియదు. తెలిసిన విషయమేమియో యంతకంటె దెలియదు. వెనుక జరిగిన పరిషత్సభలకుఁ (యువభారతి సభలకు) బండితుల నెన్నుకొంటిమిగదా, యీసారి యపండితునెన్నుకొందము. ఇంతలో జెడిపోవునదేమున్నదని యూహించి మార్పు కొర్కై నన్నెన్నుకొని యుందురేమో, ఎటులైననేమి? అవిలంఘ్యమైన మహాజనుల యాజ్ఞ తులసీదళము వలె శిరమున ధరించి యిటు నిలువబడితిని....' అన్నారొకసారి పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు.

పానుగంటి వారు గొప్పపండితుడై ఉండీ 1892లో ఈ మాటలు కేవలం వినయం కోసం చెప్పుకొన్నా ఇప్పుడు వాస్తవంగా నా కన్వయిస్తాయని సవినమ్రంగా మనవి చేసుకొంటున్నాను.

సహస్రదళపద్మంలా అపూర్వంగా వికసించి పరిమళాలను వెదజల్లుతున్న సాహిత్య ప్రక్రియ 'వ్యాసం.' అంగారంనుండి శృంగారం దాక, అంగడిబేరం నుండి ఆధ్యాత్మిక చింతనందాకా, అజ్ఞానం నుండి అంగారక గ్రహయానందాక, భువినుండి దివిదాక, సాహిత్యవిశ్లేషణం నుండి సిద్ధాంత రాద్ధాంత ప్రతిపాదనం దాక, పొగడ్తలతో పైకెత్తడం నుండి అగడ్తలలోకి తొక్కేయడం దాక అనూహ్యమైన అనంతమైన వైవిధ్యాన్ని వైశాల్యాన్ని పొదివికొన్న విస్తారప్రక్రియ వ్యాసం. కాదేదీ వ్యాసానికనర్హం!! ఈ 'వ్యాస' మహర్షి అవక్రవిక్రమాన్ని కొనియాడాలనడం, కొలవాలనడం సాధ్యమయ్యేదికాదు. 'వానలో తడియనివాడు, చెళ్ళపిళ్ళవారి మృదూక్తిలో నాననివాడు లేడు' అన్నట్లు చిన్నదో పెద్దదో మంచిదో చెడ్డదో 'వ్యాసం' మాత్రం రాయని విద్వాంసుడు లేడని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

'వ్యాస' కేదారాలను పండించడానికి సాహిత్య క్షేత్రాన్ని సారవంతం చేసి, నారుపోసి, నీరుపోసి సుసంపన్నం చేసి సహస్రముఖాలుగా వ్యాసప్రక్రియ విజృంభించడానికి మూలమైనవారు కందుకూరి వీరేశలింగంపంతులు, గురజాడ అప్పారావు, గిడుగురామమూర్తి, పానుగంటి లక్ష్మీనరసింహరావుగారలు. కందుకూరి వీరేశలింగంపంతులు ప్రజాజీవితంలోకి 'ఆధునికత్వాన్ని' ఆవాహన చేస్తున్న తన ఉద్యమానికి ఉపకరణంగా వ్యాసాస్త్రాన్ని ప్రయోగించాడు. గిడుగు

రామ్మూర్తిపంతులు ఉపయోగించే భాషలోకి 'ప్రజాస్వామ్యాన్ని' తీసుకొని రావడం కోసం; ప్యూడల్ పంజరాలను బద్దలుకొట్టడం కోసం వ్యాసాన్ని వినియోగించుకొన్నాడు. సాహిత్యజీవనంలో మానవత్వపు విలువలు ప్రవేశపెట్టడంలోను కందుకూరి సామాజికోద్యమానికి, గిడుగురామూర్తి భాషోద్యమానికి సాహిత్యత్వం కల్పించడంలోను కృతకృత్యులయ్యాడు గురజాడ అప్పారావు పంతులు. ఇక పానుగంటి లక్ష్మి నరసింహారావు పంతులు సాక్షి వ్యాసాలద్వారా హాస్య అధిక్షేపాలను ప్రయత్నపూర్వకంగా రంగరించి కందుకూరి గురజాడ గిడుగుల ఉద్యమత్రయానికి విచిత్రమైన నవీనమైన ఆత్మీయతను, ఆకర్షణను తెచ్చిపెట్టి వ్యాసప్రక్రియను జగజ్జేగీయమానం చేశాడు.

ఇక శైలీ విన్యాస విషయకంగా పరిశీలిస్తే కందుకూరిది ఎలాంటి శషభిషలు లేకుండా, సూటిగా విషయంవైపు ప్రస్థావించే 'పురాణశైలి' గిడుగువారిది శాస్త్రపరమైన నిష్కర్ష గలిగిన 'లాక్షణికశైలి'. గురజాడవారిది స్వీకృతాంశాన్ని సౌందర్యాత్మకంగా అభివ్యక్తీకరించే 'కావ్యశైలి'. పానుగంటివారిది అవసరాన్ని మించిన విసుర్లతో, దృష్టాంతాలతో కూడి విస్తరించే గుణం కలిగిన 'ప్రబంధశైలి.'

ఇక హాస్యం దగ్గరికి వస్తే-కందుకూరి 'గురజాడ అప్పారావుగారలు సాంఘిక ఆచారాలను ప్రధానాలంబనగా చేసుకొని సంస్కరణాత్మకమైన, ధార్మికాగ్రహవ్యక్తీకరణరూపమైన హాస్యాన్ని పండించారు. మునిమాణిక్యం నరసింహారావు సున్నితమైన సాంసారికహాస్యాన్ని వినోదాత్మకంగా అందించారు. మొక్కపాటి నరసింహశాస్త్రి దేశీయాచార వ్యవహారాలను స్థానాంతరంలో ప్రవేశపెట్టి అమాయకత్వాన్ని జోడించి నవ్వుల పువ్వులను విరబూయించారు. ఇక పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు 'భాష'ను ఉపకరణంగా స్వీకరించి వ్యంగ్య అధిక్షేపహాస్యాన్ని కొల్లలుగా పండించి అజరామరుడయ్యాడు. అనితరసాధ్యమైన విలక్షణశైలికి ఏకైక దృష్టాంతమై నిలిచిపోయాడు.

పానుగంటి లక్ష్మీనరసింహారావు సాక్షివ్యాస పరంపరకు వచ్చిన పేరు ప్రతిష్ఠలు అంతా ఇంతా కావు. సాక్షిలోని తొలివ్యాసాలు 1913లో 'సువర్ణలేఖ' అనే ఓ పత్రికలో ఓ సం॥రం పాటు వచ్చాయి. తర్వాత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు నిర్వహించిన ఆంధ్రపత్రికలో 1920లో మొదలుపెట్టి దాదాపు రెండేళ్ళు వారానికొకటి చొప్పున రాశాడు. ఆ రోజుల్లో సాక్షివ్యాసాలను ప్రజలు ఎగబడి చదివేవారనీ, ఆంధ్రపత్రికకోసం రైల్వేస్టేషన్‌లో పడిగాపులు పడే...రనీ తెలుస్తుంది. తెలుగువచనశైలి మరింత ఉజ్జ్వలంగా ఠీవిగా ఉండాలని పానుగంటివారు ఆరాటపడ్డారు. 'ఇప్పటి వచనశైలి తరుచుగా నీరసముగను నిప్ప్రౌఢముగనున్నది. కాని మిగుల సంతుష్టికరముగా నుండలేదు. ఇంకను బలిష్ఠమై, ధారాళమై పౌరుషయుక్తమై, ప్రాణదురంధరమైన శైలి బయలుదేరలేదు'. అని వ్యాఖ్యానించి,

'క్రమక్రమముగా బయలుదేరగలదు' అని ఆశాభావాన్ని ప్రకటించారు. సాక్షివ్యాసాలతో తాను తలపోసిన శైలీవైశిష్ట్యాన్ని ప్రదర్శించారు.

సాక్షి వ్యాసాల్లో ప్రతిపాదితాంశానికి పరిహాసపేశలత్వం; ఒళ్ళుగగుర్పొడిచే గాంభీర్యం; తీవ్రకశాఘాతాల్లాంటి ఆవేశపూరిత వాక్యనిర్మాణం, లాలించి బుజ్జగించే హృదయమార్దవం; చమత్కారభరితమైన సంవాద కల్పనం: ఫెళ్ళున విరుచుకపడి, గట్లను తెంచుకొని ఊళ్ళనుముంచెత్తి ఉక్కిరిబిక్కిరి చేసే వరదగోదావరిలాంటి, తుఫాన్‌లాంటి దృష్టాంతాల పరంపర; అతిసాధారణమైన వస్తువుగా నిత్యం కనిపించే దానిలోనే ఒక సరికొత్త (అపూర్వమైన) కోణాన్ని దర్శింపజేసే లోకజ్ఞత. చిన్న చిన్న మామూలు పదాలు వెంటనే సుదీర్ఘ సమాసచాలనం అంత్యప్యాసల సమపద పునరావృత్తుల అలరింపు; వాచాలత్వం, దూకుడుతనం బహుముఖీనమైన ప్రజ్ఞాపాటవం తోడుకావడంతో ఆ వ్యాసాలపట్ల పఠితల్లో ఆసక్తి, ఆకర్షణ ద్విగుణీకృతంగా త్రిగుణీకృతంగా పెరిగింది. మొత్తంగా ఆంధ్ర సాహిత్యానికే ఒక అపూర్వ అలంకారంగా సాక్షి ప్రతిభాసించింది. అవతరించి ఏడుపదులు దాటినా కాలపరిణామంలో ఎన్నెన్ని మార్పులు వచ్చినా సాక్షివ్యాసాలపట్ల భిన్నాభిప్రాయం మాత్రం రాలేదు. వన్నె వాసి తగ్గలేదు. సాక్షివ్యాసాల్లో నిక్షిప్తమైఉన్న హాస్యకోణాలను స్థాలీపులాకన్యాయంగా దర్శించి ఆస్వాదిద్దాం.

స్త్రీలు అధికసంఖ్యలో ఉన్నారన్న ఒక్క మాట చెప్పడానికి అంత్యప్రాసలు ఘటించి ఎంత ఆకర్షణీయం చేస్తారో గమనించండి.

'ఎక్కడ వినినగాజుల గలగల, అందెల ఝణఝణ, కాంచీఘంటికల గణగణ, ఎక్కడ జూచిన జెక్కుటద్దముల తళతళ, గబ్బిగుబ్బల పెళపెళ, తారహారముల మిలమిల, వేణీభారముల జలజల, ముద్దుమొగముల కలకల, ఎక్కడకు బోయిన నగరుధూపముల గమగమ, చందనచర్చల ఘుమఘుమ, మృగమదలేపముల ఘుమఘుమ-'

'కొర్నాటి చీరలవారు, బనారసుకోకలవారు, బరంపురపు పీతాంబరములవారు, సన్నకుసుంబా చీరలవారు, గోచికట్లవారు,' గూడకట్లవారు, చుట్టుత్రిప్పులవారు. మేలిముసుగులవారు, వ్రేలుముళ్ళవారు, జడచుట్లవారు, వంకకొప్పులవారు......' అంటూ సుదీర్ఘంగా లోకంలో ఉన్న వైవిధ్యాన్నంతా ఒక్కచోట రాసిపోసి ప్రదర్శిస్తారు. సాదృశ్యపరంపరలను సమానాంశాలను కుంభవృష్టిలాగ కురిపించడం ఆయన 'విస్తరింపు' గుణంలో ప్రధాన అంశం.

హేళన చేయడం; ఆ హేళనలో సామాన్యరచయితలెవరూ ఊహించలేని దృష్టాంతాలను పేర్చడం వల్ల ఒక వింతసోయగం సిద్ధించింది.

'శనివారప్రాతఃకాలమునకు దుర్ముహూర్తమునకు; బఱ్ఱెకట్టుకొయ్యకు, బాడికి, నుప్పుచేపకు నాసాపుట రోమదహన సమర్థమగు దుర్వాసనకు, యాచనకు, దైన్యమునకు నెట్ల వినాభావసంబంధమో పండ్ల శాస్త్రులకు నూకిసాని కట్టి యభేదాద్యవసాయము...'ఆ శాస్త్రి ఆ సాని ఎంతో అన్యోన్యంగా ఉన్నారు. ఒక జంట అతిస్నేహాన్ని అవహేళనాత్మకంగా చెప్పడానికైనా గ్రహించిన సాదృశ్యాలు విలక్షణమైనవి. ఆసక్తికారకాలైనవి.

పాఠ్యపుస్తకాల్లో ఉండడం మూలాన 'స్వభాష' అనే సాక్షివ్యాసం అందరికీ పరిచయం. అందులో తెలుగుమాట్లాడడం రాదు అన్న ఒక తెలుగువానిమీద పానుగంటి దండెత్తిన తీరు ఆశ్చర్యదాయకం.

'మన యగ్రాసనాధిపతిదేవుని కాంధ్రభాషరాదట-ఆయన యాంధ్రమున మాటలాడనే లేరట. అయ్యయ్యో? ఆంధ్రమున మాటలాడలేకపోవుటయేమి? మూగవారు కారే.. వీరలాంధ్రమున మాటలాడలేకపోవుటయేమి? లేకపోవుట యనఁగా నాకేమో బోధపడలేదు. మ్యావుమని కూయలేని పిల్లి యెచ్చటనైన నుండునా? కిచకిచలాడలేని కోతిని మీరెచ్చటనైన జూచితిరా? ఈతరాని కప్పయే దేశమందైన నుండునా? పుట్టగానే క్యారుమనలేని బిడ్డ చచ్చినదఁసుటకేమైన సందేహమా? ఆంధ్రదేశమునఁబుట్టిన పక్షులైన ననవరతశ్రవణమున నాంధ్రమున మాటలాడుచుండఁగా అయ్యయ్యో! మనుజుడే-అంత-మనుజుడే-ఆంధ్రమాతాపితలకుఁ బుట్టినవాడే-ఆంధ్రదేశీయ వాయునీరహారపారణ మొనర్చినవాడే-అధమాధమ మారుసంవత్సరముల యీడు వఱకైన నాంధ్రమున మాట లాడినవాఁడే-అట్టివాడాంగ్లేయభాష నభ్యసించినంత మాత్రమున నిప్పుడాంధ్రమున మాటలాడలేకుండునా? ఆశ్చర్యము అవిశ్వసనీయము, అసత్యము.... తెలుగు మాటలాడినవాడు విధము చెడినవాడు, విద్యరానివాడు, గౌరవము లేనివాడు, గతిలేనివాడు, తెలివిమాలినవాడు, దిక్కుమాలినవాడు! ఆ.ఆ. ఆయనకట్టియభిప్రాయమున్నది... ఆంధ్రమున మాటలాడుట సిగ్గు సిగ్గు-తప్పు-నీచత అధమత...'

ఇలా పానుగంటి వారి అధిక్షేపం అప్రతిహతంగా గుండెలను తాకుతుంది. డెబ్బదేళ్ళక్రితం పానుగంటివారు వెలిబుచ్చిన అభిప్రాయానికి వర్తమానస్థితికి సరిపోల్చి చూసుకొంటే ప్రపంచీకరణ కుట్రలో క్రమేపీ తెలుగుభాష కనుమరుగైపోయే దుస్థితి కళ్ళకు కనబడడంలేదా? భాష ఒక్కటే కాదు మన ఆచార వ్యవహారాలు, సెంటిమెంట్స్ అన్నీ మాయమైపోవడంలేదా? ప్రపంచమే 'అమెరికా'గా పరిణమించడం లేదా గమనించండి. అంతా నిస్సహాయత, అసమర్థత, కనిపించడం లేదా ఆలోచించండి.

పానుగంటివారు తెలుగుభాషకోసం పాటుపడ్డారు. వెనుకటి పెద్దమనిషి కనుక ఆయనకు

ఆంగ్లంరాకపోవచ్చునని ఎవరైన అమాయకులు భ్రమించే అవకాశం ఉంది. తరాలుమారిపోయాక కొత్తతరం వచ్చాక పాతతరానికి చెందిన వ్యక్తుల గొప్పతనం పరిచయం లేకపోవడం కూడ సహజపరిణామమే. పానుగంటివారు 1888లో బి.ఎ ఇంగ్లీషులో సర్వోత్తములుగా ఉత్తీర్ణులై మెట్కాఫ్ స్వర్ణపతకం గ్రహించిన మేధావి. రాజమండ్రి కళాశాలలో బి.ఎ చదువుతున్న రోజుల్లో ఆంగ్లేయుడైన ప్రిన్సిపలు ఆంగ్లం బోధించేవాడు. ఒకరోజు ఆయన తరగతికి రావడం ఆలస్యమయ్యేసరికి సరదాగా పానుగంటివారు లేచి షేక్స్పియర్‌ను గురించి అనర్గళంగా మాట్లాడడం మొదలుపెట్టాడు. ఇంతలో ప్రిన్సిపల్ వచ్చి అది గమనించి ఉపన్యాసానికి ఆటంకం కల్పించకుండా గోడచాటుకు నిలిచి ఆసాంతం విని పరమానందభరితుడయ్యాడట. పానుగంటివారు ఆంగ్లమొక్కటే కాదు. ఉర్దూ, పర్షియన్ భాషలు నేర్చుకొని ఆనెగొంది సంస్థానంలో దివానుగా పనిచేశారు. ఈ సాక్షివ్యాసాలకు 'స్పెక్టేటర్' అనే ఆంగ్ల వ్యాసాలు మాతృక అంటారు విద్వాంసులు. కేవలం 'సాక్షి వ్యాసాలు' చదివినవాడెవడూ, ఆంగ్ల వ్యాసాలకు అనుసరణలని తలపోయడు. స్వతంత్రమైన, సృజనాత్మకమైన తెలుగు వ్యాసాలుగానే భావించి హర్షిస్తాడు.

దురభిమానంతో తెలుగును నేర్చుకోవాలనడంలేదిక్కడ. ఆంగ్లభాషమీద ద్వేషమూ లేదిక్కడ. తెలుగుమనది. మన సంస్కృతీమూలాలు, ఆత్మీయతలు తెలుగులోనే ఉన్నాయి కనుక తెలుగునేర్చుకోవాలని ప్రబోధించాడు. ఎంత ఇంగ్లీషులో రాసినా మన భాషలో రాసిన మౌలికత రాదు. ప్యారడైజ్‌లాస్ట్ రాసి మహాఘనుడనిపించుకొన్న మిల్టన్ రాసిన లాటిన్ పద్యాలు లాటిన్ మాతృభాషకలిగిన కవులరచనలతో పోలిస్తే, అధమస్థాయివి అని సోదాహరణంగా వివరిస్తూ చివరికి ఇలా అంటారు. ఆంగ్లభాష నేర్చుకోవాలి. అదొక్కటే కాదు ఎన్ని భాషలైనా నేర్చుకోవచ్చు, అవన్నీ మన మాతృభాషాభివృద్ధికి ఉపయోగించుకోగలగాలి. తెలుగు వచ్చిన వాడితో పొరపాటున కూడ ఆంగ్లంలో మాట్లాడవద్దు. తెలుగులో మాట్లాడండి. తెలుగు పుస్తకాలను విమర్శనబుద్ధితో చదవండని ప్రబోధిస్తాడు.

నానాటికి తీసికట్టుగా మారుతున్న తెలుగు పరిస్థితి ఇంకో అర్ధశతాబ్దం తర్వాత ఏ తీరుగా ఉంటుందో మీ ఊహకే వదిలేస్తున్నాను.

సన్నివేశాలను హృదయంగమంగా కల్పించి చెప్పదలచు కొన్న అంశాన్ని చెప్పడంలో పానుగంటివారికున్న ప్రతిభను 'జన్మపరంపర' మొ॥ వ్యాసాల్లో చూడవచ్చు. 'పునర్జన్మ'ను చాలామటుకు నమ్ముతారు. పోయిన జన్మలో చేసుకొన్న పుణ్యమే ఈ జన్మలో సుఖపడడానికి హేతువైందనీ; ఈ జన్మలో పదిమందికీ మేలుచేస్తే వచ్చే జన్మలో మరింత మంచి జరుగుతుందని విశ్వసిస్తారు.

ఒకరాజు ఒక అందమైన కోడిని చూసి ముచ్చటపడి పెంచుకొంటాడు. దాన్ని పొలావు చేసుకొని తినాలని అనుకోడు. కాని వంటవాడు దాన్ని చంపి వంట జేస్తాడు. ఆ రాజుగారు చాలబాగుందని లొట్టలేసుకొని తింటాడు. (ఇంతవరకు మామూలు సంగతి) ఆరాత్రి రాజుగారి కలలో కోడి ప్రత్యక్షమై పోయిన జన్మలో నీ తండ్రిని నేనేరా! నన్నే చంపితిన్నావు గదూ! అని ఆ కోడి వరుసగ ఎన్ని జన్మలెత్తిందో చెప్తుంది. ఒక నల్లిగ మొదటి జన్మ. రాకుమారి ఇంట్లో దొంగలు దూరిన వేళ రాకుమారిని నల్లికుట్టడంతో ఆమె మేల్కొంటుంది. దొంగలు పారిపోతారు. అనుకోకుండా జరిగిన ఈ మంచి పనితో బోలెడు పుణ్యం వచ్చి మరుజన్మలో రాజకుటుంబంలో అందమైన దాసిగా జన్మ కలిగింది. రాకుమారుడిని పెళ్ళాడాలని ఎంతో ఆశించి విఫలమనోరథయై మరుజన్మఎత్తి రాకుమారుని భార్యగాగలుగుతుంది. తర్వాతి జన్మలో చేసిన దుష్కార్యం ఫలితంగా కోడిగా జన్మఎత్తాల్సివచ్చింది. 'నీ యిల్లు చేరితినని మహానందమొందితిని. తుదకు-నీవేనన్ను! బలావు చేయించి పారణమొనర్చితివి. నాయన! నీవింతచేయుదు వనినేననుకొనలేదురా! క్రిందటి రాజజన్మమున నాకుబుట్టిన పుత్రుడవు నీవేరా! నిన్ను 'గన్నతండ్రిని నేనేరా!'

జీవుడు కర్మవశాన రకరకాల జన్మలెత్తగలడని విశ్వసించినపుడు ఇదంతా సాధ్యమే. పరమగంభీరమైన విషయానికి హాస్యస్ఫోరకమైన సన్నివేశాన్ని కల్పించి చెప్పగలగడం దీనిలో విశేషం.

మహత్తరమైన విషయాలను మహత్తరమైన శైలిలో ప్రతిపాదించడం రచనాకళకు నిదర్శనమే తప్ప హాస్యరచనకు కాదు. అతి సాధారణ విషయాన్ని అత్యంత గంభీరంగా చెప్పడంలో హాస్యరచయిత నైపుణ్యం వెల్లడవుతుంది. ఆ విధంగా అతి సామాన్యాంశాలను ఎంతో రాజఠీవితో చెప్పిన వైనాలు కూడ పానుగంటిలో లేకపోలేదు.

అన్నములేని వాని బాధ బాధకాదు. భార్యలేని బాధ బాధకాదు. కొడుకులేని బాధ బాధకాదు.' ఇన్ని విశేషణాలు వరుసగ వేసేవరకు, జీవనాధారమైన అన్నం, సన్నిహితకుటుంబసభ్యులైన భార్య, భర్త, కొడుకు లేక పోవడం అనేది ఎవరికైన అత్యంత బాధాకరమైన అంశాలు. కానీ అవేవి బాధలు కావు. అంతకన్నా ఇంకేదో పెద్దబాధ ఉంది. అదేమిటయి ఉంటుందన్న ఉత్సుకత. ఉత్కంఠ పాఠకుల్లో కలగకమానవు. మరి ఏమిటాబాధ? ఊరించి ఊరించి 'పొడుములేని వాని బాధ, ముమ్మాటికినీ బాధ' అని అసలు సంగతిని బయటపెట్టేసరికి ఊపిరిబిగబట్టి చూస్తున్న పాఠకులు ఒక్కపెట్టున పకాలున నవ్వుతారు.

అల్పాతి అల్పమైన పనికిమాలిన 'దోమ'ను పానుగంటివారు అద్భుత సమాసచాలనంతో వర్ణించడం పదాలు అర్థంకాకున్న భావం బోధపడి పాఠకుల అధరాలపై నవ్వులు దోబూచులాడక

తప్పదు. వివిధ ప్రాంతాల నుండి దోమలు విచ్చేసి సభజేసి 'విశ్వాసహీనులైన మనుష్యజాతిని అసహ్యించుకోవాలనీ మనిషి రక్తం వల్ల మనసెంత కీడు కలుగుతుందో అన్ని దోమలు గుర్తుంచుకోవాల'ని పిలుపు ఇచ్చిన సందర్భం. ఆ దోమలకు ఏర్పాటు చేసిన బసల (విడుదుల) పేర్లు చూడండి. 'పాలకొల్లు మశకముల విడిది'. 'కొల్లేటి మశకరాజముల మహలు' 'కళింగదేశ మశకమహారాజముల మౌక్తిక మందిరము'! 'ఆనెగొంది మశకసార్వభౌముల మహాలక్ష్మీ నికేతనము' ఇలా పేర్లు పెట్టాడు పానుగంటి. 'శ్రీమాన్ మహామండలేశ్వర మహారాజాధిరాజ గండరగండాది బిరుదాంకితులయిన శ్రీకృష్ణదేవరాయులయాస్థానమందలి క్షీరపటీరహీరచంద్రికాసార ధిక్కార జగద్విశ్రాంత యశస్సాంద్రములైన కిష్కింధ' దోమలను సుదీర్ఘ సమాససమన్వితంగా భాషాపటాటోపంతో వర్ణించి హాస్యోత్పత్తిగావిస్తారు.

సాధారణంగా సమావేశమందిరాలు పరిచయాలకు వేదికలు. ఎవరిళ్ళల్లో వాళ్ళు ఉండడం కాకుండా ఒక చోట కలువగలుగుతారు. కరచాలనాదులతో ఆత్మీయంగా పలకరించు కోగలుగుతారు. ఎక్కడెక్కడినుండో సభకు వచ్చిన దోమలనుచూడండి. కనుచూపుమేర వ్యాపించిన విశాలమైదానంలో దోమలకు విడిదులు ఏర్పాటు చేశారు. 'ముచ్చటలాడుకొనుచు, మూర్కొనుచు, మూఁసుకొనుచు, ముద్దిడుకొనుచు, మురిసికొనుచు, మూల్గుకొనుచు, మూత్రించుకొను నా దోమలన్నియు చిత్రవిచిత్ర చేష్టాసమన్వితములై యున్నవి.'

అఖిలాంధ్రదేశము మత్కుణమశక మూషకాది సభ వారి స్వభాషయైన ఆంధ్రభాషలోనే జరుపుకొన్నాయట. ఆ సభకు అధ్యక్షునిగా ఒక ఎలుకను ఎన్నుకొన్నాయి. జమ్మికింద రాతల్లాగా సభల్లో అతిప్రశంసలు జరుగుతుంటాయి. ఆ ఎలుక తనఅధ్యక్షోపన్యాసంలో ఆ దోమలనే విధంగా సంబోధించిందో గమనించండి.

'ఆర్య సోదర సోదరీమణులారా! అఖిలాంధ్రజాతియ మశకమత్కుణాది మహాసభకు (అహాహా! వినుడు-వినుడు ఏమి స్వార్థపరిత్యాగము! ఏమి నైచ్యము! తన జాతి పేరే యెత్తినాడుకాడే యని కేకలు) నన్నగ్రాసనాధిపతిగాఁ జేయుటచే నాజాతియంతయుఁ గృతార్థమైనది. ఆహా! మీరేమి సామాన్యులా? మీ సభ విద్వత్సభకాని మఱియొక్కటియా? ఓ! వేదవేదాంగవిజ్ఞానసంపన్నులు, ప్రకృతిశాస్త్రపాండితీమండితులు, రాజకీయతంత్రపారగులు-బ్రాహ్మణవాదులు-భక్తాగ్రగణ్యులు-కవిశిఖామణులు-గాయకోత్తములు-చిత్రలేఖకులు-మితవాదులు-మధ్యవాదులు-నతివాదులు-సర్వతంత్ర స్వతంత్రులగు నెందఱో యిచ్చట స్వస్వరూపముతో సకుటుంబ బంధుమిత్ర పరివారలై వేంచేసియుండ నల్పుఁడనగు నేను-మశకసోదరులారా! మీవలె వ్యోమయానశక్తిలేని నేను-మత్కుణసోదరులారా! మీవలె మృదుల శరీరాంతరంగ సౌష్ఠవములేని నేను-మశకసోదరులారా! మీవలె, గంభస్వరమాధురీపరిపాకము లేని నేను-మత్కుణ సోదరులారా! మీవలె శత్రుహింసాపారాయణతలేని నేను-మీకధ్యక్షుడనై

నిలువ వలసి వచ్చినది. ఎందువలన? మీ మీ యాజ్ఞవలన.

ఈ విధంగా అనుదాత్తమైన వస్తువును ఒక ఉదాత్తమైన ధోరణిలో చెప్పడాన్ని విలోమ పేరడీలనవచ్చు. ఆంగ్లంలో Burlerque, Mockheroic వీటినే సూచిస్తాయి. తెలుగులో దోమదండకాలు. కాఫీదండకాలు, తిట్లదండకాలు లాంటివి ఈ కోవకే చెందుతాయి.

ఈ దోమలు, ఎలుకలు, నల్లులు మానవునిమీద చేస్తున్న ఆరోపణలు ఎంత ఆసక్తికరాలో! అంత హాస్య ప్రదాయకాలు!! ఎంత హాస్యప్రదాయకాలో! అంత వాస్తవాలు!! పరమాసక్తికరంగా చదివించి నయనసాక్షాత్కారం చేయిస్తుంది పానుగంటి విశిష్టలేఖిని. ఉదాహరించాలంటే సమస్తం రసగుళికే. ఆస్వాదించవలసిందే. ఆనందించవలసిందే. కేవలం రుచికోసం కొంతభాగం ఉదాహరిస్తాను.

నరజాతి యంతటి తుచ్ఛజాతి ప్రపంచమున మరియొకటి లేదు. నరుడు మనకు శత్రుడు-ప్రబలశత్రుడు. తానేమహావీరుడట! వీరాధివీరుడట-... వీని గర్వము కాలిపోను! పిరికిపెద్దమ్మలలో నగ్రగణ్యుడెవడు? నరుడు. తెలిసినదా? (సెబాస్ సెబాస్ అనుకేకలు). చేతవాతగాని చచ్చుపెద్దమ్మలలో నగ్రతాంబూలమునకు సిద్ధపడువాడెవ్వడు? నరుడు. తేలును జూచిభయమా! జెర్రనిగాంచియేడుపా? పామునుజూచిపరుగా? -దోమ కరచిపోవునేమోయని సాయంకాలమగుసరికే సన్నని గుడారములో దూరినవాడు వీరుడా! మననల్లిపోతులలో నొక్కటి ప్రక్కజేరి కటుక్కున నంటబొడిచిన యెడల కల్లుద్రావిన వానివలె తయితక్కలాడువాడు ధీరుడా? అంతవరకెందుకు?

గాలి చల్లబడిన యెడల నొక్కరోగము-మోతాదుగనున్న మరియొక్క రోగము- వెచ్చబడిన వేరొక్క రోగము- గంగిరెద్దునకున్నంత గంతవేసుకొని కాని వెలుపలికే వేంచేయడే-వీడేనా వీరుడు-వీడేనా సృష్టికి ప్రభుడు.

ఓ తుఫానుపట్టనీ-అగ్నిపర్వతము ప్రేలనీ! భూకంపములు రానీ! మంచుగడ్డలు వర్షింపనీ! మనము దిగంబరులమైయొక్క వెండ్రుకయైన నూడకుండ నొక్క రెక్కయైన జారకుండ పంచభూత మహాసంక్షోభమును మహావీరులమై యెదుర్కొనుట లేదా? యథార్థవీరు డెవడో యిప్పుడు తెలిసినదా?

అధ్యక్ష్యోపన్యాసం చేస్తున్న ఈ మూషికశిఖామణి తర్కాన్ని విన్న తర్కశాస్త్ర కోవిదులైన పండితులు సైతం దిమ్మతిరిగి నోటమాటరాక, ప్రతిసమాధానం చెప్పలేక తలలు నేలకు వాల్చి ఆమోదించవలసిందే గదా! ఎంత ఉదాహరించిన తనివితీరదు. ఒక దోమగారి ఉపన్యాసాన్ని ఆలించండి.

కవిత్వము, గానము నరుడు దోమలనుండే నేర్చుకున్నాట్ట. భూమిని తవ్వడం-లోహాలు తీయడం అనే జియాలజీని ఎలుకలనుండి అపహరించాట్ట. పిండిమరలకు, ఇతరయంత్రాలకు ఎలుకపండ్లే ఆదర్శమట. పందికొక్కు ఒంటిమీద ఉన్న బొచ్చుచూసి ఉన్నిబట్టలను కోటులను తయారు చేసుకొన్నాట్ట. దోమకాటువల్ల మలేరియా బోదకాలు వస్తున్నాయని అపప్రచారం చేస్తున్నారు. ఇది వట్టిఅభూతకల్పన. సింహం మొదలు చీమదాకా దోమకాటు తినని జంతువు లేదే. మరి వాటికెందుకు రావడం లేదు వ్యాధులు. మానవుని రక్తపానం వల్ల మనకు వస్తున్న రోగాల మాటేమిటి? మనవల్ల అతనికి మలేరియా వస్తుందే కాని అతనివల్ల మనకు భయంకరమైన జలేరియా రావడం లేదా? మనిషి రక్తం తాగి మూడేసి దినాలు మొద్దులై పడియుండడం లేదా? మొదటి చచ్చువాతపు వ్యాధికి 'జలేరియా'యనీ రెండవదైన గాత్రపు పొంగువ్యాధికి 'గైలేరియా'యనీ పేర్లుపెడితే అడ్డుకొనేదెవ్వరు? ప్రపంచ ధోరణి ఇంతే. ప్రకృతిశాస్త్ర పరిశీలనమింతే. ఉ॥ నాలుకయెటులాగునో యటు వాగుటా! కలమెటులాగునో యటు వ్రాయుటా?

మనుషులను తూలనాడే ఈ ఉపన్యాసం ఎంత తారస్థాయికి చెందుతుందో కొసమెరుపులాగ గమనిద్దాం. దోమజాతిలో పూర్వమంత స్త్రీ వాంఛలేదట. ఏదో కాలానుగుణంగా యథోచితంగా ఉండేదట. ఇప్పుడట్లాకాదట. ఊహూ ఎప్పుడదేచింత. ఇదేమికర్మమో! దిక్కుమాలిన వ్యసనమైపోయింది. ఈ కామేచ్ఛ అధికం కావడానికి నరరక్తపానమే కారణం.

ఇలాగ వ్యాఖ్యానిరపేక్షకంగా హాస్యస్ఫోరకంగా మానవమనస్తత్వాన్ని సున్నితంగా ఆక్షేపిస్తారు పానుగంటివారు.

ఒక్కమాటకు పదిమాటలు గంగాప్రవాహంలా దూసుకొనివచ్చి ప్రతిపక్షుల నోళ్ళు మూయించడం పానుగంటివారి రచనాకళ. ఎవడో కవిత్వంరాయలేడన్నట్లుగా విమర్శించాడు అంతే!

'నీవేడ్చుచున్న తెలివితక్కువ నిర్భాగ్యపు టల్లరి చిల్లరి యవకతవక యాసమ్మ మోసమ్మ యారిగ చొప్పయులుకుగుడ్డ కవిత్వమునే జెప్పలేక మానివేయలేదు. గడియసేపు ఛందోగ్రంథమేదైన జూచితినేని నీపేలపిండి వట్టి గడ్డి కల్లబొల్లి కాకికూత కవిత్వము నా కవిత్వము చుట్టు ముమ్మారు త్రిప్పి త్రిప్పి దిగదుడుచుటకైనను పనికిరాకుండ జేయగలుగుదును.' - అని గుక్కతిప్పుకోకుండా అనేవరకు ఆ ముందు అన్నవాడు ఆమడదూరం పారిపోయివుంటాడు.

ఈ విధంగా ఆంధ్రవచనం పౌరుషాన్ని, ప్రాభవాన్ని సృజనాత్మకశీలాన్ని సహస్రముఖాలుగా అభివ్యక్తీకరించిన చరిత్రలో తనకుతానే సాటి అనిపించుకొన్న మహనీయుడు పానుగంటి. ఏ ఒకటిరెండు వాక్యాలను అలవోకగా తడిమి చూచినా సాక్షిరచనా విన్యాసం ఆకర్షణ మనసుకు

హత్తుకోవడంతో పానుగంటికి విపరీతమైన పేరు వచ్చిందన్నది వాస్తవం. కాని పానుగంటివారి అభిప్రాయం మాత్రం వేరు. 'ఏనాటికైనను తమకీర్తి దశదిశల వ్యాపింపజేయుటకు శాంతినొసగుటకు తమ నాటకములే ప్రథమములనియు ఎడమచేతితో వ్రాయబడిన సాక్షి సంపుటము కావని పానుగంటి వారి అంతరంగం.

నాటకాల్లోనూ పానుగంటివారు రాసిన రాధాకృష్ణ కంఠాభరణం. పాదుకాపట్టాభిషేకం ఇత్యాది నాటకాల్లో సైతం హాస్యరసపోషణను సముచితంగా చేశారు. పిఠాపురం మహారాజా వారి అభ్యర్థన మీద రచించిన కంఠాభరణం 'మిగులనవ్వువచ్చు నాటకం'. కంఠాభరణంలో సోమావధాని పాత్రకు 'మాలె ప్రోఫిజం' అనే హాస్యవైవిధ్యాన్ని జోడించాడు. ఒక అర్థాన్ని తలపోసి కించిదుచ్చారణ సామ్యంతో ఉన్న వేరొక పదాన్ని పలకడం 'మాలె ప్రాఫిజం' లక్షణం. పునస్సంధానం అనడానికి పునస్సంతానం అనీ, ఉషఃకాలం అనడానికి వృషఃకాలమనీ; మీ మాంసలు అనడానికి మీ మాంసములు అనీ విధి విధేయముగా అనడానికి విధివిరోధముగా అనీ ప్రాణహరణం అనడానికి ప్రాణభరణం అనీ సోమావధాని పలుకుతారు.

'మీరు మంత్రులా బాబూ! దండాలు. కాశ్మీరమనగా రామేశ్వరం దగ్గరనే గదా!' అని అమాయకంగా అడుగుతాడు ఓ సేవకుడు. అట్లాగే సరస్వతి అనే మరో నాటికలో 'వల బుజానవేసి ఎన్నియేండ్లయినదో! కుంటి బాపనయ్య అయిదు పదుల మీద రెండున్నాడు. కంతి సాతానమ్మ పద్దైదులమీద రెండన్నది ఎవరిమాట నిజమో నాకు తెలియదు?' అని పల్లెటూరి వాడిమాటల్లో అమాయకమైన హాస్యం గోచరిస్తుంది.

భారతంలోని పర్వాల సూచకమైన పేర్లను గ్రహించి శ్లేషలో ప్రయోగిస్తు హాస్యాన్ని పండిస్తున్నాడు. సుబ్బలక్ష్మి రామశాస్త్రి రెండు చెవులను పట్టుకొని ఈడుస్తుంది. అప్పుడు రామశాస్త్రి అనే మాటలు. 'చెవుల బిగింపు చేత కైమని శ్రుతితారకములో పడినది. అహ హ హహ! మా భారతమునకు కర్ణపర్వమే యారంభము. అయినను శల్యపర్వములోనికి పొడుచుచున్నది. అబ్బ అబ్బ ఈ స్త్రీ పర్వమే బెడిసికొట్టిన యెడల మాకిక స్వర్గారోహణపర్వము తప్పదు.'

అట్లాగే సాక్షిలో ఒకచోట ఆ విష్ణుమూర్తికి బొడ్డులోనే తామర (పద్మనాభుడన్నమాట), 'మా బొర్రయసెట్టికి వంటినిండా తామర' అని తామరశబ్దం మీద శ్లేషను ప్రయోగిస్తాడు.

పానుగంటివారి 70వ జన్మదినోత్సవ వేళ జరిగిన సభలో కృతజ్ఞతాపూర్వకంగా సమాధానమిస్తు కూడ తన హాస్యప్రవృత్తి వీడలేదు. "ఒక మతి యుండి అది సరిగా వినకుండిన బాధపడచుండు నాకు బహు'మతు'లనిచ్చి యేల బాధింతుర"ని చమత్కరించాడు.

విప్రనారాయణ చరిత్ర నాటకంలో అతిగురుభక్తుడైన శ్రీనివాసుడు దేవదేవితో గురువుగారి సేవను చాలించుకొని వెళ్ళిపోవలసిన సమయ మాసన్నమైందని చెప్పిన మాట దానికి ఆమె

ఇచ్చిన సమాధానం పాఠకులను అమితంగా ఆకర్షించకమానదు.

'పాపము! నేటితో నీకు గురుసేవాఋణము తీరిపోయినది' అని శ్రీనివాసుడంటే దేవదేవి! 'రంగ రంగ రంగా! గురువుల వారాకస్మికముగా పరమపదించినారా!' అని అసహనంతో చెళ్ళున ప్రశ్నిస్తుంది. దానితో శ్రీనివాసుడు ఉక్కిరిబిక్కిరయిపోతాడు.

సారంగధర నాటకంలో సారంగధరునికి మరణశిక్షవిధిస్తారు. అప్పుడు సారంగధరుని తల్లి రోదిస్తూ సవతి అయిన చిత్రాంగి కాళ్ళమీద పడి వేడుకొంటున్నది.

రత్నాంగి: చెల్లెలా! నీ పాదములకు మ్రొక్కుచున్నాను! నాకు పుత్రదానము చేయుము.

చిత్రాంగి: నీ కొడుకే నాకు పుత్రదానము చేయుట కారంభించినాడు. ఆ పుత్రదానమేదో నీ కొడుకునే యాచించుకొనుము.

ఇక లాభం లేదనుకొని రత్నాంగి రాజుగారిని అర్థిస్తుంది. ఆయన ఆగ్రహంతో

రాజు: వాడు నా కొడుకు గాడు-కాడు

చిత్రాంగి: పతివ్రతాశిరోమణీ! భర్తగారేమనుచున్నారు.

కించిత్ అశ్లీలమో అసభ్యమో ఉన్నట్లు తోచినా ఆగ్రహప్రకటనను అది ఇనుమడింపచేసిందే తప్ప అనౌచిత్యకారకమై రసభంగం చేయలేదు.

**ఉపసంహారణం:**

**హాస్యరసశీలి:** నిరుపమాన నాటకవేత్త, మహారచయిత అయిన పానుగంటి లక్ష్మీ నరసింహరాయ మహోదయులు జీవిత చరమాంకంలో దైన్యం పాలయ్యారు. మహారాజు భోగమనుభవించిన శ్రీనాథుడు కడగండ్లపాలయికన్నుమూశాడు. విస్మంధ్రకవులెందరికో పట్టాభిషేకం చేసిన మానవల్లి రామకృష్ణకవి జీవితం అవస్థలతో ముగిసింది. తెలుగు తల్లికి మల్లెపూదండల లాంటి గేయాలను సమర్పించిన శంకరంబాడి సుందరాచార్యులు అలాగే స్తమించాడు. 'మా కొద్దీ తెల్లదొరతనము......' అని ఉత్తేజపరిచిన గరిమెళ్ళ సత్యనారాయణ చెన్నపురివీధుల్లో అవసానదశలో నిరుత్తేజంగా అడుక్కుతిన్నాడు. ఆంధ్రరాష్ట్రానికి ప్రథమ ముఖ్యమంత్రి అయిన టంగుటూరి ప్రకాశం పంతులు దయనీయంగానే జీవితాన్ని ముగించాడు.

11 ఫిబ్రవరి 1865న జన్మించి, 1888 బి.ఎ. ఆంగ్లంలో సర్వోత్తమంగా ఉత్తీర్ణులై, ఉపాధ్యాయునిగా, దివానుగా, కడుపారపిల్లలగన్నతండ్రిగా, ఆదర్శగృహస్థుగా జీవించి; అఖిలాంధ్రలోకంచేత మహారచయితగా జయజయధ్వానాలు పలికించుకొని, పిఠాపురాధీశ్వరులైన

సూర్యారాయబహద్దురుచే పోషింపబడి పానుగంటి వెలుగొందారు. కాని అంత్యదశలో రాజానుగ్రహం లోపించింది. వైమనస్యం ఏర్పడింది. విరోధులెక్కువయ్యారు. సంపాదన శూన్యమైంది. శారీరకారోగ్యం సన్నగిల్లింది. మానసిక దార్ఢ్యం మంటగలిసింది. నైరాశ్యం రెట్టింపైంది. ఉన్మాదతుల్యమైన చిత్తభ్రమ కలిగింది. 1935 ఏప్రిల్ 28న పానుగంటివారి సప్తతి ఉత్సవాన్ని అప్పటి యువకులు ఉత్సాహంతో పట్టుబట్టి పిఠాపురంలో చేశారు. కాని సమకాలికులైన పెద్దలందరు ఏదో ఒక నెపంతో ముఖం చాటేశారు.

1935 మే 3 ఆంధ్రపత్రికలో పానుగంటివారి దయనీయ స్థితి ప్రకటింపబడింది. అతిమూత్రవ్యాధి పెరిగింది. ప్రచురించిన పుస్తకాలు అమ్ముడుపోలేదు. బాకీలు పెరిగాయి. ఋణదాతలనుండి ఒత్తిడి పెరిగింది. 20 నాటకాలు, 5 సాక్షిసంపుటాలు మొత్తం 20 రు॥ చొప్పున 50 మంది వదాన్యులు కొంటే చాలు. లేకపోతే కారాగారశిక్ష తప్పదని పానుగంటి కన్నీళ్ళతో మొరపెట్టుకున్నాడు. అలా పుస్తకాలుకొని, ఆదరించిన కవిసార్వభౌముడు కొంతకాలము, మనలను, మనభాషను సేవింపగలడు లేకున్న పాపము శమించుగాక! మన అలసత్వమున నీ మహాకవి శేఖరుని మనచేతులార పిచ్చివానిని జేయుటో లేక ఏమి చేయుటో జరిగిపోగలదు. కావున అస్మద్దేశీయ సోదరులారా! ఈ మాత్రము సానుభూతి వెన్వెంటనే చూపి వారి పవిత్ర దేహాత్మల కాపాడుకుందుముగాక! అని యఱ్ఱమిల్లి లక్ష్మీనారాయణశాస్త్రి ఆంధ్రపత్రికలో రాసిన లేఖ చాలు వారి దుర్దశను అవగాహనజేసుకోవడానికి.

ప్రచండ వేగంతో రచనలు గుప్పించిన ఆ మహాకవి నైశిత్యానికి శరీరము, మనస్సు తట్టుకోలేక దుర్బలమైపోయాయి. నిద్రలేమి, ఏ మాత్రం శబ్దాన్ని భరించలేని వ్యాధికి గురయ్యారు. ఒక కందిరీగ గుయ్యిమని రొదపెట్టేసరికి దానికి తట్టుకోలేక కుప్పకూలిపోయారు. సన్నిహితులందరు ముఖ్యంగా ఆదరించిన రాజుగారు దూరమయ్యారు. ఎంత రాసినా జీవితంలో తృప్తి కలగలేదు. మానసికమైన అశాంతి తొలగిపోలేదు. తగిన గుర్తింపురాలేదన్న అసంతృప్తి సైతం పెరిగింది. ఈ దుస్థితిలో 1940లో జనవరి 1న అందరూ నవవర్షశుభోదయ కోలాహలంలో ఉన్న వేళ భూలోకానికి వీడుకోలు పలికి దివిజన కవివరుగుండియల్ దిగ్గురనగ పానుగంటివారు డెబ్బైఏడవ ఏట అమరపురికి వెళ్ళిపోయారు.

పానుగంటివారి సాహిత్యసృష్టిని సమీచీనంగా ప్రామాణికంగా పూజ్యభావంతో పరిశోధించిన గురుతుల్యులు, ఆప్తులు డా॥ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు కూడ అనారోగ్యంతో గత సం॥రం. అస్తమించారు. ఈ విధంగా పానుగంటికి; ఆయన మీద పరిశోధించిన ముదిగొండ వీరభద్రశాస్త్రిగారికి.శ్రద్ధాంజలి ఘటించే అవకాశాన్ని కలిగించిన యువభారతికి నా.కృతజ్ఞతలు.

సాక్షి సంపుటాలను ఓపిగ్గా చదువుకుందాం! అపూర్వమైన తెలుగు వచనరచనా విన్యాసానికి ముగ్ధులమవుదాం. మన తెలుగును కాపాడుకుందాం! మనల్ని మనం కాపాడుకుందాం!!



# అడుగుజాడ గురజాడది అది 'నవ్వు'కు బాట

శ్రీ శంకరనారాయణ(హాస్యావధాని)

అడుగు జాడ గురజాడది

అది భావికి బాట' అని మహాకవి శ్రీశ్రీ అన్నారు. దానిని కొద్దిగా మార్చి 'అడుగుజాడ గురజాడది అది నవ్వుకు బాట' అంటున్నాను. ఎందరో హాస్యరచయితలు. అందరికీ వందనాలు. అయినా అందులో ఒకే ఒక్కడు గురజాడ. ఎందుకంటే 'విశ్వశ్రేయః హాస్యం' అని నిరూపించినవాడు అప్పారావు. గురజాడ వారి హాస్యం ఏదో ఆషామాషీ హాస్యం కాదు. సంఘసంస్కరణ, సత్యాన్వేషణ కలిపి రంగరించి గురజాడ వారు 'ఏకోర'సః హాస్యమేవ' అని ఋజువు చేశారు. అందుకే 'కన్యాశుల్కం' నాటకం ఇతివృత్తానికి ఎప్పుడో నూరేళ్ళు నిండినా, ఆ నాటకానికి ఎప్పటికీ ' నూరేళ్ళు' నిండవని ఘంటాపథంగా చెప్పడానికి కారణం అందులోని హాస్యమే. అయితే కన్యాశుల్కంలోని రసం గురించి తలపండిన మేధావులు చర్చలు జరిపిన సందర్భంలో కన్యాశుల్కం బీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకం అన్నారు. నిజానికి కన్యాశుల్కంలో బీభత్సం లేదు. అది విషాదాంతమూ కాదు. అయితే బాల్య వివాహాల వెనకున్న సామాజిక దౌష్ట్యాన్ని చిత్రించిన నాటకం కాబట్టి శ్రీశ్రీ అలా అని ఉంటారు. అంతేకాక శ్రీశ్రీ అన్నమాట కన్యాశుల్కంలో ఉన్నమాటకాదు.

'హాస్యం' మీద గురజాడ వారి దృష్టే వేరు. అది ఆయన రచనల్లో అడుగడుగునా తొణికిసలాడుతుంది. ముత్యాలసరాల్లో, 'నలుగురు కలిసి నవ్వేవేళల నాపేరొక పరితలవండి' అని పుత్తడిబొమ్మ పూర్ణమ్మ చేత గురజాడ అనిపిస్తారు. విషాదనమయంలో కూడా నవ్వే వేళల గురించి ప్రస్తావించడం ఇందుకు నిదర్శనం

'నాటకంలో యంత హాస్యమైనా చెల్లుతుంది.' అని మధురవాణి చెబుతుంది. కన్యాశుల్కంలో అర్థమైన వాళ్ళకు అర్థమయినంత హాస్యం అందుతుంది. 'మధురవాణిని చూడగానే మతిపోయిందా యేమిటి' అని అని కరటకశాస్త్రి అంటే 'దాని నవ్వుపట్టుబడాలని నిదానిస్తున్నాను' అని శిష్యుడు అంటాడు. హాస్యానికి ఉన్న లైసెన్సును కూడా మంచి సెన్సుతో ప్రయోగించడం గురజాడ ప్రత్యేకత.

'మాటలు నేర్చిన శునకాన్ని వేటకు పంపితే ఊసుకోమంటే ఊసుకోమందిట' అంటుంది మధురవాణి. దానికి రామప్పంతులు 'నేనా శునకాన్ని? అని భుజాలు తడుముకుంటాడు. దానికి 'హాస్యానికన్న మాటల్లా నిజమనుకుంటారేమిటి?' అని మధురవాణి అంటుంది. 'అందరితో హాస్య మాడితే యరగవా' అని రామప్పంతులు అంటాడు. అంచేత నేకుక్కన్నా, పందన్నా, మిమ్మల్నే అనాలిగానీ మరొకర్ని అనకూడదే? 'అంటుంది మధురవాణి. హాస్యం ఎంత పవర్ ఫుల్లో దీనిని బట్టి చెప్పవచ్చు. రామప్పంతులు సంగతే ముంది? రాజునైనా ఎంత మాటయినా అనగలిగిన వాడు విదూషకుడే. విదూషకుడు ఎంత మాటని పల్లికిలించినా ఎవర్గూ ఏమనుకోరు. విదూషకుడు కాకుండా ఇతరుడెవరైనా రాజు గారిని అంతటి మాట చాటుగా నాన్న అతడి తలతెగిపడుతుంది.

హాస్యం అనేది పబ్లిక్ సర్వీసు. 'యేడుస్తూన్న దాన్ని నవ్విస్తా అన్నారు' అని బుచ్చమ్మ గిరీశానికిసర్టిఫికెటు ఇస్తుంది. అయినా గిరీశం బాధ గిరీశానికి ఉంది. 'లవ్వు' ఆయన లక్ష్యం నవ్వు మాత్రమేకాదు అనిపించేట్టు 'ఖుషి చేసి మారేడు కాయ చేస్తాడు గిరీశం. 'ఈ భూప్రపంచం మీద వుండుకున్న యావన్మంది స్త్రీలలోనూ, నిన్నొకర్తనూ వలచి నేను నీకు సుతలామూ లొంగిపోబట్టే గదా, నాబతుకు హాస్యాల కింద ఐపోయింది?' అని బుచ్చమ్మతో గిరిశం అంటాడు. తన బోధను, బాధను వెళ్లబోసుకుంటాడు.

## కన్యాశుల్కం హాస్య వేదం

కన్యాశుల్కాన్ని తెలుగులో హాస్య వేదం అంటే అతిశయోక్తి లేదు. వేదం ప్రభు సమ్మితమయింది. ఈ హాస్య వేదంలో కూడా హసించడంతో పాటు శాసించడం కూడా కనిపిస్తుంది. ఏ పాత్ర హాస్యం సృష్టించినా అందులో తిరుగులేని, తరుగులేని అథారిటీ కనిపిస్తుంది తప్ప ఏ మాత్రం తటపటాయింపు కనిపించదు. దొరుకునా ఇటువంటి హాస్యం అని పిస్తుంది. కన్యాశుల్కంలో మొత్తం 38 పాత్రలున్నాయి. ఏ పాత్ర గురించి వివరమడిగినా ఎంతయినా హాస్యం వెల్లివిరుస్తుంది. అయితే హాస్యం హాస్యం కోసం కాకుండా హాస్యాన్ని 'సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగా' వాడడం వల్ల గురజాడ శిఖర ప్రాముడయ్యాడు. బాల్యవివాహాలను తూర్పారపట్టడానికి, వితంతు వివాహాలకు పట్టం గట్టడానికి గురజాడ తన హాస్యాయుధంతో ఉద్యమస్ఫూర్తితో పని చేశారు. గురజాడ తన కన్యాశుల్కాన్ని హాస్యరస ప్రధానమగు నాటకమని స్పష్టంగా చెప్పాడు. కన్యాశుల్కంలోని అన్ని పాత్రల ద్వారా హాస్యాన్ని పంచిపెట్టి

'హాసమును ప్రేమించుమన్నా
'మంచి' అన్నది పెంచుమన్నా అన్నట్టు
కనులముందు నిలిచాడు.

## ఎవ్వనిలో జనించె గిరీశం

కన్యాశుల్కంలో ఎన్ని పాత్రలున్నా గురజాడ వారు హాస్యాన్ని అ'పాత్ర' దానం చేయక పోవడం విశేషం. గిరీశం పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవడానికి గురజాడ హాస్యప్రియులైన పెద్దలు కుస్తీ పట్టారు. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుడి చుట్టూ తిరుగుతుందన్నది ఎంత సత్యమో కన్యాశుల్కం తన చుట్టూ తాను తిరుగుతూ గిరీశం చుట్టూ తిరుగుతుందన్నది అంత సత్యం. అంతకు మించిన సత్యం. కొందరికి గిరీశంలో మృచ్ఛకటికం అనే సంస్కృత నాటకంలోని శకారుడి వికారాలు కనిపిస్తే, మరికొందరికి సాక్షాత్తు గురజాడ అప్పారావే గిరీశంగా కనిపించాడు. నామట్టుకు నాకు హరవిలాసంలోని కపటవటుడి కళలు కనిపిస్తున్నాయి. కపటవటుడు ఎవ్వరో కాదు పరమశివుడే. పార్వతి ముందు కపటవటుడి చేత శ్రీనాథుడు అనిపించిన మాటలు చూస్తుంటే గిరీశం మన మనస్సును గిల్లినట్టు అనిపిస్తుంది. పార్వతిని 'యాంగ్రీ యంగ్ విమన్' గా మార్చిన కపటవటుడు పరమేశ్వరుడు సస్పెన్స్‌కు తెరదించి నిజస్వరూపాన్ని ప్రదర్శిస్తున్న సమయంలో 'సాక్షాత్కారము నొంది నవ్వుచు గిరీశానుండు'. అని శ్రీనాథుడు వర్ణిస్తాడు. హరవిలాసంలోని ఆ 'గిరీశనుడే', ఆ భోళాశంకరుడే కన్యాశుల్కంలో 'గిరీశం'గా అవతరించాడని నా విశ్వాసం. అయితే గిరీశంలో 'ఫన్నింగ్ నెస్' తో పాటు అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రంలోని మాయా ప్రవరుని ప్రభావం కూడా కనిపిస్తుంది. మహాకవి, మహాపండితుడయిన గురజాడ అప్పారావు మీద పాత్రచిత్రణలో ప్రాచీన సాహిత్య ప్రభావం ఉండడంలో చిత్రమేమీ లేదు.

గురజాడ కన్యాశుల్కం తిరగేస్తుంటే ఏ పాత్రల మాటున ఏ వ్యక్తులు దాగిరో అన్న అనుమానం కలుగుతుంది. బాల్య వివాహాలను నిరసించడమైనా, వితంతు వివాహాలను సమర్థించడమైనా 'సీరియస్' వ్యవహారం. వాటిని ఏరకంగా అవహేళన పాలు చేయడం చెల్లుతుందా అన్న ప్రశ్నను కూడా వేసుకోవచ్చు. ఒక విషయాన్ని మనస్సుకు నాటుకొనేట్టు చెప్పడానికి హాస్యం బలమైన సాధనం కాబట్టే దానిని స్వీకరించడం అవసరం.

గురజాడ అప్పారావు కన్యాశుల్కం నాటకం రాయడానికి కొంత కాలం క్రితం విజయనగరం సమీపంలో వున్న ఒక ఊరిలో తమ బంధువుల ఇంటికి వెళ్లారట. ఆ ఇంటిలో ఉన్న వ్యక్తి దోరణులు గురజాడవారికి చిత్రంగా తోచాయట. అతడి లక్షణాలతో గిరీశం పాత్రను గురజాడ వారు మలచారట. గురజాడ అప్పారావు మనుమడు ఈ విషయం నాతో చెప్పారు. ఆయన పేరు కూడా అప్పారావే. మహాకవి అప్పారావు పేరే ఆయనకు పెట్టారు.

గిరీశమంటే రామప్పంతులు మాటల్లో గ్రిడు. గిరీశం మాట వింటే చాలు ఎంతటి వారి బుర్ర అయినా తిరుగుతుంది. ఎవరి బుర్రనయినా 'ప్రేమ కీర్తన' పాడించే శక్తి గిరీశానిది. హాస్యంలోనూ గురజాడ నిరంకుశుడు. వితంతువివాహాల నిర్వహణకు పెట్టింది పేరయిన

సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగాన్ని దృష్టిలో పెట్టుకుని కూడా గిరీశం పాత్రను ఆయన రూపకల్పన చేశారనిపిస్తున్నది. వీరేశలింగం పంతులుగారు కన్యాశుల్కం విషయమై ఉపన్యాసం పైకితియ్. మావగారికి లెక్చరివ్వడానికి కత్తీ, కఠారు నూరాలి అని గిరీశం అనడం ఇందుకు ప్రోద్బలం. వెంకటేశాన్ని పట్టుకొని ' మైడియర్ షేక్స్పియర్, ముఖం వేలాడేశావ్' అనిపించిన గురజాడవారికి వీరేశలింగాన్ని ఎగతాళి చేయడం ఎంతపని.' వీరేశలింగం సంఘసంస్కర్త అయితే గిరీశం ఆవేశలింగం.

## గిరీశం వందే జగద్గురుం

గిరీశం మనల్ని ఎంత నవ్విస్తున్నారో ఆయన్ను మనం అంత ఏడ్పిస్తున్నాం. గిరీశాన్ని చూసి కన్యాశుల్కం పాఠకులు ప్రేక్షకులు 'ఆహా! ఓహో' అంటూ పొట్టలు చెక్కలయ్యేలా నవ్వుతూ, లొట్టలు వేస్తుంటే కొంతమంది పెద్దమనుషులు మాత్రం గిరీశాన్ని చీల్చి చెండాడుతున్నారు. నిజానికి ఇటువంటి పెద్దమనుషుల్లో అత్యధికులు గిరీశాలేనని వారిని దగ్గరినుంచి చూసిన వారెవ్వరికయినా తెలుస్తుంది .

'కృష్ణం వందే జగద్గురుం' అంటారు. లోకం పోకడ తెలిసినవాళ్లకు 'గిరీశం వందే జగద్గురుం' అన్నమాట తెలుస్తుంది. వెన్నదొంగ కృష్ణుడు చేసిన మాయలే గిరీశమూ చేశాడు. అయినా గిరీశం మా'నవ' మాత్రుడుకదా. అపార్థానికి గురయ్యాడు. దేవుళ్లకిచ్చిన లైసెన్సు దేవులాడేవాళ్ళకు ఇవ్వరు కదా. 'కళ్లద్దాలు' మారిపోతాయి. 'అద్దాలూ మారిపోతాయి. కృష్ణుడు గోపికావస్త్రాపహరణం చేస్తే దేవుడు. దుశ్శాసనుడు ద్రౌపదీ వస్త్రాపహరణం చేస్తే దుర్మార్గుడు. అంతా 'వండర్' స్టాండింగ్‌లో ఉంది.

కృష్ణుడు గోపికా వల్లభుడైతే, గిరీశం ఓపికా వల్లభుడు. గెటప్‌లోనూ సెటప్‌లోనూ గిరీశం కృష్ణుణ్ని అనుకరించాడనిపిస్తుంది. శ్రీకృష్ణుడు భగవద్గీతచెబితే, గిరీశం 'రసవద్గీత' చెప్పాడు. మనషుల్లోని బలహీనతలను తనకు ఆపాదించుకొని వాటిని బలంగా వ్యక్తీకరించడం వల్ల గిరీశం నలుగురిలోనూ చులకనయ్యాడు. కాళిదాసు కావ్యాలే విషవ్యాఖ్యామూర్ఛిమైనప్పుడు గిరీశం ఎంత? గిరీశాన్ని సృష్టించిన గురజాడ ఎంత? గిరీశం శిష్యుల్లో వెంకటేశం మాత్రమే అమాయకుడు-మిగిలిన వాళ్లు గురువును మించిన శిష్యులు. గురువును 'ముంచిన శిష్యులు' ఇది గమనించే గిరీశం మనవాళ్ళు వుట్టి వెధవాయ లోయ్ అన్నాడు.

## కొటేషన్ చక్రవర్తి

విజయనగరం రాజుల 'అండదండలు' 'పుష్'కలంగా ఉన్న గురజాడ అప్పారావు గిరీశాన్ని 'కొటేషన్ చక్రవర్తి'గా దిద్దితీర్చాడు. గిరీశం ఏమి మాట్లాడితే అది కొటేషన్ . చదువు విషయమైనా, సంధ్యల విషయమైనా, ఆయన మాటలు స్వర్ణపేటికలు, సత్యవాటికలు. ఇందుకోసం ఆయన

ఎంత ఎడ్యు'కాషన్' నేర్చాడో అందరికీ తెలుసు. 'నాతో మాట్లాడ్డమే ఒక ఎడ్యుకేషన్' అన్న దమ్ముఉన్నవాడు 'ఇహ' లోకంలో గిరీశం ఒక్కడే. తెల్లారింది మొదలుకొని ఆయన 'ట్రూత్ పేస్ట్'నే వాడాడు. 'బాత్ చీత్' చేశాడు. పూర్రిచర్డ్ దిగివచ్చినా, పూటకూళ్లమ్మ మీదికి వచ్చినా గిరీశం మాట కాదనలేరు. అన్నట్టు పూర్రిచర్డ్ చెప్పినట్టు 'పేషెన్సు వుంటే గాని లోకంలో నెగ్గలేం' అని గిరీశం 'కోట్' వేసుకుంటారు. ఇంత తెలివితేటలు గిరీశానికి ఎలా వచ్చాయి అనుకుంటే 'పుస్తకం చాతపడితే వేళ్లకి పుస్తకం అంటుకుపోవాలి'. అంటాడు గిరీశం. మన కంట్రీయ్ఘె ఇండిపెండెంట్ అయితే గ్లాడ్సన్‌లాగా దివాన్‌గిరీ చెలాయిస్తాను అంటాడు. అంత కెపాసిటీ ఉండి. ప్రమాదాల్నుంచి తప్పించుకోవడమే ప్రజ్ఞ అని తెలిసిన వాళ్ళకి అసాధ్యమేముంటుంది? ఆయన దగ్గర ఉన్నన్ని పొలిటికల్ మహాస్త్రాలు వేరేవారిదగ్గర దొరకవు. ఎక్కడ పాఠం చెప్పాలో, ఎక్కడ గుణపాఠం చెప్పాలో తెలిసినవాడు 'గురూశం'. 'లెక్చర్లు ఎంతసేపూ సిటీల్లోనేగాని పల్లెటూళ్లలో యంత మాత్రం పనికిరావు' అని స్టేట్‌మెంట్ ఇచ్చేశాడు. పల్లెటూరి పీపుల్ లెక్చర్లకు అన్‌ఫిట్ అంటాడు. 'ఒపీనియన్స్ అప్పుడప్పుడూ ఛేంజి చేస్తుంటేనేగానీ పొలిటీషన్ కానేరడు' అని రాజకీయ పురుషసూక్తం వినిపిస్తాడు. 'కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు తిరగేశైనా కొలిస్తే నాలుగు గింజలు నిలుస్తాయి' అని బిజినెస్ ట్యాక్టిక్స్, చెబుతాడు. గిరీశం చెప్పే కొటేషన్‌లు రొటేషన్ చక్రవర్తులకు కూడా అంతుబట్టవు. 'అడగ్గానే యిస్తే వస్తువ విలువ తగ్గిపోతుందని హెచ్చరిస్తాడు. సంఘ సంస్కరణాభిలాషను హాస్యంగా వ్యక్తం చేయడంలో గిరీశం దిట్ట. 'బ్రహ్మచారి యొక్క రియల్ డ్యూటీ అంటే విధింపబడిన పని యేమనగా విధవలను పెండ్లాడమే' అని తీర్మానిస్తాడు. ఇందులో బ్రహ్మచారి కల్యాణం సంగతి'గురజాడ ఎరుగు', లోక కల్యాణం బ్రహ్మాండంగా ఉంది. 'పనికి ఆహార పథకం' గిరీశం. ఆనాడే ప్రవేశపెట్టాడు. 'పని వంటి వస్తువు లోకంలో లేదండీ' అంటాడు. గురజాడవారు కన్యాశుల్కంలో ఇలా 'నిర్వచనోత్తర గిరీశాయణం' నడిపించారు.

## లాజిక్‌లో మేజిక్

గిరీశం లాజిక్‌లో గొప్ప మేజిక్ ఉంది. 'సత్యం' కోసం మాయజేసే మొనగాడు. అసలే 'అటునుంచి నరుక్కురమ్మన్న' ఘనాపాఠీకదా!

'పెళ్లనే వస్తువు శుభవాఁ అశుభవాఁ' అని గిరీశం ప్రశ్నిస్తాడు. మంచిదే అని యువర్స్ ఓ 'బీడీ' యియ్యంట్లీ (కాకపోతే ఓ చుట్టయియ్యంట్లీ' అని 'సంకటేశం' అంటాడు. దాంతో గిరీశం లాజిక్ లంకించుకుంటాడు. చూడండి గిరీశంతడాఖా. 'వెరీగుడ్! పెళ్లనేది మంచి పదార్థమైతే, అధకస్యఅధిక ఫలం' అన్నాడు. గనక చిన్నపిల్లని ముసలాడికి. పెళ్ళిచేసి, వాడు చస్తే మరోడికి మరోడు చస్తే మరోడికి యిలాగ పెళ్ళి, పెళ్లి మీదపెళ్లి అయి, వీడి దగ్గరో వెయ్యి, వాడిదగ్గరో వెయ్యి, మరోడి దగ్గర మరో వెయ్యి. రొట్టెమీద నెయ్యి. నేతిమీద రొట్టెలాగ

యేకోత్రవృద్ధిగా  కన్యాశుల్కం లాగి, తుదకి నాలాంటి బుద్ధిమంతుణ్ని చూసి, పెళ్ళాడితే చెప్పావ్ మజా. ఇహసౌఖ్యం పూర్తిగా లభిస్తుంది. ఇహ సౌఖ్యం ఉంటే పరసౌఖ్యం కూడా సాధించావేఁ అన్నమాట' అంటాడు గిరీశం. ఈజ్‌మెంట్ హక్కు యస్టాబ్లిష్‌మెంట్ అవుతుందని 'చెవిలో పువ్వులు' కాదు అలవాటు లేనివారికి తలలో పువ్వులు పెడతాడు.

గిరీశం మ్యాజిక్ ముక్కల్లో దేనికదే కలికితురాయి. ఒకటి మాత్రమే చెబితే ఇంకోదానికి అన్యాయం చేసినట్టే. ఇంకోటి చూద్దాం. 'లుబ్ధావధాన్లు పెళ్లికి అన్నిటికన్న పెద్ద నవబొకటి నీకు చెప్తాను విను' అని వెంకటేశానికి గిరీశం క్లాసు తీసుకుంటాడు. 'లుబ్ధావధాన్లు ముసలాడు, బంగారప్పిచ్చికానున్ను, రెండేళ్లకో మూడేళ్లకో  బాల్చీ తన్నేస్తాడు. అనగా కిక్స్ ది బకెట్. దాంతో నీ చెల్లెలు రిచ్చివిడో అవుతుంది. నువ్వు పెద్దవాడివైన తరువాత దానికి విడో మారియేజి చేసి శాశ్వతమైన కీర్తి అతిసులుభంగా సంపాదించవచ్చును' అని వెంకటేశానికి 'హైడియా' ఇస్తాడు.

'మనిషిని ముస్తాబు చేసి యదట నిలబెడితే, యిది పునిస్త్రీ, యిది విడో' అని చెప్పగలిగిన పెద్ద మనిషి ఎవడు? ఒహడూలేడు. గనక విడో అనే వస్తువు ఎక్కడుందయా? వెక్కిరించే వెధవల నోళ్లలో వుంది. దీనికి క్రెడిట్ (లాభం) యేమనగా విడో పెళ్లాడిందంటే అశుభం వొగాయిత్యం అని అటెవ్వడూ కన్నెయ్యడు' అని లాజిక్ వినిపిస్తాడు.

గిరీశమంటే తన 'ఛత్ర' విచిత్రమైన లాజిక్‌తో దేవుడితోనైనా దెబ్బలాడేరకం. అందుకు ఎదురొచ్చే వాళ్ళదే నరకం.

లోకోపకారం గురించి చెబుతూ, 'యిలా చుట్టకాలిస్తే స్టీము యింజన్‌లాగా, భగ్ భగ్‌మని పొగ ఆకాశానికి పరిగెత్తి మేఘమై వర్షం కురిపిస్తుంది. పొడుంగాని పీలిస్తే ఆ ఘాటుకి ఆకాశం అర్చుకుపోతుంది. ముక్కంటమాత్రం చిరి వర్షంకురిసీ యిల్లూ ఒళ్ళూ డర్టీ అవుతుంది. గనక పొడుం చేసే మూర్ఖుల యింట్లో వుండే పొగాకంతా దొంగిలించి చుట్టలు గట్టి తగలెట్టవలసినదే. ఒకవేళ, గిరీశంగారూ, తమరు దొంగతనం చేశారు.కొద్దిరోజులు నరకానికి విజయం చెయ్యండి. అని దేవుడు గానీ అన్నట్టాయనా ఒకచిన్న లెక్చరు కొట్టి గభరాయింపజేస్తాను అంటాడు. ఆ లెక్చరు యేవిటో వెంకటేశానికి ఇలా చెబుతాడు.

'ఓ దేవుడా! నా మనస్సు యిండి పెండెంటుగా సృజించావా? లేక డిపెండెంటుగా సృజించావా? యిండిపెండెట్‌గా అయితే నా యిష్టం వచ్చినపనల్లా చేశాను. నువ్వెవరు నన్ను అడగటానికి? యిలాంటి చిక్కులు పెట్టావంటే హెవెన్‌లో చిన్న నేషనల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను. లేక నన్ను డిపెండెంటుగా చేశావు? అష్లాగయితే నువ్వే నాచేత పాపం చేయించావు. గనక నీకే ఆ శిక్షకావలసింది. దేర్‌ఫోర్ చలో, నరకానికి చలో, అంటూ హాస్యం మాటున కర్మ సిద్ధాంతంతో లాస్యం చేస్తాడు గిరీశం. యముణ్ని కూడా పాతయముడివా? కొత్త యముడివా?

అని జుట్టు పట్టుకోగల మేధావికన్నా ఒక ఆకు ఎక్కుచదివినవాడు.

'అన్యాయం పాపనాశనం' అన్నారు. ఒక్క అన్యాయంతో పాపాలన్నీ పోతాయి. అన్ని పళ్లూ నువ్వుమాత్రం తింటావేమిటి? తింటే స్టమకేక్. కడుపు నొప్పొస్తుంది. కడుపునొప్పొస్తేమీ అమ్మ నోరు పగలీసి సోలడు ఆజరం వసగుండ గొంతులో పోస్తుంది' అని వెంకటేశంతో అని అతడు అన్ని పళ్లూ తినకుండా కంట్రోల్ చేస్తాడు.

## గిరీశం సరసం:

గిరీశం డైలాగుల్లో సరసం తాండవం చేస్తుంది. ఎవడైనా తాను ప్రేమించిన ఆడదాన్ని బుట్టలో వేసుకోవడానికి గిరీశం మంత్రం జపిస్తే చాలు. క్షణాల్లో పనయిపోతుంది. ముందు 'భౌభౌ' అన్న అమ్మాయే' లవ్ లవ్' అని వెంటపడుతున్నది. బుచ్చమ్మను తనడైలాగులతో గిరీశం పిచ్చమ్మను, ప్రేమపిచ్చమ్మను చేసి ఆడించాడు. 'తక్షణం దేవతలు విమానం పంపించి నన్ను స్వర్గానికి తీసుకువెళతారు. స్వర్గానికి వెళ్ళానని నాకు అక్కడమాత్రం సుఖం వుంటుందనుకున్నావా? వొదినా! నానాభరణ భూషితురాలయి రంభ తక్కుతూ తారుతూ వొచ్చి 'హా ప్రియ గిరీశ! నీలాంటి సుందరుణ్ని యన్నడూ చూడలేదు. రమ్ము నన్నుచే కొమ్ము' అని రెక్కబట్టుకులాగుతుంది. నేనంటానూ? 'ఛీ అవతలికిపో, నేను ఏంటీనాచ్చి; సానిది తాకితే, పరమ అపవిత్రంగా తలుస్తాను. పియర్సు సబ్బురాసి, కడిగితే గాని యీ చేతికి కల్మషంపోదు. నువ్వారంభవి? మా బుచ్చమ్మ సొగసుకి నీవు వొడ్డీకి పనికిరావు. గోయవే, డామ్, డర్టీ గూస్ అని అంటాను. అలాగే మేనకా, ఊర్వశి, తిలోత్తమ మొదలైన యావన్మంది అప్సరస స్త్రీలను తన్ని తగలేస్తాను' అని బుచ్చమ్మతో అంటే ఆమె ఐసయిపోతుంది.

## గిరీశం సంఘసంస్కారం

గిరీశం సంస్కారం గురించి బోలెడు జోకులు వేసుకుంటాం. సంఘ సంస్కరణం కోసం అతడు పడ్డ తాపత్రయాన్ని మనం పట్టించుకోం. ఇది అన్యాయం. సంఘ సంస్కరణంకోసం హాస్యాన్ని ఉపయోగించినవాడు గిరీశం.

'సోషల్ రిఫారమ్ అంటే సంఘసంస్కారం' అంటాడు. లోకం తప్పుతోవలో వెళ్లుతుంటే ఆ తోవలోంచి మళ్లించి మంచి తోవలో పెట్టడమనేది సోషల్ రిఫారమ్ అని చెబుతాడు. 'ముసలాళ్లు చస్తే కష్టం సుఖం యెరుగని పసి పిల్లలు విధవలు అవుతారు. ఉప్పు, పులుసూ తినడం చాతయేమీ యరగని పసిపిల్లలు పూర్వయవ్వనం వచ్చినతర్వాత మనసు పట్టలేకపోతే వాళ్లదా తప్పు. 'వెధవా' వివాహం కూడదు, గిధవా వివాహం కూడదూ, అని ఓర్వలేని మాటలు చెబుతూ, డబ్బుకాశించి ముసలిపెళ్లిళ్లు చేసే మూర్ఖుల్ది తప్పు? ఊరుకుంటారేం' అని బుచ్చమ్మతో అంటాడు. ఏ సంఘసంస్కర్త అయినా ఇంతకన్నా గొప్పగా ఏం చెప్పగలడు. గిరీశం దగ్గరలేని

పరిష్కారం లేదు. సానివాళ్లగురించి, బుచ్చమ్మతో డిస్కస్ చేస్తూ. 'చంపక్కర్లేదు. 'పొమ్మనక్కర్లేదు. పొగబెడ్తితేచాలు నన్నట్టు సానివాళ్లను పెళ్లిళ్లకి పిలవకపోవడం, పెళ్ళిళ్లకు వెళ్లకపోవడం, వాళ్లను వుంచుకోకపోవడం, పైం చెప్పిన పనులు చేసేవాళ్లని కనపడ్డచోటల్లా తిట్టడం, యిలా నాలాంటి బుద్ధిమంతులంతా ఒహటై కొంత కాలం చేసేసరికి, కలికంలోకైనా మరి సాంది వుండదు. లేకుంటే చూడండి. మన వెంకటేశం పెళ్లికి తప్పకుండా సానిమేళం తెస్తారు. నే యెరుగుదును. కూడధన్న పనల్లా మావగారు చూస్తారు కూడిన పని మానేస్తారు. సానిమాళం తేవడమనేది డబ్బిచ్చి తద్దినం కొనుక్కోవడం కాదా? అంటాడు గిరీశం. సాని సమస్య పరిష్కారానికి ఏ దొరసాని అయినా ఇంతకన్నా మంచి మార్గం చెప్పగలదా?

## గిరీశం బీభత్సరసం

గిరీశానికి తిక్కరేగితే బీభత్సగుణసమవాకారం అవుతాడు. 'యీ ఘోరమైన అబద్ధాలు నీతో ఎవడు చెబుతున్నాడో కనుక్కోలేననుకున్నావా యేమిటి? సప్తసముద్రాల్దాటినా వాడి పీకట్టుకొని పిస్తోల్తో వళ్లు తూట్లు పడేటట్టు ఢాఢామని కొట్టకపోతినట్టయినా నాపేరు గిరీశమే. నినదభీషణ శంఖము దేవదత్తమే' అంటాడు. ఇంకో చోట, 'నేనే దాని హజ్బెండైవుంటే నిలబడ్డపాటున నీ తండ్రిని రివాల్వర్తో షూట్చేసి ఉందును' అంటాడు వెకంటేశంతో.

## గిరీశం -శాస్త్ర పాండిత్యం:

గిరీశానికి తెలియని శాస్త్రం లేదు. ప్రతి శాస్త్రాన్ని హాస్యాస్త్రంతో మేళవించి సంధించగలిగిన ప్రజ్ఞావంతుడు. అందుకోసం సకలశాస్త్రాల్లోనూ 'ఫ్రీసెర్చి' చేశాడు. 'చుట్టపంపిణీ మీదనే స్టీము యంత్రం వగయిరా' తెల్లవాడు కనిపెట్టాడు. లేకపోతే వాడికి పట్టుబణ్నా' అని సిద్ధాంతం చేశాడు.

**'ఖగపతియమృతము తేగా**
**భుగభుగమని పొంగి చుక్కభూమిని వ్రాలెన్**
**పొగచెట్టై జన్మించెను.**
**పొగతాగని వాడుదున్నపోతై బుట్టున్ !**

యిది బృహన్నారదీయం నాలుగవ ఆశ్వాసంలో వున్నది అంటాడు. 'టొబాకో పనిషత్తు'కు మూల పురుషుడనిపించుకుంటాడు. క్రియేషన్ మొత్తాన్ని రిక్రియేషన్కు ఉపయోగించుకోవడం ఈ సృష్టిలో గిరీశం ఒక్కడికే చాతనవును. ఉదాహరణకు 'ప్రపంచం యేలాగున్నది? కపిద్ధాకార భూగోళాఅని మనుధర్మశాస్త్రంలో చెప్పినాడు అంటాడు. కపిద్ధ గురించి అమరనిఘంటువులో

**'యింతలు బదరీఫలములు**
**యింతలు మారేడు పళ్లు యీడుకుజోడై**
**బంతులు తామరమొగ్గలు**
**దంతీకుచకుంభములబోలు తరుణీకుచములూ'**

చెప్పాడని వెంకటేశానికి క్లాసు తీసుకుంటాడు. ఈ ప్రపంచంలో 'యేవి వస్తువులుంటవి' అని వెంకటేశాన్ని ప్రశ్నిస్తే అతడొకసారి ఆవులని, ఇంకోసారి గేదెలు అని చెబుతాడు. గిరీశం తరచి తరచి అడగ్గా 'నాకు తెలియదు' అని వెంకటేశం అంటాడు. 'విడోస్' అని గిరీశం చెబుతాడు. ప్రపంచంలోని వస్తువులన్నిటిలోకీ ముఖ్యమైనవి విధవలు అంటాడు.

గిరీశం తన శాస్త్ర పరిజ్ఞానాన్ని ఖండఖండాలు చేసి అఖండమైన ప్రజ్ఞప్రదర్శించాడు.

'లోకమంటే యేమిటి గంజిగుంట అనుకున్నారా? యేషియా, యూరోప్, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా అని ఐదు ఖండాలు. అందులో అమెరికాలో మనుష్యులు బుఱ్ఱకిందికీ కాళ్ళు పైకి పెట్టినడుస్తారు. యిక్కడ పగలు కదా యిప్పుడు. అక్కడ రాత్రి. నార్త్‌పోల్ అని మరో దేశం వుంది. అక్కడ ఆర్నెల్లు పొగలే. అప్పుడు మరి రాత్రుండదు అంటారు.

గిరీశం ప్రతిదానిమీద ముద్రవేస్తారు. ముద్రవేయడంలో ఆయనముందు పోస్టల్‌డిపార్ట్‌మెంట్‌వారు కూడా పనికిరారు. సముద్రాల మీద కూడా ఆయన తన ముద్రవేశాడు.

"పాలసముద్రం వుంటూ వుండగా మళ్లీ పెరుగు సముద్రం, నేతిసముద్రం యెందుకోయి? యిది ప్లియోనిజం, పునరుక్తి- మరో తెలివితక్కువచూశావా? యెందుకూ పనికిమాలిన ఉప్పు సముద్రం మన నెత్తినకొట్టి పెరుగు, పాలు, నెయ్యి, చెరకుపానకం, యీ సముద్రాలన్నీ యెవడికీ అందుకు రాకుండా దూరంగా విసిరేశాడోయి. ఒక సంవత్సరంగాని నాకు దేవుడు దివాన్గిరీయిస్తే భీముని పట్నానికి పాలసముద్రం, విశాఖపట్నానికి మంచినీళ్ల సముద్రం, కళింగపట్నానికి చెరకుసముద్రం తెస్తాను. యీ యీస్టర్నుఘాట్స్ అంతాపొగాకు అరణ్యం చేస్తాను' అని వెంకటేశంతో అంటాడు.

గిరీశం సడన్‌గా 'తత్త్వంలో'కి ఎంటరయి, 'భజగోవిందం భజగోవిందం గోవిందం భజ మూఢమతే 'అనగల దిట్ట. ఇంతటి పాండిత్యం ఉండబట్టే నిన్ను సురేంద్రబానర్జీ అంత గొప్పవాణ్ని చేస్తాను. అని తన శిష్యుడు వెంకటేశాన్ని ఊరిస్తాడు.

## గిరీశం పొయిట్రీ

'కపివతంసుడి'లాగా కనబడే గిరీశం కవివతంసుడై హాస్యాన్ని అద్భుతంగా 'చిలక'రిస్తాడు.

కన్యాశుల్కంలో గిరీశం పుట్టీ పుట్టగానే కవిగా పరిమళిస్తాడు.

"Can love be controll'ed by advice
will cupied our mothers obey' అని ప్రశ్నిస్తాడు
'It is women that seduce all man kind' అని తీర్పు చెబుతాడు.

" నీసైటు నాడిలైటు
నిన్ను మిన్న
కానకున్న
క్వైటు రెచడ్ ఫ్లెటు
మూనులేని నైటు" అంటాడు.
"పుల్లమూను లైటటా
జాసమిన్ను వైటటా
మూనుకన్న
మొల్లకన్న
నీదు మోము బ్రైటటా
టా! టా! టా! " అంటాడు.

కవయః నిరంకుశః అంటారు. దీని ప్రకారం కవి డిక్టేటర్. కవిత్వాన్ని డిక్టేట్ చేసి గిరీశం కూడా డిక్టేటర్ అనిపించుకుంటాడు.

She leaves her bed at A.M. four
And sweeps the dust from off the floor
And, heaps it all behind the door అని ఆయన చుట్టకాలుస్తూ డిక్టేట్ చేస్తుంటే వెంకటేశం రాసుకుంటాడు.

## గిరీశం కోతలరాయుడా!

కన్యాశుల్కం చదివి గిరీశాన్ని కేవలం కోతలరాయుడిగా జమకట్టడం అన్యాయం. లోకంలో ప్రతివాడూ ఎంతో కొంత కోతల రాయుడే. కనీసం పెళ్లాం దగ్గరయినా కోతలు కోస్తాడు. ఆమెకు సారకాయలు తరగవలసిన అవసరం తప్పిస్తాడు. గిరీశం తెలివితేటలు సామాన్యమైనవి కావు. ఒకచోట గజీతగాణ్ని ఔటచేత నూతుల్లో గోతుల్లో పడ్డవాళ్లని పైకి లేవతీస్తాను అని, ఇంకో చోట పూనాడక్కన్ కాలేజీలో నేను చదువుతున్నప్పుడు దిఇలెవన్ కాజెస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియాను గూర్చి మూడు ఘంటలు లెక్చర్ యిచ్చేసరికి ప్రొపెసర్లు డంగయిపోయినారు' అనీ అంటాడు. ఇవే మన కళ్లకి కనపడతాయి. మన చెవులకు వినపడతాయి.

గిరీశానికి ఎవరికీ లేని పెద్ద విద్య ఉంది. 'స్వీయ లోపంబు లెరుగుట పెద్ద విద్య' అన్నారు

కదా! ఆ విద్య గిరీశానికి ఉంది. అతడు స్వస్వరూపజ్ఞానం కలవాడు. పూటకూళ్లకు సంతలో సామాను కొని పెడతానని నెలరోజుల కిందట యిరవైరూపాయలు పట్టుకెళ్లి డాన్సింగర్లు కింద ఖర్చు పెట్టాడని బాధపడతాడు. వెంకుపంతులుగారి కోడలికి లవ్ లెటర్ రాసినందుకు యెప్పుడో ఒకప్పుడు సమయం కనిపెట్టి దేహశుద్ధి చేస్తారు' అని భయపడతాడు. 'నేను యేమో ఉద్యోగాలూ ఊళ్ళూయేలి తనతో వైభవం వెలిగిస్తాననే నమ్మకంతో వుంది. అంటూ మధురవాణిని గురించి ఫీలవుతాడు. రేపు ఉదయం యెనిమిదిగంటలకి పూటకూళ్లమ్మయింటికి వస్తే అణాపయిసల్తో సొమ్మిచ్చేస్తాను అని తానుబాకీ ఉన్నవాడికి చెప్పిపంపిస్తాడు. గిరీశం కష్టాలను మనం అర్థం చేసుకోకపోతే మన కష్టాలనుంచి మనల్ని ఎవడూ గట్టెక్కించడు. ధర్మరాజుకు లోకంలో అందరూ మంచివాళ్ళే కనిపించినట్టు మంచివాళ్ళందరికీ గిరీశంలో మంచివాడే కనిపిస్తాడు. 'వెంకమ్మ మొగుడితో దెబ్బలాడినూతిలో పడ్డప్పుడు నేను సాహసించి వురికి పైకి తీసిందగ్గర్నుంచీ వూరంతా నేను సాక్షాత్తు సత్యహరిశ్చంద్రుణ్నిగా భావిస్తున్నారు. అడుగడుక్కోబుద్ధిదాట్లేస్తుంటుంది.గానీ, నేనంతవాణ్నీకానా యేవిటీ? అంటాడు. పైగా స్నేహం పట్ల పీకిచ్చేస్తారే గిరీశం గారు. అనుకుంటాడు కూడా. తాను బక ధ్యానం చేస్తానని ఇంకో చోట అంటాడు. బక ధ్యానం అంటే కొంగజపం. గిరీశం తాను ఎంత మంచి వాడయినా తెలుగు వాళ్లు తననేదో ఉద్ధరిస్తారని ఆశపెట్టుకోలేదు. అందుకే 'మనవాళ్ళు పుట్టి వెధవాయలోయ్. చుట్టనేర్పినందుకు థాంక్ చెయ్య, తప్పుపట్టుతున్నావ్?'' అని వెంకటేశంతో గిరీశం అన్నమాటలవెనక ఎంతో అంతరార్థం ఉంది. మనుషుల్లోని చెడును తనకు ఆపాదించుకుని, తననుతాను కించపరుచుకుని పాపాల భైరవుడయ్యాడు పాపం గిరీశం.

## ఆధ్యాత్మిక గురువు గిరీశం:

మతాలతో సతమతమవుతున్న ఈ ప్రపంచానికి గిరీశం కొత్తమతాన్ని అందించాడు. హుషారెక్కించాడు. అన్ని మతాలూ పరిశీలించి, వాటి తాలూకు యసెన్స్‌నిగ్గుతీసి ఓ కొత్తమతం యేర్పరచాను. అదే అమెరికావెళ్లి ప్రజ్వలింపచేస్తాను. యిప్పుడు మట్టుకు నీ సంశయం తీరుస్తాను. యేమన్నావ్? అన్నాన్నా ధ్యానించడం అని కదూ? యేవందోయ్ ఉపనిషత్తు? 'అన్నం' బ్రహ్మేతి వ్యజనాత్'' అన్నవేఁ బ్రహ్మఅని తెలుసుకోవోయి వెధవాయా అంది. తెల్లవాడు యేవని ధ్యానం చేస్తాడోయి రోజూనూ, ఫాదర్ గివ్ అజ్ అవర్ డెయిలీబ్రెడ్ అనగా నన్ను కన్న తండ్రీ రోజూ ఒకరొట్టెముక్కయియ్యవోయి అని-ఇక మనవేఁవనాలి. తండ్రీరోజూ, కందిపప్పు, దప్పళం ఇయ్యవయ్యా' అని ధ్యానించాలి. మన చమకంలో యేమన్నాడూ? ''శ్యామాకాశ్చమే' చామల అన్నం మా మజాగా వుంటుంది నాక్కావాలి ఓ దేవుడా! అన్నాడు. ఆ చమకంలో యవడికి యిష్టవైన వస్తువులు వాడు కలపవచ్చును.'' కంది గుండా చమే, యింగువనూ నాచమే. దీనినే రిలిజియస్ రిఫార్మ్ అంటారు. అని చెబుతాడు. అంతేకాకుండా వెంకటేశం

చేత గేదెపెరుగూచమే, చేగోడీచమే అనిపించేట్టు ఇన్‌స్పైర్ చేస్తాడు.

## గిరీశం బిజీబిజినెస్‌మన్

గిరీశంలో గొప్ప బిజినెస్‌మన్ ఉన్నాడు. 'నావంటిబుద్ధిమంతుడు తొందరపడి యేపనీ చెయ్యకూడదు. దాని లాభనష్టాలు బేరీజువేసి జమాఖర్చు వేసుకుని మరీ డిసైడ్ చెయ్యాలి. లెటస్‌సీ (IMRIMIS) ఒకటోపద్దు డెబిట్ (నష్టం) విడోమారియేజిచేసుకుంటే మావాళ్ళు అక్కరచెయ్యరు. అందుకు క్రెడిట్ (లాభం) వాళ్ళిప్పుడు చేస్తూన్న అక్కరేవుంది? గనక బాలెన్స్ (గాకబాకీ) నిల్ బండి సున్నా! రెండో పద్దు డెబిట్ (ఖర్చు) లోకం నన్ను బహిష్కారం చేస్తారు. అందుకు క్రెడిట్, (జమ) లోకంకెల్లా విలువైన వస్తువను నేను అంకించుకుని పనలేని ఆలోకానికే నేను బహిష్కారం వేస్తాను. గనుక క్రెడిటుబ్యాలెన్సు (నిల్వ) యేవిటయా!-నెగిటివ్ యడ్వాంటేజీ-పాజెసింగ్ ఆలిట్స్‌వెల్త్? మూడో పద్దు డెబిట్ నష్టం. ''వీడిపెళ్ళాం వెధవముండ' అంటాడు. నూటాబీనీ-యీపద్దు నిజంగా డెబిటేనా? ఆడిట్ డిపార్ట్‌మెంట్‌వార్నడిగి సంశయం తీర్చుకోవాలి' ' అంటారు. పైన చెప్పిన మాటల్లో గిరీశం ఎంత చాతుర్యంతో బిజినెస్ టెక్నాలజీవాడాడు! ఎంత గొప్పగా నవ్వించాడు!

బిజినెస్ బిజినెస్‌కోసమేకాదు లోకకల్యాణంకోసం అని నమ్మినవాడు గిరీశం. ''మునసబుగారి పిల్లల్కి శెలవుల్లో పాఠాల్చెపితే ఫిఫ్టీరుపీస్ ఫీజ్ యిస్తామన్నారు అయినా నీవిషయమై యంతలాస్ వచ్చినా నేను కేర్ చెయ్యను'' అంటాడు గిరీశం. గురజాడగారు చెప్పిన 'సొంత లాభం కొంత మానుకు పొరుగు వారికి తోడుపడవోయ్' అన్న సూక్తిని గిరీశం అక్షరాలా అమలుపరిచాడు.

## నటవిటగిరీశం:

గిరీశంనటుల్లో నటుడు. విటుల్లో విటుడు. ఇబ్బందులనుంచి తప్పించుకోవడానికి ఆయన కన్యాశుల్కంలో చెవిటివాడుగా నటించాడు. నటించాడనడం కన్న జీవించాడనడం బెస్టు. బాకీవసూలు కోసం వచ్చిన పాటిగారప్పంతులుగారి బంట్రోతు 'ఎంతమందిని పంపినాయిచ్చారు కారటనే వాళ్లలాగూరుకుండే వాణ్ణి కానండి'' అని గిరీశంతో అనగానే చెప్పింది వినపడనట్టు నటించి ''అయ్యా కోనేటికి తోవయిదే!'' అంటాడు. ఆ తర్వాత బంట్రోతు 'యక్కడి శెవిటిమాలోకం వచ్చిందయ్యా' అంటాడు. దానికి గిరీశం 'కోవటిదుకాణవా? కస్పాబజార్లోగానీ యిటివేపులేదు' అంటాడు. బంట్రోతు గిరీశం చెవిదగ్గరనోరుపెట్టి గట్టిగా 'పాటిగరావులు, కరీదిస్తారా యివ్వరా?' అంటాడు. దానికి 'చెవిటి' గిరీశం 'బస, రాదారీ బంగాళాలో చెయ్యొచ్చును' అంటాడు.

గిరీశం మధురవాణియింట్లో ఉన్నప్పుడు తలుపు శబ్దం విని గడగడవణుకుతాడు. పూటకూళ్లమ్మ వచ్చిందని భయపడతాడు. మంచంకింద దూరుతాడు.

పాండురంగమహాత్యంలోని నిగమశర్మను గుర్తుకు తెస్తాడు.

గిరీశం విట్టుడు. మధురవాణిని 'మైడియర్ ఎంప్రెస్' అంటూ శాయశక్తులా ఇంప్రెస్ చేయడానికి ప్రయత్నిస్తాడు. నిగమశర్మను వర్ణిస్తూ తెనాలి రామకృష్ణ కవి:

**"ఉపాని హోమాగ్ని ఊదనొల్లడు గాని**
**విరహ జ్వరార్తిచే వెచ్చనూర్చు**
**సంధ్యకు ప్రార్ధనాంజలి ఘటించడు గాని**
**విటతాటముల తీర్చువేగి లేచి"** అంటాడు.

అటువంటి లక్షణాలు గిరీశంలోనూ కనిపిస్తాయి.

మధురవాణి ఇంట్లో మంచం కింద దూరిన రామప్పంతులుతో 'తమరా యీ మాత్రానికి మంచం కింద దాగోవాలా? మహానుభావానన్నడిగితే యిలాంటి లంజల్ని యిరవై మందిని మీకు కన్యా దానం చేతునే' అంటాడు.

## సు'మధుర' హాస్యం

కన్యాశుల్కంలో మధురవాణి చిలికించిన హాస్యం సు'మధుర'మయింది. సాని అయితే నేమి సన్మార్గదర్శకమైన హాస్యం అందించింది మధురవాణి. సునిశితమైన హాస్యం ఆమెది. పూటకూళ్లమ్మ గురించి వచ్చిన ప్రస్తావనలో 'ఆమెకి మొగుళ్ళేకయినా ఆమెను వెదవనడానికి వీల్లేదు' అని గిరీశం అనగానే 'మీరుండగా వెధవెలా అవుతుంది?'అని తిప్పికొడుతుంది. 'ఆ వయ్యారం చూస్తే మీ పతివ్రత లాగుంది' అని కూడా అంటుంది. రామప్పంతులు గడ్డం నెరిసిపోవడం మీద మధురవాణి వేసిన చురక పదికాలాలు పాటు ముసలివాళ్ళు గుర్తుపెట్టుకుని నవ్వుకోవలసింది.

'చట్లకి చావ నలుపు మనిషికి చావ తెలుపు. అనగా చీకట్లో నక్షత్రాల్లాగ అక్కడ కూడ తెల్ల వెంట్రుకలు తగిల్తేనే చమక్' అంటుంది మధురవాణి. నిజమే నలుపు యవ్వనానికి గుర్తు అయితే, తెలుపు 'పండి'పోయిన అనుభవానికి గుర్తు. రామప్పంతులును జడతో కొడతానని బెదిరించిన సరసురాలయిన మధురవాణి తన మాటల్లో అడుగడుగున హాస్యాన్ని, వ్యంగ్యాన్ని మిళితం చేసింది. వడదెబ్బకంటె జడదెబ్బప్రమాదకరం అని రుజువు చేసిన రసికురాలు మధురవాణి.

మదురవాణి వాక్చాతుర్యంలో ఎంత జోక్చాతుర్యం ఉందో చెప్పడానికి ఇంకో మెచ్చుతునక ఉంది. 'మీనాక్షి ప్రవర్తన మంచిదికాదు' అని రామప్పపంతులు అనగానే 'మీరు కంటపడ్డతర్వాత ఏ ఆడదాని ప్రవర్తన తిన్నగా ఉంటుంది?' అని మధురవాణి అంటుంది. ఇంకోచోట 'నాదగ్గరికి వచ్చినందుకు మీ భార్యగారు ముందు మిమ్మల్ని మెడబట్టుకుని యింట్లోంచి తరవ్వలిసింది.

తనికిరొట్టా, ఒహడికి ముక్కానా?' అంటుంది. 'ఆడది మెచ్చిందే అందం మగాడికన్నుమసక' అని కూడా ఇంకో సందర్భంలో అంటుంది. హాస్యంతోటే వాస్తవాన్ని పసికట్టగలశక్తి మధురవాణికి ఉంది. 'యీ కన్నెపిల్ల నోరు కొంచెం చుట్టవాసనకొడుతూంది!' అంటుంది.

## రామప్పంతులు లౌక్యం

కన్యాశుల్కంలో రామప్పంతులు హాస్యంలో అడుగడుగునా అతని లౌక్యం కనిపిస్తుంది. అద్భుతమైన నాటకీయత రామప్పంతులు డైలాగుల్లో కనిపిస్తుంది. 'లౌక్యవంటే ఏవిటనుకొన్నావు? అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చెయ్యడమే కాదూ? మన సిద్ధాంతిని దువ్వేటప్పటికి వాడేం చేశాడనుకొన్నావు? లుబ్ధావధాన్లు జాతకం యగాదిగా చూసి, శీఘ్రంలో వివాహ యోగం వుందన్నాడు. ఆ వివాహం వల్ల ధన యోగం వుందన్నాడు. దాంతో ముసలాడికి డబ్బొస్తుందన్న ఆశ ముందుకీ, డబ్బు ఖర్చవుతుందన్న భయం వెనక్కీ లాగడం ఆరంభించింది. యింతలో పండాగారక్కడికి వచ్చారు. ఆయన్ని కూడా తయారు చేశాను. లుబ్ధావధాన్లు అనుమానం తీర్చుకుందామని ఆయనకి జాతకం చూపించేసరికి పండాగారు యేమన్నారూ "వివాహ ధనయోగాలు జమిలిగా వున్నాయి. అయితే మీరు పెద్దవాళ్ళు. ఇప్పుడు పిల్లనెవరిస్తారు పెళ్లెలా అవుతుంది? యిలాంటివి జరగడానికి వీల్లేని మహాయోగాలు జాతకాల్లో పట్టినప్పుడు గొప్ప మేలుకు బదులుగా గొప్ప కీడు సంభవిస్తుంది' అని వర్ణిస్తాడు రామప్పంతులు మధురవాణితో. 'నమ్మించోట చేస్తే లౌక్యం', 'నమ్మంచోట చేస్తే మోసం' అని అన్ని చోట్ల డెఫినెట్‌గా ఉపయోగపడే డెఫినిషన్‌ను అందిస్తాడు. రామప్పంతులు లౌక్యం మరికాస్త చిత్రమైంది. మధురవాణి ఇంటిలో గిరీశం చేతిలో దెబ్బలుతిని ప్రతీకారంతో రామప్పంతులు రగిలిపోతుంటాడు. దానిని చూసి మధురవాణి 'దొంగ దెబ్బకొడతాడూ వాడి పొంకం అణుతురుగాని లెండి' అని అనగానే 'గవర్నమెంటు జీతమిచ్చుంచిన కనీస్టేబులుండగా మనకెందుకు శరీరా యాసం? యీ వెధవని పజ్యండు కోర్టంటా తిప్పకపోతే నేను రామప్పంతులు కాను. చూడు తమాషా' అంటాడు రామప్పంతులు.

పూటకూళ్లమ్మ 'చీపురుకట్ట సరసానికి' గిరీశానికి బదులు తాను బలయిన రామప్పంతులు 'నీ రంకు మొగుణ్ణి కొట్టక నన్నెందుక్కొట్టావే ముండా? అందుకా నన్ను ముందుకి తోసి తానుగోడ వేపు దాగున్నాడు' అని తిట్టిపోస్తాడు.

కన్యాశుల్కం తిరగేస్తే రామప్పంతులు, గిరీశం వంటి వాళ్లను చూస్తే ఉంచుకున్నంత వాళ్లకి, ఉంచుకున్నంత హాస్యం, పంచుకున్న వాళ్లకి పంచుకున్నంత హాస్యం అనిపిస్తుంది.

'సొగసు కత్తెలకి అలక కూడా అదో శృంగారం సుమండీ' అని రామప్పంతులు లౌక్యంతోనే సర్దుకుపోతాడు. 'చిన్నతనంలో ధ్వజస్తంభం దండతో కొడితే గణగణమని గంటలన్నీ

ఒక గడియవాగేవి' అని కోతలు కోసిన రామప్పంతులు మధురవాణి తన మీద తాళాల గుత్తి విసిరినా సర్దుకుపోతాడు. మధురవాణి హాస్యానికి చాలాసార్లు బలి అవుతాడు'. మధురవాణికి రామప్పంతులుకు మధ్య రామప్పంతులు యింటి సావిడిలో జరిగిన ఈ సంభాషణ ఇందుకు నిదర్శనం.

మధురవాణి : మాటలు నేర్చిన శునకాన్ని వేటకి పంపితే ఉసుకోమంటే ఉసుకోమందట.

రామప్పంతులు : నేనా శునకాన్ని?

మధురవాణి: హాస్యానికన్న మాటల్లా నిజమనుకుంటారేమి?

రామప్పంతులు : హాస్యానికా అన్నావు

మధురవాణి: మరి మీతో హాస్య వాడకపోతే, వూరందరితోటి హాస్య వాడమన్నారా యేవిటి?

రామప్పంతులు: అందరితో హాస్యవాడి యరగవా?

మధురవాణి: అంచేతనే కుక్కన్నా, పందన్నా, మిమ్మల్నే అనాలిగాని, మరొకర్ని అనకూడదే! ఏం చేస్తాం. ఇటువంటి హాస్యం వల్ల రామచంద్రపురం అగ్రహారం కరణమైన రామప్పంతులు 'ఎంత వారలయినా వేశ్యాదాసులే' అనిపిస్తాడు.

రామప్పంతులు జాతకాలు మార్చగల దిట్ట. 'కాకితవైతే అగ్గిపుల్లతో పైసల్! తాటాకైతే నీళ్లు పొయ్యి, కొత్త జాతకం బనాయించడం అయిదు నిముషాలు పని' అని కరటక శాస్త్రులతో టకటక అంటాడు రామప్పంతులు. 'జాతకపాండిత్యం' కూడా మధురవాణి విసుర్లకు కారణమైంది.

ఒక పిల్ల చెయ్యి చూసి రామప్పంతులు 'ఆహా యేం ధనరేఖా' సంతాన యోగత్య బాగా వుంది' అంటాడు. దానికి మధురవాణి

'మీరు చేపట్టింతరువాత అందుకు లోపం వుంటుందా?' అని యద్దేవా చేస్తుంది.

'దొంగపని చేసినప్పుడు రెండోవాడికి చెప్పకూడదు అంటాడు గిరీశం. అయితే హాస్యంలో దొంగతనం, దొరతనం రెండూ కలిసిపోతాయి. పెదవుల మీద నవ్వులు మెరిపిస్తాయి. కన్యాశుల్కం పాఠకులను, ప్రేక్షకులను కడుపార నవ్వించిన పాత్రలో రామప్పంతులు పాత్ర ఒకటి.

## పూటకూళ్లమ్మ హాస్యపు విందు

పూటకూళ్లమ్మ చేతి విందు మనం రుచి చూడలేకపోయినా ఆమె చేసిన హాస్యపు

విందు మాత్రం మహా పసందుగా ఉంటుంది. కన్యాశుల్కంలో పూటకూళ్లమ్మ 'పాత్ర' చిన్నదైనా పాత్ర కొంచెం, 'కూత, మోత, ఘనం' అనిపిస్తుంది. రామప్పంతులు మధురవాణి యింటిలో 'పూటకూళ్లమ్మ వాణ్ని వుంచుకుని యింత గంజిపోస్తుంది' అని గిరీశాన్ని ఎగతాళి చేశాడంటే పూట కూళ్లమ్మ 'వడ్డించడం'లో ఎంత 'కడు'గ్గాయో తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. కన్యాశుల్కంలో మిగతా పాత్రలతో పోలిస్తే పూటకూళ్లమ్మ హాస్యం ఎక్కువగా 'యాక్షన్ ఓరియంటెడ్, రియాక్షన్ ఓరియంటెడ్. పూటకూళ్లమ్మ సాగించిన గిరీశం వేట పోలీసులకు కూడా ఇన్‌స్పిరేషన్ కలిగిస్తుంది. గిరీశం కోసం ఆమె మధురవాణి ఇంట్లోకి చీపురుకట్టతో ప్రవేశిస్తుంది. ఆమె చీపురుకట్ట దెబ్బలు తిని రామప్పంతులు లబోదిబోమంటాడు. మంచంకింద పూటకూళ్లమ్మ చేసిన 'చీపురుఛార్జి' ఎంత దమ్ము దులిపిందో సాక్ష్యాధారాలతో సహా తెలుస్తుంది. పూటకూళ్లమ్మ 'డేర్ అండ్ డెవిలింగ్ లేడీ.' రామప్పంతులును నీ మొగతనం 'యేడిసినట్టే వుంది' అంటుంది. పూటకూళ్లమ్మ ముందు గిరీశం గడగడ వణికిపోతాడు. అయితే చాటుగానయినా ఆమెను బ్రహ్మాండంగా సపోర్టు చేస్తాడు. పూటకూళ్లమ్మంటే మజాకానా! మరి!!

## అగ్నిహోత్రావధానులు అండ్ కో

కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు అండ్ కో సృష్టించిన హాస్యం అందరినీ పరవశింప జేస్తుంది. అగ్నిహోత్రావధానులు, ఆయన కుమారుడు, వెంకటేశం, బావమరిది కరటకశాస్త్రి నవ్వులపంట పండిస్తారు. కాసుల కోసం కేసుల కోసం అగ్నిహోత్రావధానులు పడే కక్కుర్తి చూస్తుంటే దరహాసం వెల్లివిరుస్తుంది. 'ఐతే నన్ను ఆక్షేపణ చేస్తావుటే? ఈ మారంటే నీ అన్న వున్నాడని వూరుకునేది లేదు' అని అగ్నిహోత్రావధానులు తన భార్య వెంకమ్మను హెచ్చరిస్తుంటే ఎవ్వరు నవ్వకుండా 'ఊరుకుంఛారు'? చెప్పండి. ఎవరికైనా అర్థమయితే తిక్కరేగుతుంది. అగ్ని హోత్రావధాన్లకు మటుకు అర్థంకాకపోతే తిక్కరేగుతుంది 'టర్క్ డామిట్' 'టెల్‌మాన్' అని గిరీశం అనగానే 'మానా? మానులా వుంఛానంఛావు. గూబ్బగలగొడతాను' అని బెదిరించి వైదీకమాండలికంతో వీనులవిందు చేస్తాడు అగ్నిహోత్రావధానులు. కన్యాశుల్కానికి సపోర్టుగా అగ్నిహోత్రావధాన్లు అన్న మాటలు చిత్రంగా ఉంటాయి. 'ప్రతిగాడిదకొడుకు అమ్మావమ్మా వంఛుంఛాడు. కూరగాయలషోయ్ అమ్మడానికి? ఆ రూపాయలే పుచ్చుకోకపోతే మొగుడు చచ్చాడు గదా! దాని గతే యాపైయ్యుండును' అంటాడు. అగ్నిహోత్రావధానులు అనగానే మనకు వెంటనే గుర్తొచ్చే డైలాగు' తాంబోలం యిచ్చేశాను.... యిహ తన్నుకు చావండి' అనే ఆయన మాట తెలుగువాడి నానుడి అయిపోయింది. అగ్నిహోత్రావధానులు కన్యాశుల్కంలో కామెడీ విలన్. 'వీళ్లమ్మా శిఖతరగ ప్రతీ గాడిద కొడుకు తిండి పోతుల్లాగా నా యింటజేరి నన్నునేవాళ్లే' అని ఈసడించినా మనకు నవ్వేవస్తుంది. అగ్నిహోత్రావధానుల మనస్సును 'కేసుపాశాలు' బంధిస్తాయి. వాటిలో ఆయన 'ఎంతయినా' హాస్యం పండించగలరు'. మీ

వంటివారు నాకు చెయ్యాసరా వుంటే రామావధాన్లు పిలకూడదీసేద్దును' అంటాడు. యీ రెయిళ్లు గియిళ్లు యావత్తూ మన వేదంలో వున్నాయిష' అంటాడు. ఇంకో సందర్భంలో. గిరీశం అన్నట్టు అగ్నిహోత్రావధానులకే ఇంగ్లీషు వస్తే భాష్యం అయ్యంగార్లయిపోతారు.

## వెంకటేశం వినయావేశం

గిరీశం లాంటి గురువు దొరకనట్టే వెంకటేశం లాంటి శిష్యుడూ దొరకడు. అపురూపశిష్యుడైన వెంకటేశం తన గురువు అయిన గిరీశంతో 'యిక మీర్నాతోనా మాట్లాడకండి' అనడంతో మొదలు పెడతాడు. 'మీ వల్ల నాకు ఒచ్చిందల్లా చుట్టకాల్చడమే' అంటాడు. ప్రతి పురుషుడి విజయం వెనుక ఒక మహిళ ఉంటుందో లేదో గానీ ప్రతి గురువు విజయం వెనుక ఒక శిష్యుడు మాత్రం ఉంటాడు. గిరీశం విజయం వెనక ఉన్నది వెంకటేశం అని తాటతెల్లమవుతుంది. అందుకే 'యిదే బంగాళ కుఱ్ఱవాడవుతే యేంజేస్తాడో తెలిసిందా? తాతయేది తండ్రయేది కఱ్ఱపట్టుకుని చమ్డా లెక్కగొడతాడు' అని గిరీశం నూరిపోస్తుంటే శిష్యపరమాణువయిన వెంకటేశం ఔరా అనుకుంటాడు యీ''క్రియేషన్'' అనగా యేమిటి అని గిరీశం అడగ్గా క్రియేషన్ అనగా -అప్పులు అంటాడు వెంకటేశం.

వెంకటేశం 'గురువు' దగ్గర సర్టిఫికెట్టు పుచ్చుకోవడమే కాదు, గురువుగారికే సర్టిఫికెట్లు ఇచ్చుకోవడంలో కూడా మొనగాడే. సురేంద్రనాథ్ బానర్జీ, గిరీశంగారూ లాంటి గొప్ప వాళ్లు, తెల్లవాడి దగ్గరకాదు. దేవుడి దగ్గరైనా నౌఖరీ చెయ్యమంటే చెయ్యరు. కలక్టరేవంటాడో తెలిసిందా? పోలీసు వెళితే 'స్టాండ్' ! నిలుచో' అంటాడు. గిరీశం గారు వొచ్చారంటే షేక్‌హాండ్ చేసి కుర్చీమీద కూచోండి అంటాడు' అని వెంకటేశం అద్భుతమైన 'కహానీ' వినిపిస్తాడు.

వెంకటేశంలో గురుభక్తి, పితృభక్తి రెండూ పోటీపడతాయి. అయితే ఈ రెండింటిలోనూ హాస్యం పిండుకోవచ్చు. వెధవ ముండని కూడా పెళ్లాడతావా? అని బుచ్చమ్మ అడగ్గానే 'నాన్న తన్నకుండా వుంటే తప్పకుండా పెళ్లాడ్తాను, గానీ బోడిగుండు చేస్తే మాత్రం నాకక్కర్లేదు' అంటాడు.

గురువు గురువే... నిజం నిజమే' అన్నది వెంకటేశం ప్రిన్సి'పుల్'. నీమేష్టరు లాంటి అభాజనుణ్ణి పుట్టించడం లోపం అంటావా? అనవా? అని గిరీశం 'ప్రెస్' నించగానే 'లోపవేఁ' అని వెంకటేశం మోహమాటం లేకుండా చెబుతాడు.

'నాన్నివ్వకపోతే అమ్మనడగి డబ్బుతెస్తాను' అని అనగానే 'నీ బుద్ధి యలా వికసిస్తుందో చూశావా? యిలా తర్ఫీదవుతుంటే నువ్వు కూడా పెద్ద పొలిటీషను వవుతావు' అని గిరీశం వెంకటేశానికి సర్టిఫికేటు ఇస్తాడు. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం' అన్నారు. ఒక పండితుడి టాలెంటును ఇంకో పండితుడు మాత్రమే గుర్తించగలడు. గిరీశం 'గాలి మేడలు'

కట్టడంలో మొనగాడు. అతడి శిష్యుడూ అంతే. నాకు మేడలుంటేనేగానీ కుదరదు. యిలాంటి చిన్న యిళ్లలో నాకు ఉక్కిరిగా వుంటుంది. ఆమేడ చుట్టు తోట వుండాలి. మావిడి చెట్లూ, అరటి చెట్లూ, జామ చెట్లూ, చెప్పన్ని వృక్షాలూ వేస్తాం... మన వెంకటేశం కోతిలాగ పళ్లు తింటూ యెప్పుడూ ఆ చెట్ల మీదే వుంటాడు' అని అంటాడు. వెంటనే గిరీశం ఆ చెట్ల పళ్లన్నీ నేనే కోస్తాను' అని 'కోతలు' కోస్తాడు. అసలు వెంకటేశానికి చెట్లెక్కడంలో దొర ఇంటిలో తర్ఫీదు ఇచ్చింది 'పండిత' గిరీశమేకదా!

## కరటక శాస్త్రీయ హాస్యం

కరటక శాస్త్రి అగ్ని హోత్రావధానులు బావమరిది. బావగారికి గడ్డిపెట్టి హాస్యం సృష్టించిన మేధావి. కరటక శాస్త్రి కూడా గ్రంథసాంగుడే. మధురవాణి ఇంటిలోకి వెళ్లిన కరటక శాస్త్రి 'ఆపద కడ్డంబడ్డవారే బంధువులు. మేమ్మీకు బంధువులం కా(వు గానీ మీరు మాకు బంధువులు కాగలరు' అని మదురవాణితో అంటాడు. 'ఉదర నిమిత్తం బహుకృత వేషం' వేస్తున్నట్టు ఒప్పుకుంటాడు ఢిల్లీకలక్టర్ దగ్గర గిరీశాన్ని చూసినట్టు చెబుతాడు. పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అంటే అందుకు సౌజన్య రావే ఉదాహరణ అంటారు కరటక శాస్త్రి

'కొందరు బంట్లు పాగలు యాంటీనాచి రాత్రిప్రోనాచి. కొందరు వున్న వూళ్లో యాంటీనాచి, పరాయి వూళ్లో ప్రోనాచి. కొందరు శరీర దార్ఢ్యం వున్నంత కాలం ప్రోనాచి. శరీరం చెడ్డ తరవాత యాంటీనాచి. కొందరు బతికి ఉన్నంతకాలం ప్రోనాచి చచ్చిపోయిన తర్వాత యాంటీనాచి. కాందరు అదృష్టవంతులు చచ్చిన తరవాత కూడా ప్రోనాచే. అనగా యజ్ఞం చేసి పరలోకంలో భోగాలకు టిక్కెట్లు కొనుక్కుంటారు. నాబోటి అల్పప్రజ్ఞకల వాళ్లు లభ్యంకానప్పుడల్లా యాంటి నాచీ నని మహత్తర సత్యం హాస్యస్ఫోరకంగా చెబుతాడు కరటకశాస్త్రి. 'హస్య హంస' అనిపిస్తాడు. ఇంకో సందర్భంలో 'చెడ్డ వారి వల్ల చెప్పుదెబ్బలు తినవచ్చును గాని, మంచి వారి మాట కాయడం కష్టం' అని కరటక శాస్త్రి అక్షర సత్యాలు ఆవిష్కరిస్తాడు.

## పేరునిలబెట్టుకున్న లుబ్ధావధాన్లు

రామచంద్రాపురం అగ్రహారీకుడైన లుబ్ధావధాన్లు పేరుకు తగ్గవాడు. లుబ్ధావధాన్లు పింతల్లి కొడుకు గిరీశం. 'నేను ముసలివాణ్ణా...' వీడిసిగతరగా' యాభై యేళ్లకే ముసలిటండీ? కొంచెం దగ్గు వుండడమే కాగట్టండి (దగ్గును నిలవెడు ధనంపోసి పిల్లని కొనుక్కొన్న తరవాత) మరి దాని ఘోషా, నాఘోషా, వాడికెందుకయ్యా? డబ్బుచ్చుకొన్న తరవాత చచ్చిన శవానికైనా కట్టక తీరదు అని వాదించి తనబుద్ధిని బయటపెట్టుకుంటాడు లుబ్ధవధాన్లు మధురవాణి. 'మీకు' పెళ్లాం కన్నా యెక్కువ సంరక్షణ చేస్తాను అని అంటే, 'బీదవాణ్ణి నేను డబ్బివ్వ లేనే! నీలాంటి విలువైన వస్తువును పంతులుగారే భరించాలి. అంటాడు.

## 'తెగ'హాస్యం

బ్రాహ్మణుల్లోని వైదీక, నియోగ తెగలను ఆధారంగా చేసుకుని గురజాడ అప్పారావు తన కన్యాశుల్కం నాటకంలో 'తెగ' హాస్యం సృష్టించాడు. ఎవరి తెగను వారే విమర్శించుకుని హాస్యం సృష్టించడం ఇందులో చిత్రం.

'మంత్రవన్నప్పుడు వైదీకం వాడిదేం మంత్ర మండీ? యీ రోజుల్లో వైదీక మ్మంత్రాల తీరుమారిపోయిందండి. మంత్ర వంటే నియోగ ప్రభువుదే మంత్రం. తమ వంటి ప్రయోజకులకు మంత్రం మాటాడుతుందండి' అని కరటక శాస్త్రి రామప్ప పంతులుతో అంటాడు. ఇంతటితో ఆగడు. బెడ్‌రూం విషయాలకు హాస్యం రంగరించి చెబుతారు.

''వైదికపాళ్లం మాకా శృంగారాలు యాలా అనుభవవౌతాయండి? మీ యిల్లాళ్ళ క్కోపం వస్తే చీపురు గట్టలు యెగురు తాయండి. సరసవన్నది పుస్తకాల్లో చదవడమేగాని మాకు అనుభవేద్యం కాదండి' అంటాడు. నియోగి అయిన రామప్పంతులు 'మాలౌక్యం మాతో స్వతగా పుట్టినది. యెరువు సరుకు యెరువు సరుకే. విన్నారా? మీ వాళ్లు లంచాలు పుచ్చుకోవడం చాత కాక, పతివ్రతలమని వేషాలు వేస్తారు' అంటాడు రామప్పపంతులు. ఇంకోచోట పూజారి గవరయ్య 'నియోగి లేని సావిడి అయ్యయ్యో వట్టి రోత' అంటాడు. యేదయినా యెత్తు యెత్తా వంటే తమలాంటి యోధులు యెత్తాలి. నాలాంటి నియ్యోగప్పాడునడిపించాలి. అని రామప్పంతులు అగ్ని హోత్రావధాన్లతో అంటాడు.

## లిటిగేషన్ హాస్యం

కన్యాశుల్కంలో 'లిటిగేషన్ హాస్యం' కనిపిస్తుంది. ప్రత్యేకించి అగ్నిహోత్రావధాన్లు ఇందుకు ప్రతీకగా, పతాకగా కనిపిస్తాడు. ఈ నాటకంలో అగ్నిహోత్రావధానులు 'ఏం బావా'? అంటే 'ఏదీ దావా?' అనే టైపు

'గిరీశం గారూ, రాత్రి మనవనుకొన్న ప్రకారం మనదావాలు గెలుస్తాయనే మీ అభిప్రాయ వాఁ?' అని అగ్నిహోత్రావధానులు 'డిస్కూకస్సూ' చేయడం మొదలు పెడతాడు. అతడి మనసెరిగిన గిరీశం ''తప్పకుండా క్రిమినల్కేసు కావలసిందే. క్రిమినల్ ప్రాసీజర్ కోడ్ 171 శక్షన్ ప్రకారం తెద్దావా? 172 శక్షన్ ప్రకారం తెద్దావా? అని అడుగు తాడు. 'హ్యూమర్ శక్షన్' కిందనిందితుడయిన గిరీశం అన్నమాటలకు అగ్నికి వ్యాజ్యం పోసినట్టు' మాట్లాడతాడు అగ్నిహోత్రావధాన్లు. 'రెండు శక్షన్లు లేవేం' అంటూ శక్షన్లలోకూడా అధికస్య అధికం ఫలం' అనుకుంటాడు 'అగ్ని నేత్రావధాన్లు'. 'ఈగోడ మీదయినట్టు చాల్తీల్తైగబొడిచి సాక్ష్యం కూడా పలగ్గలను యీ గోడ స్పష్టంగా మీదాన్లాగే కనబడుతోంది. అంటాడు గిరీశం పిల్లికి ఎలక సాక్ష్యం టైపులో కోర్టు వ్యవహారాల్లో అగ్ని హోత్రావధాన్ల టాలెంటుకు రామప్పంతులు సర్టిఫికెటు కూడా ఇస్తాడు.

గిరీశం నుంచి అగ్నిహోత్రావధాన్లు సలహా అడగడం ఇష్టం లేని రామప్పపంతులు కోర్టు వ్యవహారల్లో ఆరితేరిన మీకు ఒహడు సలహా యివ్వాలాండీ. స్థలజ్ఞణ్ణి గనక సాక్ష్యం గీక్ష్యం తేవడానికి నేను సాయం చేస్తానన్నాను కానీ, అయ్యవార్లు, గియ్యవార్లు మీకు సలహా చెప్పే పాటి వాళ్లా? గుంట నక్క గట్లు రెండు యింగిలీషు ముక్కలు చదువుకున్నారు గనక ముక్కస్యముక్కార్థః అని తర్జుమాలు మటుకు చేస్తారు' అని గిరీశాన్ని పరోక్షంగా తూలనాడుతాడు.

కన్యాశుల్కంలో వకీలు అయిన సౌజన్యంరావు పాత్రకూడా ఉంది. 'కేసు' విధికృతం, ఎలావుంటే అలా అవుతుందని వకీల్ని పెట్టడం మానేశారా? అని అగ్నిహోత్రువధాన్లను ప్రశ్నిస్తాడు. దావాపడుతుంది' అని సౌజన్యరావు హెచ్చరిస్తే 'నేను అగ్రహారపు చెయ్యిని-దావాగీవా అని బెదిరించితే భయపడేవాణ్ని కాను' అంటాడు. అగ్నిహోత్రావధానులు. అసలు కోర్టుకేసుల కాయితాలన్నీ పైసాఖర్చులేకుండా తర్జుమా చేయించుకోవచ్చునని గిరీశాన్ని దగ్గరికి తీస్తాడు అగ్నిహోత్రావధాన్లు. డబ్బు ఖర్చులేకుండా వీడిచేత కాగితమ్ముక్కలన్నీ తర్జుమా చేయించేస్తాను' అని అగ్నిహోత్రావధానులు తనలో అనుకుంటాడు. 'యీ వెధవని పజ్యండు కోర్టంటా తిప్పకపోతే నేను రామప్పంతులుని కాను చూడునాతమాషా' అని గిరీశాన్ని తిడతాడు రామప్పంతులు. కన్యాశుల్కంలో, ఇటువంటి 'లీగల్ తమాషాలు' ఎన్నో కనపడతాయి.

## హాస్యానికి భాష

కన్యాశుల్కం నాటక రచనకు కావాలని వ్యావహారిక భాషను ఎంచుకున్నారు గురజాడ అప్పారావు. హాస్య రసాన్ని దృష్టిలో పెట్టుకొని ఆయన ఇందుకు పూనుకున్నారు. "నేను ఈ నాటాకాన్ని వాడుక భాషలో రాశాను. ఎందువల్లనంటే ఇదిగ్రాంధిక భాషకన్నా నాటకాలు చూసే ప్రజలకు బాగా అర్థమవుతుందనే కాక, ఇది హాస్యరసానికి తగినదని నా నిశ్చితాభిప్రాయం". అంటారు గురజాడ అప్పారావు కన్యాశుల్కం మొదటి కూర్పు పీఠికలో. హాస్యానికి గురజాడ వారు పెద్దపీట వేసిన విషయం దీనిని బట్టే అర్థమవుతుంది.

## ఎందరో మహానుభావులు వారి అభిప్రాయాలివి:

కన్యాశుల్కంలో హాస్యం గురించి పలువురు ప్రముఖులు వెలిబుచ్చిన అభిప్రాయాలను ఇక్కడ క్రోడీకరించడం సముచితంగా ఉంటుందని భావిస్తున్నాను. కన్యాశుల్కం - నూరేళ్ల సమాలోచనం గ్రంథం నుంచి వాటిని స్వీకరించడం జరిగింది. అవి ఇవీ 'కన్యాశుల్కం నాటకం హాస్య రస ప్రధాన మనిపిస్తుంది. నాటకం పేర్లు చెప్పగానే నవ్వు పుట్టిస్తుందనే భ్రమ కలిగించే పాత్రలు ఒక పాత్ర దాని వెంట ఇంకొకటి మన మనో వీధిలో మెదలుతాయి. నాటక పాత్రలే ఒకరికొకరు అడ్డపేర్లు పెట్టుకున్నారు. హాస్యం చేసుకున్నారు. గిరీశం అగ్నిహోత్రావధానికి

'అగ్గిరాముడు' అని పేరు పెట్టినాడు. అతనికే కరటక శాస్త్రి 'మూర్ఖప గాడ్దెకొడుకు' అని తిట్టినాడు. గిరీశం కరటక శాస్త్రికి 'రాస్కెల్ స్కౌండ్రల్' అని బిరుదువాచకాలను తగిలించినాడు. గిరీశం కూటికి గుడ్డకు ఠికాణం లేని పూల రంగడు. ఇతనిని రామప్పంతులు, బొట్లేరు అని కొట్టిపారేసినాడు' అని సర్దేశాయి తిరుమలరావు కన్యాశుల్కంలో హాస్యం అనే తమ వ్యాసంలో పేర్కొంటారు. (కన్యాశుల్కం నాటక కళ)

'నాటక కర్త గురజాడ అప్పారావుగారు లౌక్యులు. వ్యంగ్య హాస్యం అతిసరసంగా ప్రయోగించగల చతురులు. వీరిలో గల విశేషం. దోషాన్ని చూపెడతారు గానీ దానిపై తిరిగి వ్యాఖ్యానించరు. అంటారు. ముట్నూరి సంగమేశం కన్యాశుల్కం - వ్యంగ్య హాస్యము అనే వ్యాసంలో. (తెలుగు హాస్యం) కన్యాశుల్కం చదివితే మనకు కలిగే ఆనందమే రసం. ఆరసం హాస్య స్ఫురణ వల్ల కలుగుతోంది అనక తప్పదు' అని వ్యాఖ్యానిస్తారు విద్వాన్ జి.జె. సోమయాజి గారు . గురజాడ హాస్యం అనే వ్యాసంలో.

## హాస్యోరక్షతి రక్షితః

'బి.పి. లేనివాడు బిర్లా. షుగర్ లేనివాడు టాటా' అన్నది నా నినాదం. నా విధానం. కన్యాశుల్కం నాటకం తనను చూసిన వారిని, చదివిన వారందరిని బిర్లాలను టాటాలను చేస్తుంది. 'సంభవామి యుగే యుగే' అని తలపించేట్టు ఈ యుగంలో అందరికీ తన హాస్యంతో ఆరోగ్య సౌభాగ్యం కలిగించడానికి గురజాడ వారు అవతరించారు. 'హాస్యోరక్షితి రక్షితః' అనవలసిన పరిస్థితి. హాస్యాన్ని మనం రక్షిస్తే హాస్యం మనల్ని రక్షిస్తుంది.

గురజాడవారి కన్యాశుల్కం హాస్యానికి ఒక ఊట బావి. ఎంత తోడుకున్నా అందులో హాస్యం 'ఊరు తూనే ఉంటుంది. విష్‌యూ బెస్ట్ ఆఫ్ 'జోక్'. అదే మీకు లక్. అదే మీకు జలక్.

గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిమార్గ మదియె ముందుగా చూపురా
విశ్వదాభిరామ వినురవేమ



# మొక్కపాటి వారి రచనలలో హాస్యం

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ.

పిఠాపురం సంస్థానానికి దివానుగా కొంతకాలం పని చేసిన వ్యవహారదక్షులు మొక్కపాటి సుబ్బారాయుడు గారు. ఆయన కిద్దరు తమ్ముళ్లు. ఒకరు నరసింహశాస్త్రి గారు, రెండవ వారు రామమూర్తి గారు. రామమూర్తిగారు కృష్ణశాస్త్రి గారికి, గుడిపాటి వెంకట చలంగారికి, ఆప్త మిత్రుడు, సంఘ సంస్కర్త, చిన్న వయస్సులోనే మరణించారు.

నరసింహశాస్త్రిగారు సుప్రసిద్ధులు. బారిస్టర్ పార్వతీశం నవల రచయిత. 1913-1917 మధ్య ఇంగ్లండులోని ఎడింబరో (నిజానికి స్కాట్‌లండ్ లో అనాలి) విశ్వ విద్యాలయంలో వ్యవసాయ శాస్త్రంలో ఒక పరీక్షకు నాలుగేళ్ల పాటు చదివి, పరీక్షలు రాయకుండా ఇండియా వచ్చేశారు. బహుకొద్దికాలం బందరు జాతీయకళాశాలలో ఉద్యోగం చేసి, మానేశారు. మరెప్పుడూ ఉద్యోగం చెయ్యలేదు.

1919లో తెనాలిలో తల్లావఝుల శివశంకర శాస్త్రిగారు సభాపతిగా, సాహితీ సమితి ఏర్పడింది. 1920లో సాహితీ పత్రిక మొదటి సంచిక వచ్చింది. 1920 తరువాత చేరిన సాహితీ సమితి సభ్యుల్లో నరసింహశాస్త్రి గారు ప్రముఖులయ్యారు.

బారిస్టరు పార్వతీశం "పెద్దకథ"కి అంకురార్పణ జరగడానికి ముందు, "పిలక" (స్కెచ్), "నేను-మా ఆవిడ", "లక్ష్మి" అనే కథలు మాత్రమే నరసింహశాస్త్రిగారు రాశారు. అంటే 1920-'23 మధ్యకాలం - అంటే, శాస్త్రి గారి వయస్సు 28-31 ఏళ్ల మధ్య- కథ ప్రకారం బారిస్టర్ పార్వతీశం స్వగ్రామం, నరసాపురం దగ్గర మొగలితుర్రు. శాస్త్రిగారి మానసపుత్రుడిగా పుట్టింది మాత్రం నరసాపురం తాలూకా గుమ్మలూరు గ్రామంలో-

బావ మరదులు, మరదళ్లు, 'పక్కింటి వారబ్బాయి' వంటి కుర్రకారు చుట్టూ చేరగా ఓ దీపావళికి, తమ అత్తవారింటికి అక్కడకు (గుమ్మలూరు) వెళ్లిన సందర్భంలో, నరసింహశాస్త్రి గారు ఆరోజుల పడవ ప్రయాణం కష్టాలు, తమాషా అనుభవాలు, కథకట్టి 'నోటి మాటలుగా' చెప్పారు. కుర్రాళ్లు ఆ కథనానికి సరదాపడి, కథగా రాయమన్నారు.

రాతకు కూర్చున్న శాస్త్రిగారు, కథలో పల్లెటూరి కుర్రాణ్ణి మద్రాసు దాకా తీసుకువెళ్లారు. అప్పటికి ఆ కుర్రాడికి నామకరణం జరగలేదు. ఇంగ్లండు తీసుకువెళితే ఎలా వుంటుందనే

ఆలోచన కలిగింది. కుర్రాడు స్వీయ చరిత్ర చెపుతున్నట్టు, ఉత్తమ పురుషలో ఇంటి పేరు, పేరు, స్వగ్రామం చెప్పించడంతో కథనడవడానికి దారి సుళువైంది.

ఉన్నపాటున - కుర్రాణ్ణి మద్రాసులో కథాపరంగా ఆపి, ఒకసారి గుంటూరు వెళ్లి తన సాహితీ సమితి సహచరులకు వినిపించారు. శివ శంకర శాస్త్రి, నోరి నరసింహ శాస్త్రి, శ్రీనివాస శిరోమణి వంటి మిత్రులంతా బాగుందనడం, కథ పూర్తి చేయమనడం మాత్రమే కాదు - శ్రీనివాస శిరోమణిగారు వ్రాయసగాడిగా కూర్చుని, నరసింహశాస్త్రిగారు చెపుతూంటే రాశారు. అనుకున్న ప్రకారం పల్లెటూరి కుర్రాడికి పార్వతీశంపేరు స్థిరపడింది. ఇంగ్లండు వెళ్లి చదువుకోవలసిన గొప్ప చదువుల్లో ఒకటైన 'బారిస్టర్' అతడికి గమ్యమైంది. సాహితీ సమితి సభాపతి తల్లావఝుల శివ శంకర శాస్త్రిగారు "బారిస్టర్ పార్వతీశం" అని పేరు కూడా ఖాయం చేశారు. 1924 డిసెంబరు మొదటి వారంలో ఈ ఘటనాపరంపర జరగగా - రెండో వారం చివరికి పుస్తకం పూర్తయింది. తొలిసారిగా బెజవాడ శారదాప్రెస్‌లో అచ్చయింది. 1924 డిసెంబరు 24వ తేదీనాడు తెనాలి సాహితీ సమితి తొలిసమావేశంలో శాస్త్రి గారు బారిస్టర్ పార్వతీశంలో కొన్ని భాగాలు చదివి వినిపించారు. విన్నవారంతా హర్షామోదాలు ప్రకటించారు.

నరసాపురం తాలూకా మొగలితుర్రు గ్రామం నుంచి కేవలం, స్వబుద్ధికి తోచిన విధంగా బయలుదేరిన పార్వతీశం, ఇంగ్లండులోని పోక్స్టన్‌లో కుడికాలు పెట్టడంతో బారిస్టర్ పార్వతీశం, "మొదటి భాగం" సమాప్తమైంది. లౌకిక మానవ జీవన ప్రమాణం ప్రకారమైతే - 1924 డిసెంబరు 24 వ తేదీన పుట్టిన పార్వతీశానికి 78 వ యేడు నడుస్తోంది. కాని - సాహిత్యంలో పుట్టిన పాత్రలకు వయస్సు పెరగదు. పెరగకూడదు. మరణ ప్రస్తావనే రాదు. రాకూడదు. -

మహాకవి కీట్సు "Ode on a grecian urn" లో చెప్పినట్టు

"Forever warm and still to be enjoyed

Forever panting and forever young-"

ఏ గొప్ప పాత్ర ఏ వయస్సుతో పుడుతుందో, అదే వయస్సుతో శాశ్వతంగా తరతరాల పాఠకులను గిలిగింత పెడుతూంటుంది. అదే దాని గొప్పతనపు రహస్యం.

చార్లీ చాప్లిన్ Tramp పాత్రకీ,... P.G. Wode house Jeeves పాత్రకీ,... మునిమాణిక్యం కాంతానికీ, భమిడిపాటివారి శీనయ్యకీ, ముళ్లపూడి వారి 'బుడుగు' కీ 'అప్పారావు'కీ .... ఇంకా అనేకానేక జీవవంతమైన పాత్రలకి .... ఎంకికి, ఊర్వశికి, శశికళకి, అరుణకి, అమీనాకి, కోమలికి, జగన్నాథానికి.... గిరీశానికి, మధురవాణికి, ఈ కోవలోనే పార్వతీశానికి.... వయస్సు రావడం ఏమిటి? వార్ధక్యం లేదు గాక లేదు....

అయితే 1924 నాటికీ 1974 నాటికీ పార్వతీశం పాత్ర చిత్రణలో, నరసింహశాస్త్రి గారు ఎంత జాగ్రత్త వహించినా, ఎన్ని సంజాయిషీలు చెప్పుకొన్నా - కొంత మార్పు సంభవించింది.

ఎందుకంటే శాస్త్రి గారు తన ఊహలో తొలిసారి తలపెట్టిన నాడు ఉన్న బొమ్మవేరు. మూడవ భాగంలో పార్వతీశాన్ని ఆయన "పెద్దమనిషి"గా దిద్దితీర్చింది వేరు - ఆయన మాటల్లోనే ఆయన తొలి ఉద్దేశం. "ఆంధ్ర జాతి స్వభావములో హాస్య జనకమైన విషయాన్ని మాత్రము ఒక వ్యక్తిగా చేసి ఈ కథ వ్రాశాను" - అని. చింతా దీక్షితులు (కథక చక్రవర్తి బిరుదాంచితులు) గారు రాసిన హాస్యరచనల ప్రేరణ కూడా వుంది. "ప్రథమ ప్రయత్నం"గా ఈ (బారిష్టరు పార్వతీశం) పుస్తకం రాశానని శాస్త్రిగారే చెప్పుకున్నారు.

"ఆంధ్ర జాతి స్వభావము" ఎలాగ పార్వతీశంలో ఆయన చిత్రిద్దామనుకున్నారో చూడండి - "ఆంధ్ర వ్యక్తిత్వము అనే ఒక విచిత్రమైన ప్రకృతి బయలుదేరింది. ఇది ముఖ్యముగా యువకులైన వాళ్లలో మూర్తీభవించింది. ఆ స్వరూపమే మన పార్వతీశం. కుర్రవాడు అల్పజ్ఞుడు. దేశములో స్థితిగతులు ఉండవలసిన రీతిగా లేవని ఏదో మార్పు అవసరమని పెద్దల ఉపన్యాసములు విని తెలుసుకున్నాడు. అందుకేమి చెయ్యాలో వారానాడు (1913-1917) చెప్ప లేదు. అతని అల్పబుద్ధికి గోచరించలేదు. ఇలా అని అంతటి తోటి వానిని విడిచిపెట్టనూ లేదు. ఆ విషయము పూర్తిగా ఇంకొకళ్లను అడిగి తెలుసుకోవడము న్యూనత అనుకున్నాడు. మహామహులు నిర్వచించలేని కార్యము తాను ఒక్కడే కొనసాగించగలననుకున్నాడు. తను యీ ప్రయాణం చేయకపోతే, ఇక హిందూ దేశానికి ముక్తి లేదనుకున్నాడు....."

ఇలా - అలవికాని పనిని - అమాయకుడు, పల్లెటూరి కుర్రాడు, లోక జ్ఞానం చాలినంతగా లేనివాడు, నరసాపురం టెయిలరు హైస్కూలులో అయిదో ఫారం దాటి చదువంటని వాడు - అనుకోవడవంలోనే హాస్యం వుంది. ఈ కుర్రాడు గుంభనగా, లౌక్యంగా వున్నాననుకుంటూ తనకున్న 'చిన్నపరిధి' లోనే నిర్ణయాలు చేసుకోవడంలో హాస్యం వుంది. - ఇది పార్వతీశం 'కథ'గా, చిన్నగా ప్రారంభించిన నాటి నరసింహశాస్త్రిగారి ఊహ.

నిజానికి - "పార్వతీశాన్ని విదేశాలకు పంపవలెనని గుంటూరులో నిర్ణయించుకొని, ఆ పుస్తకం పూర్తి చేసినప్పుడు రెండవ భాగం వ్రాయవలెననే" సంకల్పం శాస్త్రిగారికి లేదు. "బారిష్టర్ పార్వతీశం" మొదటి భాగం అసంపూర్తిగా వుండడం, అయినా ఆ పాత్రకి అనూహ్యమైన ప్రచారం రావడం, అనే రెండు కారణాల వల్ల మొక్కపాటి వారికి సంబంధం పార్వతీశంతో ఎక్కువై, రెండవ భాగం రాయక తప్పింది కాదు. రెండవ భాగంలో పార్వతీశం విదేశీ జీవితం రాయాలనే ఆలోచనతో పాటే, మూడవ భాగంగా,- పార్వతీశం ఇంటికి వచ్చాక కలిగిన అనుభవాలు రాయాలనే ఆలోచన కూడా ఆయన మనస్సులో ప్రవేశించింది.

1970-71 కాలానికి - అంటే ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో మొదటి భాగం అచ్చువేసి, కొనసాగింపుగా రెండు, మూడు భాగాలు ధారావాహికగా ఆకాశవాణి కేంద్రం నుంచి ఆచంట జానకీరాంగారి ప్రోద్బలంతో రాసినవీ, విజయవాడ ఆకాశవాణి కేంద్రం నుంచి బుచ్చిబాబుగారి

ప్రోత్సాహంతో రాసినవీ, వ్యాసాలు (పార్వతీశం విదేశానుభవాలు) ఆధారంగా రెండవ భాగం పూర్తి చేద్దామని ప్రయత్నం చేసి - ఆ వ్యాసాలు లభ్యం కాక బాధపడి - కొన్నాళ్లకి జ్ఞాపకం చేసుకుంటూ, పూర్తి చేశామనీ - అయితే ఆ రాతప్రతి దురదృష్టవశాత్తూ చెదలపాలబడి - ఖిలమైపోయిందని శాస్త్రిగారు తమ "సంజాయిషీ"గా, 1974లో రెండవ భాగం తుదిపలుకుగా వ్రాసిన వ్యాసంలో పేర్కొన్నారు.

ఏది ఏమైతే యేం? మొదటి భాగం వెలువడిన 46 సంవత్సరాల తరువాత రెండో భాగం, దానిననుసరించి మూడవ భాగం, - తాను అనుకున్న ప్రణాళిక ప్రకారం పూర్తి చేశారు నరసింహ శాస్త్రిగారు. సుమారు అర్ధశతాబ్ది కాలంలో ఆయన (పాఠకులను మించి) పార్వతీశం మీద ప్రేమ పెంచుకున్నారు. అతడు అంత బొత్తిగా - మరీ అంత అమాయకంగా - వుండడం, బహుశా ఆయనకు మింగుడు పడలేదు. అందుకే, రెండు మూడు భాగాలు రాయడంతో సరిపెట్టక - నవల ప్రారంభంలో పార్వతీశం "బాల్యంలోని" తెలివి తేటల్ని కొంత పెంచడానికీ, పాత్ర స్వభావాన్ని కాస్త "గంభీరం" చెయ్యడానికీ ఉద్యమించి 37 అచ్చుపేజీల నిడివి, ఏడు ప్రకరణాలు, కొత్తగా కల్పించారు. ఈ పునరుద్దేశం వల్ల - 1924 నాటి ప్రథమ భాగం కథలోని పార్వతీశం తండ్రి "వ్యవసాయదారుడు, ఏమీ చదువుకోనివాడు, వట్టి అనాగరికుడు" అయిన వాడుకాస్తా,- "పెరిగిన" తొలి ప్రకరణంలో "మొగలితుర్రు ఆస్థానములో పేరుగన్న విద్వత్ కుటుంబంలో పుట్టి, ఆస్థానం వారి గౌరవ పాత్రత" సంపాదించు కున్నాడు. "నాలుగు సంస్కృతం ముక్కలు నా కొచ్చినవి చెపుతాను" - అని, అయిదో ఫారంలో తప్పిన పార్వతీశాన్ని చదువు (నరసాపురం) చాలించి, ఇంటికి వచ్చెయ్యమని 'హితవు' బోధించే పరిణామం పొందాడు. ఇక-పార్వతీశంలో పరిణామం సరేసరి, అతను అల్లరి కుర్రాడు తప్ప, బుద్ధి విశేషంలో చాకులాగ తయారై బాల్యం నుంచి నాయకత్వ లక్షణాలు పుణికి పుచ్చుకున్నాడు-

పార్వతీశం పాత్ర మౌలిక స్వభావాన్నే మార్చేసే అలోచన బహుశా మూడవ భాగంలో అతన్ని దేశభక్తుణ్ణి చేశాక, కలిగింది.

-కలిగితే కలిగింది; అప్పుడు, నవల మొదటి భాగంలో ప్రారంభం తదనుకూలంగా మార్చి ఉండవలసింది. అలా చేయలేదు. 1924వ నాటి మొదటి భాగం, యథాతథంగా కొత్తగా రూపొందిన, "సమగ్ర" - మూడుభాగాలు కలిసిన, "సంయుక్త" సంపుటంలో 8వ ప్రకరణం నుండి 14వ ప్రకరణం వరకు అలాగే వుంది. ఇందువల్ల ఇంకొక ఇబ్బంది కూడా వచ్చిపడింది. "మాది మొగల్తుర్రులెండి, మెగల్తుర్రు అంటే ఏమనుకుంటున్నారో" - అంటూ ఒకటీ; "నర్సాపురం దగ్గర మొగలితుర్రు మా కాపురస్థలం. మా ఇంటి పేరు వేమూరువారు. నా పేరు పార్వతీశం" - అంటూ మరొకటీ; రెండు "ప్రారంభాలు" తటస్థించాయి.

మొక్కపాటివారు, పార్వతీశం పట్ల గాఢానురాగంతో ఇంత చేసినా, తెలుగువారు మాత్రం

ప్రేమించినదీ, నెత్తిన పెట్టుకున్నదీ అమాయకుడైన పల్లెటూరి కుర్రాడు పార్వతీశాన్నే. మేధావిగా పరిణమించి, బారిస్టరై, టంగుటూరి ప్రకాశం పంతులుగారిదగ్గర 'అప్రెంటిస్' చేసి, లాయరైన దేశభక్తుడైన, పార్వతీశాన్ని కాదు-

వచన సాహిత్యం - అందునా హాస్య ప్రధానమైన ఇటువంటి "పార్వతీశం" - బయటకు రావడం 1924 నాటికి చాలాకొత్త, అపురూపం. అందులోనూ. వ్యవహారిక భాష కొత్తగా రూపం దిద్దుకొంటున్న కాలం-

ఆశ్చర్యంగా, ఆనందంగా ఈ నవలకి పాఠకులు, సాహిత్యవేత్తలు స్వాగతంపలికారు.

1827-1942 మధ్యగడిచిన సాహిత్య చరిత్రను "నవ్యాంధ్రసాహిత్య వీధులు" పేరిట రచించిన ఆచార్య కురుగంటి సీతారామయ్యగారు, "తెలుగులో హాస్యం" అనే పుస్తకం రాసిన ముట్నూరి సంగమేశం గారు, వంటి విమర్శకులు; "మా పిఠాపురం" పుస్తక కర్త, కృష్ణశాస్త్రిగారి ఆప్త శిష్యుడు కురుమెళ్ల వేంకట రావుగారు, 'సమగ్రాంధ్రసాహిత్యం" 11వ సంపుటంలో, పరిశోధకుడు ఆరుద్ర - హాస్యరచయితగా ప్రసిద్ధులైన ముళ్లపూడి వెంకట రమణగారు, బారిస్టరు పార్వతీశం నవలలోని 'చారిమ' గ్రహించి ప్రశంసించారు. సాధారణ పాఠకుల సంగతి చెప్పనే అక్కర లేదు.

శ్రీ శ్రీ గారు సిరిసిరిమువ్వ శతకంలో

**క్షితిలో బారిస్టరు పా**
**ర్వతీశమును చెప్పి, పిదప పలుకవలె గదా**
**కిత కితల కితరులను, భా**
**సిత సిత సుశ్లోకుడతడు సిరిసిరిమువ్వా!**

అని- ఇష్టదేవతాప్రార్థన సందర్భంలో స్తుతించాడు. ఇంకొక తమాషా, ఈ నవలను మొక్కపాటి వారు రాసిన కాలంలో, ఏలూరు జాతీయ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా, పప్పు పార్వతీశంగారనే, ఇంగ్లండు వెళ్లి వచ్చిన ఒకాయన ఉండేవారట. ఆయనే యీ పార్వతీశమని పాఠక జనం పొరపడేవారని 1942 లో కురుగంటి సీతారామయ్యగారు రాశారు. ('చూ. నవ్యాంధ్ర సాహిత్య వీధులు' 376 పేజీ, 1942 ముద్రణ.) "యునీక్ వర్క్" అవుతుందని - తొలిదశలో కథవిన్న నోరి నరసింహ శాస్త్రిగారు ప్రశంసించి - జనాదరణ పొందుతుందని భుజంతట్టినట్టుగా మొక్కపాటి వారే రాసుకున్నారు. (బారిస్టరు పార్వతీశం మొదటి భాగం - 'పార్వతీశం పుట్టు పూర్వోత్తరాలు"- 1971).

ఈ ప్రశంసలన్నీ అలా వుండగా- ధర్మసాధని, భారతి, పత్రికల సంపాదకులు హాస్య మనేది సుతరామూ లేదని ఒకరు, సిల్లీగా, అభూతకల్పనగా ఉందని ఒకరు, విమర్శించారట. ఈ

విమర్శలను ఉదాహరించి, మొక్కపాటివారు ''అందరనూ నవ్విస్తానని ఒట్టుపెట్టుకుని నేను పుస్తకం వ్రాయలేదు'' - అని తరవాత కాలంలో చిరచిరలాడారు.

1938 జనవరి ''ప్రతిభ'' (నవ్య సాహిత్య పరిషత్తు వారి పత్రిక) సంచికలో బుర్రా వెంకట సుబ్రహ్మణ్యంగారు చాలా ఘాటైన విమర్శ చేశారు. బారిస్టరు పార్వతీశం మొదటి భాగం రెండవ కూర్పుగా, 1937 ఫిబ్రవరిలో 'భవానీ భాండారం' వారు ప్రచురించిన సందర్భమది. ఆయన సూచించిన లోపాలలో కొన్ని:

1. చిన్నప్పుడు మొదటిసారి చదివినప్పటి ఆనందమూ, ఉత్సాహమూ, నాకు కలుగలేదు.
2. లోకజ్ఞానం లేని పార్వతీశం (కొన్ని కొన్ని సమయాల్లో) నిజమైన గడుసువాడిలా ఆలోచిస్తున్నట్లు నరసింహ శాస్త్రిగారు కథ వ్రాశారు.
3. కథలో ఒక పార్వతీశం బదులు ఇద్దరు పార్వతీశాలు బయలుదేరుతారు. ఒక పార్వతీశానికీ మరొక పార్వతీశానికీ, లంకె సమంగా కుదరదు.
4. పార్వతీశం ఆలోచనల విషయంలో కొన్ని అసందర్భాలు తప్పలేదు.
5. బారిస్టరు పార్వతీశం అందరిలోనూ, అన్నికాలాలలోనూ, సమాన మైన ఉత్సాహం పుట్టించదు.
6. మొదటి భాగానికి ఎవరైనా చూపించగలిగే అత్యంతాదరణ ఏమిటంటే, రెండవ భాగం కోసం ఎదురు చూస్తూ ఉండడమే.

-సుబ్రహ్మణ్యం గారు ఉదాహరణ పూర్వకంగా రాసినా - 'స్థూలం'గా ఆయన అభిప్రాయ సారం మాత్రమే ఈ ఉటంకింపు-

బారిస్టరు పార్వతీశం రెండు, మూడు భాగాలు రచనతో - ఆంధ్రజ్యోతి వారపత్రిక ఉద్యోగ బంధం వల్ల- నాకు కొంత సంబంధం వుంది. రెండవ భాగం దాదాపు పూర్తిగానూ, మూడవ భాగంలో కొన్ని ప్రకరణాలు, మొక్కపాటివారు వాచికంగా చెపుతూంటే, కాయికంగా నేను రాసిపెట్టాను. కప్పగంతుల రాజేశ్వరిగారు కొంత రాసిపెట్టారట.

శాస్త్రిగారు చాలా స్తిమిత మైన వ్యక్తి. గుండ్రటి మనిషి. పొట్టిగా వున్నా పచ్చగా, కళగా వుండేవారు. నేను ఆయనతో కూర్చుని నవల రాసిపెట్టేనాటికి నాకు 26 ఏళ్లు శాస్త్రిగారికి 78. అయినా వయస్సు అరమరికలు ఏమీవుండేవి కావు. ఆయన ఒక మనిషితో చనువు ఏర్పడనంత వరకు మితభాషి. నాతో చాలా చనువుగా వుండేవారు. ఛలోక్తులు, ఇంగ్లండులో కొన్ని అనుభవాలు, సాహితీ సమితి కబుర్లు, చలం మీద విసుర్లు, సరదాగా చెపుతూండేవారు. భారతీయ సంప్రదాయాలమీద ఎనలేని అభిమానం వున్నా, పాశ్చాత్యరచయితల్ని సహజంగా

అభిమానించేవారు. ఆయన ప్రవృత్తిలోనే హాస్యం వుండేది. పంచె, తరుచు పట్టులాల్చీ, కండువా, ధరించి -నుదుట చిన్నగా కనిపించే కుంకుమ వహించి - స్వచ్ఛంగా, ఆరోగ్యంగా కనిపించే వారు. ఊతంగా చేతికర్ర వుండేది.

బారిస్టర్ పార్వతీశం మూడు భాగాల ప్రచురణ, ధారావాహిక పూర్తి కాగానే. స్వయంగా ఆయనే ఒక బ్యాంకు ఋణం సంపాదించి ప్రచురించుకున్నారు. అప్పట్లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో ఆ నవలను ప్రచురించిన కార్టూన్ పద్ధతి బొమ్మల (చిత్రకారుడు, ప్రముఖ కార్టూనిస్టు 'బాబు'. అసల పేరు దుర్గా ప్రసాద్) బ్లాకులన్నింటిని, పత్రిక సంపాదకులు నార్లగారు, శాస్త్రి గారికి ఉచితంగా ఇప్పించారు.

మొక్కపాటి వారికి బారిస్టరు పార్వతీశం నాలుగవ భాగం కూడా రాద్దామనే కోరిక పుట్టింది. పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు సాగన్విలేదు. అలాసాగన్విక పోవడం ఆయనకే (శాస్త్రి గారికే) మేలయ్యిందనుకుంటాను. లేకపోతే, పార్వతీశం మీద ఆయనకున్న ప్రేమకొద్దీ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని చేసేవారేమో! పురాణంగారు, నేను, మొక్కపాటి వారికి మరో మేలు కూడా చేశామనుకుంటాను. ఆయన రాసిన 'మిస్. మనోహరి' అనే నవలను కూడా ప్రచురించ నివ్వలేదు. అది ఆయన రాయవలసినది కాదు. మాఇద్దరి మీద శాస్త్రిగారికి ఆగ్రహం కలిగింది కూడా.

నేను "నవల" సాహిత్యం ఎరిగినంతలో, చదివినంతలో - ముఖ్యంగా బారిస్టరు పార్వతీశం మూడు భాగాల సమగ్ర సంపుటం చదివేక - స్తిమితంగా ఆలోచిస్తే అనిపించినదేమిటంటే:

నవల మొదటి భాగం ఎనిమిదవ ప్రకరణం నుంచి 14వ ప్రకరణం వరకు, రెండవ భాగం తొలి ప్రకరణ నుంచి 25వ ప్రకరణం వరకు - అంటే పార్వతీశం మొగలితుర్రు అమాయకత్వంతో ప్రారంభమై పార్వతీశం ఎం.ఎ. బార్-ఎట్-లా చదువు పూర్తయి, ఓడెక్కి స్వదేశానికి తిరుగు ప్రయాణమైనప్పుడు, అతని స్నేహితురాలు స్టీమరు మీదకు వచ్చి ఇచ్చిన కడపటి వీడ్కోలుతో - ముగిసి వుంటే - పార్వతీశం కలఫలించి బారిస్టర్ కావడంతో - సమగ్రం, అర్థవంతమైన, ముగింపు జరిగి వుండేది.

చరిత్ర దృష్టితో చూసినా, పార్వతీశంలో సంస్కారం పెరగడం దృష్టితో చూసినా, రెండవ భాగం మొక్కపాటివారి కథన చాతుర్యాన్ని అద్భుతంగా చూపిస్తుంది. పార్వతీశం గడుసు తనం,ఉత్సాహం, యౌవనోల్బణం, లక్ష్యసాధన సమగ్రంగా మనకు దర్శన మిస్తాయిందులో-

మీనన్, రాజు, లాండ్ లేడీ, ఆమె ఇద్దరు కూతుళ్ళు, పార్వతీశం ప్రియురాలు, మరపురాని పాత్రలు. ఇందులో శాస్త్రిగారు వర్ణించిన చారిత్రక ఘటనలకు ఆయన ప్రత్యక్ష సాక్షి - మొదటి ప్రపంచ యుద్ధ కాలం నాటి ఇంగ్లండు బొమ్మను - 'ఎడింబరో' కేంద్రంగా - మొక్కపాటి వారు ఎంతబాగా చూపించారో!-

మిత్రుడు శ్రీతుమ్మల రామకృష్ణ శాస్త్రి గారు 'బారిస్టరు పార్వతీశం' నవలమీద పరిశోధన చేసి, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం నుంచి పి.హెచ్.డి. పొందాడు. ప్రస్తుతం కర్నూలులో ఉద్యోగం చేస్తున్నాడు.

అతను పరిశోధన కాలంలో ఒక ప్రశ్న అడిగాడు. 'హాస్యనవల' అనే ముద్ర తగినదా? - అని-

హాస్యరచనల్లో హాస్యం రెండు తరహాలుగా వుండే అవకాశం వుంది. ఒకటి: పాత్రల, సంఘటనల ప్రవర్తన నుంచి పుట్టేది, రెండవది: ఆ'హాస్యం' కథనంలో కూడా వుండేది.

అనదలిస్తే - ''బారిస్టరు పార్వతీశం'' నవలను నేను మొదటి తరహాకు చెందిన దనవచ్చు నంటాను.

శాస్త్రిగారు యీ నవల మూడవ భాగం రాద్దామనుకోవడం మీదనే నాకు భేదాభిప్రాయం వుంది కనక - ఆ భాగం కథా వివరాలలోకి విపులంగా నేను వెళ్లడం లేదు.

పార్వతీశం సరస్వతి అనే అమ్మాయిని పెళ్లాడడం, ప్రకాశం పంతులుగారి దగ్గర అప్రెంటిస్ గిరీ, అతని మామ అచ్యుత రామయ్యగారి సౌజన్యం, పార్వతీశం ప్రాక్టీసు వదలి, భార్యతో మొగలితుర్రు వచ్చి ఉన్న ఆస్తిపాస్తుల్ని చూసుకుంటూ గడపడానికి నిశ్చయించడం - ఇంతకుముందు అతను చూసిన సహాయనిరాకరణోద్యమపు పొంగు ... వంటి సన్నివేశా లింకా వున్నాయి - మూడవ భాగంలో....

మొగలితుర్రులో ప్రారంభమైన పార్వతీశం విదేశీయుడై, మళ్లీ దేశీయుడై, స్వగ్రామం చేరడంతో అతని జీవితకథావర్తులం సమగ్ర మౌతుందని, శాస్త్రిగారు భావించివుండవచ్చును.

''కథకు ఆది మధ్యాంతాలు సరిగా వుంటే గాని నాకు తృప్తిగా వుండదు'' - అని ఆయన చెప్పనే చెప్పారు.

అభిప్రాయాలు, భేదాలు వుంటే ఏమిగాక, బారిస్టరు పార్వతీశం అచ్చమైన తెలుగు ఆవేశాలు ప్రదర్శించి, సాహిత్య చరిత్రలో స్థిరపడిన పాత్ర.

1940లో ప్రముఖ సినిమా నిర్మాత, దర్శకుడు గూడవల్లి రామబ్రహ్మంగారు ''బారిస్టరు పార్వతీశం''కథను సినిమాగా తీశారు. నల్లరామ్మూర్తి, జి.వరలక్ష్మి నాయికా నాయకులు.

బారిస్టరు గారి బాతాఖానీ పేరిట శాస్త్రిగారు మద్రాసు, విజయవాడ ఆకాశవాణి కేంద్రాలు నుంచి ప్రసంగాలు చేశారు.

1960ల ప్రారంభంలో (బహుశా! కొద్దిగా ముందేమోకూడా!) బందా కనకలింగేశ్వర రావుగారు

''బారిస్టరు పార్వతీశం''గా విజయవాడ ఆకాశవాణి కేంద్రం నాటకం ప్రసారం చేసింది.

మొక్కపాటివారు ''బారిస్టరు పార్వతీశం'' రాయడానికి ముందే కథలు రాయాలనే ఉత్సాహంతో ఉండేవారు. ఆయన, రాసిన కథలు 'భారతి', 'సఖి', 'సాహితీ', 'ప్రతిభ' వంటి సాహిత్య ప్రతికల్లో ప్రచురణ పొందాయి. ఎక్కువగా 1924-1930 మధ్యను, ఆ తరువాత కొద్దిగాను కథలు రాశారు. ఆ కాలానికింకా తెలుగు కథ ఇతివృత్తం, భాష, శిల్ప పరంగా శైశవదశలో వుండేది.

1970లో 'భిక్షువు' అనే కథల సంపుటం ప్రచురిస్తూ శాస్త్రి గారు అందులో ప్రకటించిన జాబితా ప్రకారం 4 కథాసంపుటాలు, 3 నవలలు, 4 ఏకాంక నాటికల సంపుటాలు, - 'మన ప్రముఖ హాస్య రచయితలు' అనే విమర్శ గ్రంథం, హాస్య రసం (తత్త్వ విమర్శ), ప్రసంగాల సంపుటం, 'బారిస్టర్ గారి బాతాఖానీ' - మొత్తం 15 సంపుటాల రచనలు వచ్చి వుండాలి. కాని అలా జరగలేదు.

1950-52 మధ్యలో చిత్రకారుడు బుజ్జాయి (కృష్ణశాస్త్రిగారి అబ్బాయి) వేసిన ముఖచిత్రాలతో 'కన్నవీ - విన్నవీ' అనే పేరిట రెండు కథా సంపుటాలు, బారిస్టర్ పార్వతీశం మొదటి భాగం, 'మొక్కుబడి' నాటికల సంపుటి వెలువడ్డాయి. ఆ తరువాత చాలా కాలానికి 'బారిస్టర్ బాతాఖానీ' అనే చిన్న సంపుటం వచ్చింది. 1970లో 'భిక్షువు' కథల పుస్తకం వచ్చింది. బారిస్టర్ పార్వతీశం మూడు భాగాలు సరేసరి.- ఇవి కాక ఆయన రాసిన 'సుబ్బారాయుడు' నాటకం ఆయనకు చాలా పేరు తెచ్చింది. రంగస్థలం మీద ప్రదర్శనంలో ఒకదానిలో నరసింహశాస్త్రిగానే సుబ్బారాయుడు వేషం చేయడం చూశామని మానాన్నగారు హనుమచ్ఛాస్త్రి గారు చెపుతూండేవారు. రేడియో (విజయవాడ కేంద్రం) 1960లలో 'సుబ్బారాయుడు' నాటకం ప్రసారం చేసింది. అందులో సుప్రథిత రంగస్థల నటులు గండికోట జోగినాథంగారు 'సుబ్బారాయుడు' వేషం చేశారు. పెళ్లి సంబంధం ఒకటి చూసుకోవడానికి వచ్చిన ఒక అమాయకుణ్ణి కొందరు కొంటె కోణంగులు 'పిచ్చాసుపత్రి'కి పంపించడం ఇతివృత్తమను కుంటాను. భమిడిపాటి కామేశ్వరరావుగారు కూడా ఇదే ఇతి వృత్తంతో నాటకం రాసినట్టు గుర్తు. (అంతా ఇంతే?) ప్రస్తుతం సుబ్బారాయుడు నాటకం గాని, భమిడిపాటి వారి రచనగాని అచ్చులో దొరకడం లేదు.

మొక్కపాటి వారికి పేరు తెచ్చిన కథలు 'బంద సుబ్బడు, గాజుపాలెం గాంధీ, జన్మనక్షత్ర ఫలం, మా పద్మ, లక్ష్మి, చిత్తరువు, శిల్పిద్వయం, గత్యంతరం, భిక్షువు, ఆఖరు మాట, కోతపైకోతలు' వంటివి.

''బారిస్టర్ పార్వతీశం'' నవల మాత్రమే తెలిసిన వారికి మొక్కపాటి వారి రచనా వ్యక్తిత్వంలో

ఒక పార్శ్వం తెలిసినట్టే లెక్క. అయన హాస్యేతర రచనల వైవిధ్యం కథలలో కనిపిస్తుంది. ఆయనే ఒక కథలో పాత్ర చేత చెప్పించినట్టు... శాస్త్రి గారికి మానవ మనస్తత్వంలో ఒడిదుడుకుల్ని పరిశీలించి కథలు రాయడం ఇష్టం. ఆయన తననాటి మారుతున్న సమాజాన్ని, అందులో దాంభికత్వాలు, అమాయకత్వాలు, ప్రేమలు, విశ్వాసాలు, భ్రమలు, చదువు సంధ్యలు, పెళ్లిళ్లు, ఆర్థిక వ్యత్యాసాలు, ప్రకృతి ఆరాధన, వంటి విశేషాల్ని గాఢంగా అధ్యయనం చేసి విభిన్న కథలు రాశారు. ఆయన ఇతివృత్తమే ఆయన శైలి. చలంలాగ, మల్లాది, శ్రీపాద, - తరవాతి తరంలో బుచ్చిబాబుగారి లాగ విశేషశైలిని - అంటే కథన శైలిని - నిర్మించకపోయినా ఆయన కథల్లోని పాత్రలు, కల్పించిన వాతావరణం, మనోఘర్షణలు, ప్రకృతి పట్ల లాలస - మనల్ని ఆకర్షిస్తాయి.

మొక్కపాటి వారి - 'సీరియస్' కథల్లో నాలుగింటిని క్లుప్త వివరణ చేస్తాను.

ఒకటి: చిత్రం కథ. దీనినే 'చిత్తరువు' అని వ్యవహరించడం కూడా వుంది. ప్రధాన పాత్రలు నారాయణరావు, కృష్ణమూర్తి, రుక్మిణి - కాక, ప్రధాన పాత్రగా నారాయణరావు మొదటి భార్య (దివంగతురాలు) చిత్తరువు (పెయింటింగ్) దీనికి నారాయణరావు పెట్టుకున్న ముద్దుపేరు 'మోహిని'.

నారాయణరావు యూరపుదేశాలలో కూడా వ్యాపార సంబంధాలున్న రత్నాల వ్యాపారి. ఈతని భార్య ముగ్ధ వయస్సులోనే అకాల మరణం పాలుకాగా, చాలా కాలం మళ్లీ పెళ్లి చేసుకోకుండా వుండి పోయాడు. చనిపోయిన భార్య చిత్తరువును బొంబాయిలో ఒక చిత్రకారుడి చేత వేయించి ఇంట్లో ప్రముఖంగా పెట్టుకుని, ప్రతిరోజూ ఆ చిత్రంలోని భార్యతో మాట్లాడుతూంటాడు. ఆమె సజీవ వ్యక్తిలాగే తనతో ప్రతిస్పందిస్తోందనే నిశ్చితాభిప్రాయంతో వుంటాడు.

కొంతకాలానికి అతను 'రుక్మిణి' అనే రూపవతి, విద్యావతి అయిన అమ్మాయిని - ఆధునికత ఎరిగిన యువతిని- జాగ్రత్తగా చూసుకుని ఆర్భాటాలేమీ లేకుండా పెళ్లిచేసుకుంటాడు. ఆమెను వివాహం చేసుకోవడానికి ముందు 'చిత్తరువు'తో సంప్రదిస్తాడు కూడా-

రుక్మిణి, నారాయణరావు అన్యోన్యంగా ఎడబాటనేది ఎరగకుండా జీవితం గడుపుతూంటారు మద్రాసులో-

ఇలా వుండగా- నారాయణరావు, తన తండ్రి కాలం నాటి వ్యాపారపు ఏజెంట్ కొడుకు కృష్ణమూర్తిని ఆదుకోవలసివస్తుంది. కృష్ణమూర్తి మద్రాసులో కాలేజీ చదువుకు జేరి, నారాయణ రావు భవంతిలోనే ఒక గదిలో వుంటూంటాడు. అతను వినయసంపన్నుడు. మంచిగాయకుడు. నారాయణరావు మీద కృతజ్ఞత కలవాడు. ఒకసారి నారాయణరావు ఫ్రాన్సు దేశం వెళ్లవలసి

వస్తుంది. రుక్మిణిని తీసుకు వెడదామనుకున్నాడు కాని కారణాంతరాల వల్ల ఆమెను వదిలి, దాదాపు మూడు నెలలు ఫ్రాన్సులో ఉండిపోవలసి వస్తుంది.

రుక్మిణి చదువు, చలాకీ తనం వున్నది కావడం వల్ల నారాయణ రావు లేకుండా కాలం గడవడం కష్టమైపోయింది. చాలా అనూహ్య పరిస్థితుల్లో కృష్ణమూర్తికి, శారీరకంగా దగ్గరైంది. కాగల కార్యం గడిచాక కృష్ణమూర్తికి ఒక విధంగా, రుక్మిణి కొక విధంగా పశ్చాత్తాపం ప్రారంభమైంది.

నారాయణరావు వచ్చేశాక, తన 'చిత్తరువు' లోని మోహిని ముఖంలో ఏదో మార్పు గమనించాడు. కొంత కాలం గడిచేసరికి రుక్మిణీ తన లోపల పెరిగిపోయే ఆరాటం భరించలేక - నారాయణరావు పాదాలపై పడి - జరిగిందంతా చెప్పేసింది. సెలవులకు తనవూరి కెళ్లిన కృష్ణమూర్తి కూడా, లోపలి బాధ భరించలేక - నారాయణరావు కొకటి, రుక్మిణి కొకటి ఉత్తరాలు రాశాడు.

రుక్మిణికి వచ్చిన ఉత్తరం నారాయణరావు, అతనికి వచ్చిన ఉత్తరం రుక్మిణి చూశారు కూడా.

నారాయణరావు మనస్సు కల్లోలంనుంచి తేరుకుంది. రెండు ఉత్తరాలు కాల్చివేసి "గతానికి తెర" వేసి రుక్మిణితో యథావిధంగా కాపురం కొనసాగించాలని నిర్ణయించుకున్నాడు. దీనితో చిత్తరువులో మోహిని రూపం హర్షించినట్టు అతనికి తోచింది. Adultury కి సంబంధించిన యీ కథను, శాస్త్రి గారు ఎంతో సంయమనంతో, సంస్కారంతో, స్త్రీపురుష సంబంధాలను ప్రోది చేసే ఉద్రేకాల అవగాహనతో రాశారు.

రెండు: 'లక్ష్మి" కథ - "ఈ జాతి స్వతంత్ర రచనలకు ఇదే ప్రథమమని చెప్పవచ్చును" అని శాస్త్రి గారే రాసుకున్నారు. ఇవాళ ఒక కథగా చూస్తే, ఇది చాలా సామాన్యంగా కనిపించవచ్చును. 1923 ముందునాటికి ఇది విలక్షణమైన కథ. ఆ కాలంలో కట్టు బాట్లమధ్య, పెంపకపు తీరులో, వికసించిన మనస్సుల సంయోగంలో, కుటుంబాలలో బంధుత్వాలున్నా - కొనసాగని, ఫలించని, మగ - ఆడ, పిల్లల "గూఢ ప్రేమ"ను విపులంగా చిత్రిస్తుందీ కథ. ప్రకాశరావు అనే మనిషికి వేలువిడిచిన మేనమామ కూతురు లక్ష్మి. ఇతనికంటె వయస్సులో రెండేళ్లు పెద్దకూడా. అయినా - బాల్యంనించీ వాళ్లిద్దరి మధ్య పెరుగుతూ వచ్చిన ప్రేమ, ఈ ప్రేమకు విఘాతంగా వెంకట్రామయ్యతో లక్ష్మి పెళ్లి, ప్రకాశరావు కలకత్తా చదువు .... పెళ్లి ..... చివరికి వయస్సు మళ్లి, జుట్టు తెలుపు తిరిగే సమయానికి గాని వారిద్దరి మనస్సులూ బయటపడని స్థితీ, చివరికి ప్రకాశరావు తెగించి లక్ష్మి పట్ల తన గాఢప్రేమ వెల్లడి చేయగా ఆమె తన ప్రేమను కూడా, దాచకుండా వెల్లడి చేసి - తన పరిస్థితి తెలియజెప్పినవైనం, .... ఉపేక్షించదగినవి కావు.

రాయప్రోలు సుబ్బారావుగారు ''అమలిన ప్రేమ'' సిద్ధాంతానికి వివరణ ప్రాయంగా 'లక్ష్మి' కథ నిలుస్తుంది.

రాయప్రోలు వారు 'తృణకంకణం'లో చెప్పినట్టు:

**మనసుచే, వాక్కుచేత, కర్మంబుచేత**
**కలుషితములు కాదగినవీ వలపులవని,**
**తపసుచే, తాల్మిచే, ధ్యానధారచేత**
**లీనమై యైక్య మీయ జాలినది ప్రేమ....**

అని సరిపెట్టుకోవడం తప్ప ఇటువంటి బాధితులకు మరోదారి లేదు.

మూడు: భిక్షువు కథ. ఇది, ఒక పోలీసు ఇన్స్పెక్టర్‌కి మన్నెం అడవుల్లో ఒక కోయపిల్ల పరిచయం కావడానికి సంబంధించిన కథ. ఆమె సాన్నిధ్యాన్ని, ప్రేమను తిరస్కరించినందుకు ఆ ఇన్స్పెక్టర్ మీద ఆ పిల్ల ప్రయోగించిన ఒక మూలిక కారణంగా, ''విచిత్రరోగం'' (కుష్ఠురోగం వంటిది) పాలబడి, శిథిలమైన మనిషిగా మారిన ఇన్స్పెక్టర్ కథ. శాస్త్రిగారీ కథను Flashback పద్ధతిలో ఉత్కంఠకలిగేలాగ చెప్పారు. ఆ రోగికి ఉపశమన వాక్యాలతో కథ ముగుస్తుంది.

నాలుగు: శిల్పిద్వయంకథ. ఒక చిత్ర కారుడు (శ్రీనివాసరావు) ఒక కవి (శంకరరావు) సత్యవతి అనే అమ్మాయిని ప్రేమించినకథ. పెళ్లి చేసుకున్న శ్రీనివాసరావు నిరాదరణ చూపించగా, ఒకదశలో తన కవిత్వంద్వారా భక్తుడై మిగిలిన శంకరరావును ఆశ్రయించబోయి - దారుణంగా భంగపడింది సత్యవతి. శ్రీనివాసరావు, శంకరరావు మాత్రం, 'సత్యవతి' అనే సాధారణ స్త్రీని మించి, ఒక ''మూర్తి'' ని ఆరాధించడం తమ కళలకు సార్థకత అని నమ్మి ''ఒక నూతన యుగం'' స్థాపించారు. స్త్రీలో ''కళామూర్తిని ఆరాధించడ''మనే చిత్తవృత్తిని చిత్రించిన కథ ఇది.

హాస్యకథల్లో జన్మనక్షత్రఫలం, బండసుబ్బడు, గాజుపాలెం గాంధీ, చెప్పుకోదగినవి.

మొక్కపాటి నరసింహశాస్త్రి గారి రచనలు చదివితే ఆయన Humanist అని మన కర్థమవుతుంది. ఆధ్యాత్మికత, దేశభక్తి తనలో నిగూఢంగా వున్న వ్యక్తి శాస్త్రిగారు.

''సాహితీ సమితి'' సభ్యుల్లో తల్లావఝుల, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, వంటి వారిలాగే Lust for Life సూత్రం విడిచిపెట్టలేదనుకుంటాను.

1969 డిసెంబరు ప్రాంతంలోనే అనుకుంటాను, నరసింహశాస్త్రి గారు 'సాహితీ సమితి' స్వర్ణోత్సవాన్ని - అట్టహాసం లేకుండా - అప్పటికి మిగిలిన 'సాహితీసమితి' వృద్ధసభ్యులతో, అభిమానులతో - విజయవాడలోని పున్నమ్మతోట కల్చర్‌క్లబ్ సహకారంతో - విజయవాడలోనే

గాంధీ నగరం హైస్కూలులో నిర్వహించారు. అప్పట్లో ఆయనతో ఇంటర్వ్యూ చేసి, సాహితీ సమితి గురించి ఆంధ్రజ్యోతి దిన పత్రికలో వ్యాసం రాశాను. సాహితీ సమితి Emblem గా "లేపాక్షి హంస" వాడే వారు, తొలినుంచి - వారి చిరునామాలు కూడా - తల్లావఝులవారు, ఒంగోలు, నోరివారు, రేపల్లె, మొక్కపాటివారు, పిఠాపురం అనే వుండేవి.

ఆధునిక సాహిత్యయుగంలో - ముఖ్యంగా వచన సాహిత్యానికి - పరువూ, బరువూ చేకూర్చిన ఆదిగురువుల్లో నిస్సందేహంగా 'మొక్కపాటి' వారొకరు -

శ్రీ శాస్త్రిగారు 1892 అక్టోబరు తొమ్మిదో తేదీన పుట్టారు. 1973 మార్చి నెలలో అస్తమించారు. వారు సుకృతి, హాస్యరససిద్ధులు. కనకనే వారి యశః కాయానికి జరామరణ భయం లేదు.

అనుబంధం:

బారిష్టర్ పార్వతీశం నవలలో కొన్ని హాస్యసన్నివేశాలు-

*1. పార్వతీశం మార్సెల్సు నగరంలో ఒక పెద్దహోటల్లో గది తీసుకున్న ఘట్టం-*

బంట్రోతు నా సామాను తీసుకువెళ్లి అక్కడొక చిన్నగదిలో పెట్టాడు. ఆ గది ముందు ఇనుపకటకటాల తలుపులు ముడవడానికి వీలుగా వుండేవి వున్నాయి. గది బొత్తిగా చిన్నదిగా వున్నది. అందులో ఒక చిన్న బల్ల వున్నది. ఇంత చిన్న గదిలో వుండడమెలాగు? అనుకున్నాను. మంచము వేసుకోవడానికి స్థలము లేదు సరిగదా, బల్లమీద పడుకుందామనుకున్నాను పొడుగు సరిపోయేటట్టు లేదు. గదిలో మట్టుకు దీపము వెలిగించారు. గాలి రావడానికి ఎక్కడా కిటికీ అయినా కనపడలేదు. ఇంత పెద్ద హోటలులో ఇంత చిన్నగదులేమిటా అనుకున్నాను. అన్నీ ఇలాగే వుంటే తక్కిన వాళ్లంతా ఎలావుంటారా? అనిపించింది. ఒకవేళ నన్ను చూచి లోకువకట్టి ఇంకొకళ్లకు పనికిరాని గది నాకు ఇచ్చాడేమో అనుకున్నాను. నా తక్కువ మట్టుకేమిటి? ఈ గదిలోకి వెళ్లకూడదనుకున్నాను. సామాను అందులో పెట్టి, బంట్రోతు రమ్మన్నాడు. నేను రాను అన్నాను. రమ్మని ఊరికే సంజ్ఞ చేయడము మొదలుపెట్టాడు. వారి భాష నాకేమీ తెలియడములేదు. ఏమయినాసరే, నేను రాను అని గట్టిగా చెప్పాను. వాడికేమీ అర్థము కాక వెర్రిమొహము వేసుకుని గుమాస్తా కూడా లోపలికి వెళ్లమన్నాడు. ఈ గది అయితే నాకక్కరలేదు. ఇంకొక హోటలుకు వెళుతాను అన్నాను. వచ్చీరాని ఇంగ్లీషులో నన్ను లోపలకు దయచేయమన్నాడు. ఆ హోటలులోకి వచ్చిన వాళ్లు యెవళ్లో దొరలూ, దొరసానులూ, నన్ను చూసి నవ్వడం మొదలుపెట్టారు. నాకా గది అక్కరలేదు. నా సామాను ఇవతల పడవేయమని మళ్లీ చెప్పాను గుమాస్తాతో. ఇంక వాదించి లాభము లేదనుకున్నాడు కాబోలు, నన్ను చేయి పట్టుకుని బలవంతంగా గదిలోకి తీసుకువెళ్లి తలుపు వేశాడు. వేసీవేయడంతో గదికి గదీ హఠాత్తుగా అంతరిక్ష మార్గము లోకి ఎగిరిపోయింది. నేను హడలిపోయి, కెవ్వుమన్నాను.

ఇంతట్లోకే గది ఆగింది. బంట్రోతు తలుపు తీసి, బయటికి నడవమన్నాడు. ఇదేమీ నాకర్థం కాలేదు. ఇంకా ఏమి వింతలు జరగుతాయో అనుకుని ఆశ్చర్యపోతూ ఇవతలికి వచ్చాను. బంట్రోతు సామాను తీసుకుని తనతోటి రమ్మని తిన్నగా ఒకగదిలోకి తీసుకువెళ్లి, ప్రవేశపెట్టాడు. అప్పటికి ప్రాణము కుదుటపడ్డది. ఇందాకటిది, మేడ శ్రమ లేకుండా ఎక్కడానికి ఉపాయము గదా! అని తెలుసుకున్నాను. నన్ను చూసి, వాళ్లంతా ఎంత నవ్వుకున్నారోగదా! అని సిగ్గుపడ్డాను.

*2. థామస్ కుక్ అండ్ కంపెనీ మనిషి , పార్వతీశాన్ని లండన్ రైలు స్టేషనులో రైలునుంచి దించగానే, - పార్వతీశం తొలి ఆశ్చర్యమిది-*

బయటకు (రైలునుంచి) రావడముతోనే నాలుగు వైపులా ఆశ్చర్యముతో చూశాను. నేను మద్రాసు లాంటి స్టేషన్లు చాలా చూచానుగాని, ఇంత పెద్దస్టేషను నాకెక్కడా కనబడలేదు. ఇది కొన్ని మైళ్లు పొడుగుంటుందా, అనిపించింది. అధమం ఒక మైలేనా వెడల్పు ఉండాలనుకున్నాను. ఇందాక, రైలు, స్టేషనుకు కాక ఇంట్లోకి వెడుతోంది అనిపించడానికి కారణం, ఇప్పుడు తెలిసింది. ఇంత వెడల్పూ, పొడుగు, ఉన్న స్టేషను అంతటికీ గాజుకప్పు, పైభాగాన కనిపించింది. ఇంతగాజు ఎలాదొరికిందా? వీళ్లకు, అనుకున్నాను. అసలుగాజెందుకు వేశారు? అనే సందేహం కూడా కలిగింది. ఒకవేళ ఏ కొబ్బరికాయేనా దానిమీద పడితేనో, లేక, పక్కింటివాళ్ల కుర్రాళ్లెవళ్లయినా, ఆటల్లో లక్కపిడతలో, పెంకు ముక్కలో, దానిమీద విసురుతేనో, ఇంత స్టేషనూ ఏమవుతుందనిపించింది. అయినా, దానికి సమాధానం ఏదో మనమే ఊహించుకు తెలుసుకోవాలి గాని, ఇలాటి మోటు మనుషులను అడుగుతే వాళ్లు అతితెలివిగా మాట్లాడామనుకొని, నన్ను అవహేళన చేస్తారు. ఎందుకొచ్చినదీ బాధ! ఇంతకూ స్టేషను కప్పు ఎలాపోతే నాకెందుకు? అని అప్పటికి సమాధానం చెప్పుకున్నాను.

*3. పార్వతీశం ఎడింబరోలో చదువుకునే రోజుల్లో తొలి ప్రపంచ యుద్ధం జరిగింది. అప్పట్లో ఒకరాత్రి జరిగిన తమాషా-*

..... సుమారు తొమ్మిది గంటల వేళప్పుడు జనం రోడ్లమీద తిరుగుతూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ ప్రేమికులు ఆలింగనం చేసుకుంటూ, ముద్దుపెట్టుకునే సమయంలో శత్రు విమానాలు వచ్చే సూచన భయంకరంగా సైరను కూత వినపడ్డది. రోడ్డులో జనం తొందర తొందరగా గృహోన్ముఖులయ్యారు. ప్రేమికులు భయభ్రాంతచిత్తులై ఆలింగనములను వీడలేక ఉత్తర క్షణంలో ఏమౌతామో అన్నట్లు మరీ దగ్గరగా ఒకరిలో ఒకరు కలిసిపోతున్నారు. ఆ క్షణంలో ఒక మేడమీద నుంచి కిటికీ తలుపు గభాలున తెరిచి, ఒక వృద్ధ పురుష శిరస్సు కిటికీలోంచి ఇవతలకి వచ్చి ఏమర్రా, మీకు బుద్ధుందా లేదా? త్వరగా ఇంటికి చావకపోతే ఇక్కడే చచ్చూరుకుంటారు. బ్రతికి బాగుంటే ఈ కౌగిలింతలు అప్పుడే పునఃప్రారంభించవచ్చు. తెలిసిందా? వినబడుతోందా? అని కేకవేశాడు. ఆ కిటికీ సమీపంలోనే

రోడ్డు మీద తన ప్రియురాలిని కౌగిలించుకున్న ప్రేమికుడు. కౌగిలి పట్టువిడవకుండానే పైకి చూచి "తాతగారూ దయచేసి మీ తలకాయ లోపలికి లాక్కోండి లేకపోతే మీ బట్టతలమీద పడుతున్న చంద్రకిరణాలు పరావర్తనమై, విమానాలకు మార్గదర్శకం కాగలదు" అన్నాడు. దారిన పోతున్న వాళ్లూ, సమీపంలో నిలబడివున్న ఇతర ప్రేమికులూ, విరగబడి ఒకటే నువ్వు. ఆయనకు విపరీతమైన ఆగ్రహం వచ్చి "నే వస్తున్నా ఉండండి మీ తెగులు కుదురుస్తాను. కావర మెక్కి ......" అని, తలలోపలికి తీసుకొని గభీమని కిటికీ మూశాడు. ఆయన నిజంగా కిందకు వచ్చి అల్లరి చేస్తాడేమోనని కొందరు యువతీయువకులు తొలగనారంభించారు. ఈ మాటాడిన యువకుని బాహుబంధాలలో ఇమిడి యున్న కన్య "ఏడిసినట్టే వుంది, నీ తెలివి తేటలు. రా అవతలకిపోదాం! ఆయన వచ్చాడంటే, ఆయన మనదుంపతెంపుతాడు. ఆయన మా నాన్న అన్న సంగతి నీవు గమనించినట్టు లేదు" అన్నది. ఆ మాటతో హడలిపోయి "బాబోయ్ రా త్వరగా ఏమిటంత నెమ్మదిగా అడుగువేస్తావేం" అని - ఆ కన్యక రెక్కను పట్టుకొని, దడదడా దౌడు తీశాడు. ఇదంతా మావీధి గుమ్మంలో నుంచుని ఆనందిస్తూ లోపలికెవెళ్లడం మరిచేసరికి, మా యజమానురాలి కూతుళ్లిద్దరూ వచ్చి చెరో రెక్కాపట్టుకుని 'రండ'ని - లోపలికి లాక్కుపోయారు.

4. పార్వతీశం, ఇండియాకు తిరిగివచ్చి, పెళ్లిచేసుకుని, లాయరు వృత్తిని, స్వాతంత్ర్యోద్యమ కాలంలో ప్రజల ఉరుకునీ, కోర్టులలో ఘట్టాలనీ విపులంగా చూసి చూసి - ఒక ఘట్టం ఉదాహరించాడు.

ఒక పెద్దముత్తైదువ అర్ధశతాబ్దం దాటిన వయస్సుగల ఆమెను ఈ ఉద్యమంలో యెంతో కృషి చేస్తున్నామెను అరెస్టుచేసి, కోర్టులో హాజరు పరిచారు. న్యాయాధికారి ఆమెను ఏప్రశ్న వేయకుండానే -

"ఈవిడ నెక్కడ నుండి తీసుకొచ్చారయ్యా! పొమ్మనండి అవతలికి - యింటికెళ్లి ఆవిడపనేదో చూసుకో మనండి. రాజకీయాల్లోకి అడుగు పెట్టవద్దని చెప్పండి. ఈ కోర్టులోకి ఇంక వస్తే మాటదక్కదనండి" అన్నాడు తీవ్రంగా-

వెంటనే ఆమె, రెప్పపాటు వ్యవధి కూడా లేకుండా ఏమీ తడుముకోకుండా-

"ఇంకొకరెవరో నాకు చెప్పడమెందుకూ? తమరు చెప్పిన మాటలే ఖంగున వినబడుతుంటేనూ! తమరు నాకు చెప్పమన్న మాటలే నేనూ తమతో చెబుదామనే వచ్చాను. నాకంతకంటే ఇక్కడ ఇంకో పనేం లేదు. అని గిర్రున వెనక్కితిరిగి మారు మాట లేకుండా బయటకు నడిచింది. పోలీసులు ఆవిడ వెంట పరుగెత్తారు.

న్యాయాధికారికి విపరీతమైన ఆగ్రహం వచ్చి ఆవిడను చావగొడదామన్నంత వుద్రేకంతో లేవబోతుంటే, కోర్టులో వున్న జనమంతా చప్పట్లు కొడుతుంటే తన హోదా జ్ఞప్తికి తెచ్చుకుని తలవంచుకొని తన స్థానంలో చతికిలపడ్డాడు...



# "భమిడిపాటి కామేశ్వరరావు రచనలలో హాస్యం"

శ్రీ నండూరిపార్థసారథి

నవ్వంటే ఏమిటి? హాస్యమంటే ఏమిటి? ఆరెండింటికీ గల సంబంధం ఏమిటి? హాస్యం అంటే నవ్వు పుట్టించేది. హాస్యం అంటే కర్మ. నవ్వు దాని తాలూకు ఫలం. హాస్యం అనేది నవ్వించి తీరాలి. నవ్వించకపోతే అది హాస్యం కాదు. నవ్వించడానికి ప్రయత్నించి నవ్వించలేకపోయిన 'హాస్యం' నవ్వులపాలవుతుంది.

హాస్యం సాహిత్యంలో ఉండవచ్చు. అభినయంలోనూ ఉండవచ్చు. అభినయం అంటే- సాత్వికం, ఆంగికం, వాచికం, ఆహార్యం కూడాను. మాటాపలుకూ లేకుండా, ఒళ్ళుకదలకుండా, కేవలం ముఖంలో హావభావాలతో హాస్యాన్ని సృష్టించవచ్చు-అది సాత్వికం. ముఖంలో భావప్రదర్శన చేయకుండా వట్టి శారీరక చేష్టలతో హాస్యసృష్టి చేయవచ్చు-అది ఆంగికం. సాత్విక, ఆంగికాలతో నిమిత్తం లేకుండా మాటలతో నవ్వించవచ్చు-అది వాచకం. ఈ మూడింటి అవసరం లేకుండా విచిత్రమైన, వికృతమైన వేషంతో కూడా నవ్వించవచ్చు- సర్కస్‌లో బఫూన్‌లాగా. అది ఆహార్యాభినయం. ఈ చతుర్విధాభినయాలలో ఏ ఒక్కదానిద్వారాగాని, రెండింటి ద్వారాగాని, మూడింటి ద్వారాగాని, నాలుగింటి ద్వారా గాని హాస్యాన్ని పండించవచ్చు.

హాస్యం అనేది నవ్వించి తీరాలన్నమాట నిజమేగాని, నవ్వించే ప్రతిదీ హాస్యం కానక్కర్లేదు. మనల్ని నవ్వించడానికి ప్రత్యేకంగా ఎవరూ ప్రయత్నించకపోయినా అనేక వేరే కారణాల వల్ల నవ్వురావచ్చు. అరటిపండు తొక్కమీద కాలువేసి జారిపడిన వాడిని చూసినప్పుడు అసంకల్పిత ప్రతీకారచర్యగా నవ్వురావచ్చు. అలా నవ్వడంతో దురుద్దేశమేమీ ఉండదు. నవ్వినవెంటనే పశ్చాత్తాపం కలగవచ్చు. "అయ్యో అతను జారిపడితే జాలిపడడానికి బదులు నేను నవ్వడం ఏమిటీ బుద్ధిలేక" అనుకోవచ్చు. పడినవాడు రౌడీ అయితే నవ్వినందుకు పశ్చాత్తాపం కలగదు. "తిక్కకుదిరింది వెధవకి" అనుకుంటాం. పడినవాడు మంచి వాడైనా, చెడ్డవాడైనా మన నవ్వుకు కారణమైనవాడు కాబట్టి అతడిని హాస్యగాడు అనడానికి వీల్లేదు. నాటకంలోనో, సినిమాలోనో, సర్కస్‌లోనో మనల్ని నవ్వించడం కోసమే ఎవడైనా అలా జారిపడితే అతడిని హాస్యగాడనీ, ఆ చేష్టను హాస్యమనీ అనుకోవచ్చు. ఒక్కోసారి అది చౌకబారుగా ఉండవచ్చు. అది వేరే సంగతి. హాస్యంతో ఏ మాత్రం సంబంధంలేని నవ్వులెన్నో ఉన్నాయి. తెలిసినవాళ్ళు కనిపిస్తే నవ్వుతూ పలకరిస్తాము. సంతోషం కలిగినప్పుడు నవ్వుతాము. పసిపిల్లల్ని ముద్దులాడుతూ నవ్వుతాము.

ఎవరైనా చక్కిలిగింత పెడితే నవ్వుతాము. ఈ నవ్వులన్నింటినీ హాస్యం ఎక్కౌంట్‌లో జమచేయడం సమంజసం కాదు.

ఇప్పుడింక ప్రస్తుత విషయానికొద్దాం. అది భమిడిపాటి కామేశ్వరరావు గారి హాస్యం. దాన్ని గురించి చెప్పుకుందాం. నవ్వుల గురించి 'భకారా' గారి అభిప్రాయాలను తెలుసుకోడానికి ఆయన సాహిత్యాన్నంతా మథించి, హాస్యసందర్భాలను ఏరి, వర్గీకరించి, విశ్లేషించవలసిన శ్రమలేకుండా స్వయంగా ఆయనే 'నవ్వు' అనే శీర్షికతో ఒక చక్కని వ్యాసం రాశాడు. పద్దెనిమ్మి పేజీల వ్యాసం అది. అందులోని కొన్ని వాక్యాలు.

"మానవుడికి మాత్రమే నవ్వేశక్తి ఉంటూ! మానవేతరానికి ఆ ప్రజ్ఞలేదు". నవ్వేహక్కు మానవుడికి పుట్టుకతో ఉండేదికాదు. పుట్టీపుట్టడంతో ఎవరి తరిఫీయతూలేకుండానే జీవుడు నేర్చి ఉండేది ఏడుపేగాని నవ్వుకాదు. నవ్వు అనేది జీవుడు తోడి మానవుల దగ్గర్నించి నేర్చుకున్న బాపతు. నవ్వు అనేది అంటుడు, దినుసు అవడం వల్లా, అనుకరణ సాధ్యం అవడం వల్లా, పసిబాలుడికి సైతం అలవడుతుంది. మరొకటి, దేన్నిగురించి మానవుడు నవ్వడం? అంటే, మానవ వ్యాపారాలు గురించే. అనగా, నవ్వేది, నవ్వబడేదీ కూడా మానవుడే. రాళ్ళూ-రప్పలూ, చెట్లూ, జంతువులూ మొదలైన మానవేతర ప్రకృతిని గురించి నవ్వడం వ్యర్థం గనక మానవుడు నవ్వడు. ఇంతేకాక మరో విషయం కూడా ఉంది. ఒంటరిగా ఉన్నప్పటికంటె విని తెలుసుకోగలిగిన మరో మానవుడు ఉన్నప్పుడే నవ్వు విజృభించడం. నవ్వు మానవసంఘు వ్యాపారం."

మనుషులు ఏఏ సందర్భాలలో ఎలా నవ్వుతారో, నవ్వుతూ ఎలాంటి వ్యాఖ్యలు చేస్తారో అవన్నీ వివరించాడు ఆయన. చిన్ననవ్వును ఆయన 'నవ్విక' అన్నాడు. నవల- నవలిక, కథ-కథానిక, నాటకం-నాటికలాగా నన్నమాట. " 'నవ్విక' బలిసి బరితెగి నవ్వు అయిందా, లేక నవ్వుజోరు తగ్గి సాధువై 'నవ్విక' అయిందా అనేది మీమాంసిక" అంటాడు ఆయన. 'మీమాంసిక' అంటే చిన్నమీమాంస అన్నమాట. ఇలాంటి వాక్చమత్కృతులు భకారా గారి రచనల్లో కొల్లలు.

"...జీవితంలో హాస్యాస్పదంగా ఉండే సందర్భాలలో తనివితీరా నవ్వుకోడానికి జాలిమనసు' ఒప్పుకోదు. ఎందుచేతంటే, ఆ సందర్భాలలో చిక్కడిఉన్న వ్యక్తులకి మాత్రం ఏ కొంత వరకో బాధా, హానీ, కష్టం, నష్టం లాంటివి కలుగుతూండడం స్ఫురణకి రావడం చేత. కాని, పదరచనలు గల గ్రంథాలు చదివినప్పుడుగాని, విన్నప్పుడుగాని, వాటితోపాటు స్వర, రేఖా, చేష్టారచనలైనా సరే ప్రదర్శించగా గమనించినప్పుడుగాని-రచన అనేది కాల్పనికం గనక- ఏ వ్యక్తీనిజంగా బాధపడడం అనేది (తనకి అన్వయించుకుంటే తప్ప) అక్కడ లేకపోవడంవల్ల; ఏ విధమైన బాధా ఎవ్వరికీలేని నవ్వుకలగవచ్చు" అన్నారు భకారా.

నవ్వులలో కొన్ని రకాలను ఆయన పేర్కొన్నాడు. అవి-చిరునవ్వు, సకిలింపు, ఇకిలింపు. ముసిముసినవ్వు, మూగనవ్వు, గుడ్డినవ్వు, పకపక, వెకవెక, అట్టహాసం మొదలైనవి. రకరకాల నవ్వులకు శాస్త్రజ్ఞులు పెట్టిన పేర్ల జాబితా కూడా ఆయన ఇచ్చాడు. అవి స్మితం (కనుబొమ్మలెత్తి కళ్ళు విప్పడం) హసితం (పళ్ళు బయటపడేట్టు చేసి, పెదిమల్ని కళ్ళెంవెనక్కిలాగినట్లు ఆకర్ణాంతం లాగిపట్టి ఉంచడం), విహసితం (చల్లని శబ్దం చెయ్యడం), ఉపహసితం (తలకూడా ఝూడించడం), అపహసితం (విరగబడి పక్కలు పట్టుకుని గిలగిలలాడి మెలికలు తిరిగి దొర్లి పెద్దఏడుపులోలాగ నానా యిదీ అవడం). ఇవికాక మరికొన్ని రకాలు ఉన్నాయంటూ ఆయన ఇంకో లిస్టు ఇచ్చాడు. అవి: తలకాయనవ్వు (తలమాత్రం తెగఝూడిస్తూ వంచేసి కళ్ళు మూసుకుని నవ్వడం); లయధాటినవ్వు (తాళంవెయ్యడానికి వీలైఉండేది); తుపాకినవ్వు (పెదిమలు బద్దలు చేసుకుని ఠప్పున బయల్దేరేది); కొనవూపిరినవ్వు (గుక్కతిరగని సమయం దాకా మాట్లాడి అప్పుడు మాటాతెమలకుండా నవ్వూరాకుండా నవ్వడం); కోతినవ్వు (నవ్వేమో అని ఇతరులు భ్రమించేది); దాగుడు ముచ్చినవ్వు (అధికారి ఎవరేనా కనిపెడతాడేమో అనే భయం చొప్పున ఆపేసుగోడానికి ప్రయత్నించేటప్పది); డోకునవ్వు, దగ్గునవ్వు, కొలిమితిత్తినవ్వు, గూడ్సుబండి నవ్వు. వీటన్నింటి తర్వాత ఆయన విషపునవ్వును చెప్పాడు. అది 'నవ్వుజాతిలో చెడబుట్టి, లోపలి ఏడుపుని ఓ పక్కనించే వెళ్ళగక్కేది' అని ఆయన చెప్పాడు.

నవ్వు గురించి భకారా ఇంకా చాలా విషయాలు చెప్పారు. అవన్నీ ఏకరువుపెడితే ఈ ప్రసంగం అధికమైపోయే ప్రమాదం ఉన్నది. అయినా, ఆ వ్యాసంలోని చివరి భాగాన్ని ఉటంకించక తప్పదు;

"నవ్వతగ్గ సందర్భాలకంటే నవ్వకూడని సందర్భాలు కూడా ఎక్కువ జ్ఞాపకం ఉంచుకోతగ్గవని ఒక జ్ఞాని అంటాడు- ప్రకృతివల్ల వచ్చిన స్థితికి నవ్వవద్దంటాడు. అనగా, గుడ్డీ, కుంటీ, నత్తీ, చెవిటి, అవిటి వాళ్ళస్థితిని గురించీ, మృతుడైనవాణ్ణి గురించీ, అక్కడలేనివాణ్ణి గురించి, అన్యత్వారోపణచేసి ఉన్నవాణ్ణి గురించీ నవ్వకూడదంటాడు. 'భగవంతుడిమాట' అని మనం అనుకునేదాన్ని గురించి నవ్వరాదంటాడు. ఇంకా దీనులూ, హీనులూ, అర్భకులూ, వృద్ధులూ పరదేశులూ, అపరిచితులూ, వికలాంగులూ, దరిద్రులూ, అజ్ఞానులూ, పరాజితులూ-వీళ్ళని కూడా హాస్యలక్ష్యం చెయ్యడం మానుషంకాదంటాడు.

"మానవుడు ఇతరుల్ని గురించి నవ్వడంలో అహంకారమమకారాలవల్లపుట్టే ఈర్ష్యాకుత్సితాలు ఉండితీరతాయి. ఎంతసవ్యమైన నవ్వులోనేనా ఏ కొంచెమో అవి తప్పవు. వాటిని అల్పతమంచేసి, కరుణకి ఏమాత్రం జాగాలేని పట్టుచూసి, అసభ్యతలోపడి నవ్వుయొక్క ముఖ్యలక్షణాన్ని బలెయ్యక, తాత్కాలికోపయోగం కోసంకాక, దూషణేగమ్యంగాపెట్టుకోక, వ్యక్తుల్నిమరిచి, సంగతి వీలైనంత తనమీద పెట్టుకుని, మోతాదుమీరక, శ్రుతితప్పక, స్థాయిచెడక, మర్యాద మరవక ఉండే స్వారస్యంవల్ల జనించే నవ్వే సవ్యమైన నవ్వు."

" 'నవ్వు' నవ్వుఅనేది బలవంతపెట్టి మొహమాటపెట్టి చావగొట్టినారాదు. బయల్దేరిన తర్వాత ఆగమన్నాఆగదు" అని మరో మంచిముక్క అన్నారు భకారా ఆవ్యాసంలోనే ఇంకోచోట.

★ ★ ★

కామేశ్వరరావుగారు 1897లో పశ్చిమగోదావరిజిల్లా ఆకివీడు గ్రామంలో ఒకపేద కుటుంబంలో జన్మించారు. కాలేజీచదువుకు డబ్బులేక చాలాఇబ్బందిపడ్డారు. ఎలాగో ఎఫ్.ఏ దాకా లాక్కొచ్చారు. తర్వాత బి.ఏ. చదివేస్తోమత లేక విచారిస్తూవుండగా అదృష్టవశాత్తూ ఆయనకు ఒక స్కాలర్‌షిప్ లభించింది. 1915 నాటి సంగతి అది. ఆంధ్రదేశంలో ప్రప్రథమంగా ఆ సంవత్సరం రాజమండ్రిలో నాటకపోటీలు నిర్వహించారు. టిక్కెట్లద్వారా వసూలైన ధనంలో ఖర్చులు పోనూ మిగిలిన 700 రూపాయల ధనాన్ని అన్ని విధాలాయోగ్యుడైన ఒక పేద విద్యార్థి కాలేజీచదువుకు సహాయంగా యివ్వాలని నిర్వాహకులు నిర్ణయించారు. ఆ సొమ్ము కామేశ్వరరావుగారికి దక్కింది. ఆ డబ్బుతో ఆయన రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో చేరి బి.ఏ చదివారు. తర్వాత ఎల్.టి కూడా పూర్తిచేసి ఉపాధ్యాయ వృత్తిని చేపట్టారు. రాజమండ్రి వీరేశలింగోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా 1953లో ఉద్యోగవిరమణ చేశారు. నాటక ప్రదర్శనలద్వారా తనచదువుకు డబ్బు లభించింది కనుక నాటకాలు రాయడంద్వారా నాటకరంగం ఋణం తీర్చుకోవాలని ఆయన నిర్ణయించుకొన్నారు. వ్యాసాలు, కథలవంటి రచనలెన్నిచేసినా నాటకరచయితగానే ఆయనకు ఎక్కువపేరువచ్చింది. ఆయన రచనా వ్యాసంగం సుమారుగా 1920 ప్రాంతంలో ప్రారంభమైనాలుగు దశాబ్దాలు సాగింది. ఆయన రచించిన నాటకాలు, నాటికలు, కథలు, చిన్న, పెద్ద వ్యాసాలు, సంభాషణలు, ప్రశంసలు 'త్యాగరాజు ఆత్మవిచారం', 'ఆంధ్రనాటక పద్యపఠనం', భాసమహాకవి సంస్కృత నాటకాలకు అనూదాలు, టాల్‌స్టాయ్ కథలు. ఈసప్ కథలు-అన్నీ సుమారు 30సంపుటాలుగా వెలువడినాయి. ఇష్టం లేకపోయినా మొహమాటానికి పోయి హెచ్.ఎంరెడ్డిగారి.'నిర్దోషి' చిత్రానికి ఆయన స్క్రిప్ట్ రాశారు. కాని, రెడ్డిగారి ధోరణి నచ్చకపోవడంతో టైటిల్స్‌లో తనపేరు వేయడానికి ఆయన ఒప్పుకోలేదు. తనకి యివ్వజూపిన డబ్బును కూడా ఆయన తనతో కలిసిపనిచేసిన శ్రీశ్రీకి ఇప్పించారు. (ఆయన కుమారుడు భమిడిపాటి రాధాకృష్ణ ఒక వ్యాసంలో ఈ సంగతి వెల్లడించారు.)

కామేశ్వరరావుగారు, హాస్యమే రాస్తాననీ, హాస్యం తప్పమరేదీ రాయననీ ప్రమాణం చేసి మరీరచనావ్యవసాయంలోకి దిగారేమోననిపిస్తుంది. అనువాదరచనలు తప్ప మిగిలిన ఆయన సొంతరచలన్నింటిలోనూ అంతో యింతో హాస్యధోరణికనిపిస్తుంది. వాక్చమత్కృతి, వేళాకోళం, వెక్కిరింత, వెటకారం ఆయన హాస్యంలోని ప్రధానమైన దినుసులు. విశుద్ధ హాస్యం(Pure humour), వ్యంగ్యం అసలు లేకపోలేదుగాని చాలా తక్కువ. హాస్యం, వ్యంగ్యం, వెటకారం-

యివి వేరే వేరే విషయాలు. హాస్యంలో వ్యంగ్యం ఉండనవసరం లేదు. వ్యంగ్యంలో హాస్యమూ ఉండనవసరం లేదు. కాని, ఆ రెండూ తరచుగా ఎంతోకొంత నిష్పత్తిలో కలిసి వుంటాయి. అలాగే వ్యంగ్యం వేరు, వెటకారం వేరు. వ్యంగ్యంలో అవహేళన, లేదా అధిక్షేపణ నర్మగర్భంగా వుంటుంది. అంటే బాహ్యార్థం ఒకటి, అంతరార్థం వేరొకటి. బాహ్యార్థం వెనక అంతరార్థం ధ్వనిస్తూ వుంటుంది. వెటకారం అలాకాదు. దానికి ఒకటే అర్థం. అది దేనినీ దాచడానికి ప్రయత్నించదు. వెటకారానికి వాక్చమత్కృతులు తోడై భకారా వాక్యాలు మనల్ని నవ్విస్తాయి. ఆయన రచనల్లో వెటకారమైనా, చమత్కారమైనా మొత్తానికి కారం ఎక్కువ. ఆ రచనలకు గురైన వారికి కారం ఒక్కోసారి నసాళానికెక్కుతుంది.

ఆధునికాంధ్రహాస్యరచనలో కందుకూరి తర్వాత వచ్చిన మొదటితరంవారు గురజాడ, పానుగంటి, చిలకమర్తి. వారు హాస్యరచనలతో పాటు ఇతర రచనలుకూడా చాలాచేశారు. వారి తర్వాతి తరానికి చెందిన మొక్కపాటి, మునిమాణిక్యం, భమిడిపాటి ప్రధానంగా హాస్యరచనలే చేశారు. వారిని 'హాస్యరచయితలు' ముద్రవేయవచ్చు. వారు ఎవ్వరినీ అనుకరించలేదు. ఎవరిశైలివారికి ఉంది. కాని, వారిలో భమిడిపాటివారిశైలి మరీ ప్రత్యేకమైనది. నాలుగు వాక్యాలు చదవగానే ఇది భకారా శైలి అని స్పష్టంగా గుర్తించగలం.

ఆయన భాషలో ఏ మాత్రం గ్రాంథికవాసన కనిపించదు. పెద్ద మనిషితరహాగా ఉండదేమో ఇవాళ్టికీ మనం సంకోచించే మాదిరి భాష-రోజూ ఇంట్లో మాట్లాడుకొనే భాష-ఆయన 60,70 ఏళ్ళ కిందటే రాశారు. నోరు మాట్లాడుతుంటే నొసలు వెక్కిరిస్తున్నట్లుండే ఎకసెక్కెం, కొంటెతనం, తుంటరితనం, నాపసానితనం ఆయన రచనల్లో కనిపిస్తాయి. ఆకాలపు అచ్చమైన గోదావరి జిల్లా తెలుగు రాశారు ఆయన. అటువంటి భాష యిప్పటి రచనల్లో మనకు కనిపించదు. వార్తాపత్రికల్లో, సినిమాల్లో, నాటకాలలో, టీవీ కార్యక్రమాల్లో యిప్పుడు మనకు వినిపిస్తున్నదంతా 'సాచెట్స్'లో లభించే డైరీ పాలలాంటి 'హోమోజినైజ్డ్' సరుకు- ప్రాంతీయత ఏ మాత్రం కనిపించని' 'ప్రమాణీకృతక' భాష. ఆయన పుస్తకాలు చదువుతుంటే మరపున పడిపోతున్న మన బామ్మలు, తాతయ్యల మాటలు, ఆ కాలపు పలుకుబడులు జ్ఞాపకం వస్తాయి. అప్పటి సామాజిక వాతావరణంతో, అప్పటి మాట తీరుతో, అప్పటికట్టూబొట్టూతో మన సంబంధం పూర్తిగా మాసిపోకుండా కాపాడుకోవాలంటే అప్పుడప్పుడూ ఆ కాలపు పుస్తకాలు చదవడం అవసరం. ఆ కాలపు సినిమాలు చూడడం అవసరం-అవి చెత్తవైనాసరే.

మనుషుల్లోని స్వార్థాన్ని, సంకుచితత్వాన్ని, మూర్ఖత్వాన్ని, కాపట్యాన్ని ఎండగట్టడానికి వెటకారాన్ని ప్రయోగించడం మామూలే. కాని, అవసరం లేదనిపించే అతిసాధారణ సందర్భాలలో కూడా ఆయన అదే ధోరణిలో రాస్తారు. అది ఆయన సహజశైలి. ఇంకొక రకంగా ఆయన రాయలేరు. ఎక్కడా మాటలకోసం తడుముకోవడం కనిపించదు. నీళ్ళునమలడం, ఊకదంచడం

ఉండదు. చెప్పదలచిన దాన్ని కుండబద్దలుకొట్టినట్లు చెబుతారు. ఒక్క మాటలో చెప్పదగినదాన్ని స్పష్టతకోసం పదిమాటల్లో చెప్పడానికి సంకోచించరు. విచిత్రపదాలు, వికటపదబంధాలు అలవోకగా ఆయనకలంనుంచి దూసుకొస్తాయి.

ఆయన రచనాధోరణికి ఉదాహరణలుగా కొన్నిమచ్చుతునకలు చూద్దాం.

'మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?' అని వ్యాసం వుంది. అందులోని కొన్ని వాక్యాలు:

'... మేష్టరీవల్ల వల్ల దారిద్ర్యం అబ్బుతుందా? లేక దరిద్రుడైనా తరవాతే మేష్టరీలో చేరతాడా అని సందేహించారు కొందరు. ఎటుబడితే అటే వాదించవచ్చు. అసలు వాదించడం అంటే ఏమిటో తెలిస్తే అన్నాడొకాయన. 'దరిద్రుడు' అంటే రెలిటివ్‌గా సుమండీ. జగత్తంతా ఆ యొక్క రెలిటివిటీయే కదండీ. ఏమైనా మనం చెప్పలేం. మన జ్ఞానం చాలా పైకి ఎదుగుతూంటుంది. కాని, కొండొకచో 'హాల్టు' అవుతూంటుంది. అల్లాంటప్పుడు ఏమిటి చెప్పడం? వెధవవాళ్ళకి తీర్థపు రాచ్చిప్పలమీద ఆపేక్ష ఎంచేత? దోమలకి మానవుల చెవులంటే సరదాఎంచేత? అల్లానే దారిద్ర్యానికి మేష్టరీ అంటే ఇష్టం. అందులో తెలుగు మేష్టరంటే పరమ ప్రీతి."

"...మేష్టరీ చదువు ఏ కాలంలోనూ ఫాషన్‌లో ఉండేట్టు కనపడదు. సాధారణంగా ఇతర వాటిల్లో తెగ 'ట్రై' చేసి, ఎక్కడా కూడా చేపకపోతే మరి చేసేదిలేక హైసరమజ్జాఅని ట్రైనింగ్‌లో చేరి, తరువాత మేష్టరీ సంపాదనకోసం దేశాటనం చెయ్యడం కొందరు మానవులకి పట్టిన అదృష్టంగా కనిపిస్తోంది."

"జనాభిప్రాయాన్ని అనుసరించి ఉద్యోగానికుండవలసిన లక్షణాల్లో మేష్టరీకి ఒక్క లక్షణమూ లేదు. ఓం ప్రథమం ఇందులో పైన ఏమీదొరకదు.. ఎదుగూ బొదుగూలేదు. ఇది గొడ్డీతోక లాంటిది. ఇన్నీస్‌పేట బ్యాండు లాంటిది. మన 'అపనా తనా మనా' లాంటిది. బంట్రోతులు ఉండరు. ఏమీ సప్లయిలు కావు. పలుకుబడి ఉండదు. పెరుగుతుండే ఖర్చులు కడిగియిచ్చే మొత్తంకి జీతంలోనే భరించుగోవాలి. మాట్లాడకూడదు. మాట్లాడితే త్రికరణశుద్ధి లేకపోవడం అన్నమాట. శుభశుభాలు ఆ జీతంలోనే. లిప్టన్ అందులోనే. ఎలిఫెంటు అందులోనే. రోగాలూ రొచ్చులూ అందులోనే! దేవుడుఖర్చూ దెయ్యాలఖర్చూ అందులోనే. సంసారం అంతా అందులోనే. ఆస్తులులేని వారసుతద్దినాలూ అందులోనే. బేవారసు తద్దినాలూ అందులోనే.....' పెద్ద పరీక్షల పేపర్లు దిద్దితే డబ్బులొస్తాయిగాని, ఆపని సంపాదించుకోడానికి ఉత్తరాది, దక్షిణాది సమస్య తీవ్రంగా ఉందంటారు ఆయన. ఉత్తరాది అంటే సిఫారసు ఉత్తరాలు వగైరా. దక్షిణాది అంటే దానోపాయంవగైరా.

"ఎన్నిందాల గాలించి చూసినా మేష్టరీలో ఇహసౌఖ్యం ఉన్నట్టుతోచదు. అంటే సన్యాసి అయినవాడు మేష్టరీ పదవికి ఠంగున సరిపోతాడు" అంటారాయన.

భకారాగారు తను మేష్టరై ఉండి, మేష్టర్లను ఉద్దేశించి రాసిన ఒక ప్రసంగ వ్యాసంలోని వాక్యాలు అవి.

సాధారణంగా హాస్యం అనగానే అందులో అంతోయింతో అవహేళన ఉంటుంది. ఒక వ్యక్తి తాలుకా అమాయకత్వాన్నో, అజ్ఞానాన్నో, అవలక్షణాలనో చూపి నవ్వించవలసి ఉంటుంది. అటువంటి రాతకు గురైన వ్యక్తికి చురుకు తగలక మానదు. ఆరాత తనను గురించి కాదన్నట్లు నటించగలిగినప్పటికీ. ఆ అవహేళన మనల్ని గురించి కాకపోతే నవ్వుకుని ఆనందిస్తాము. ఇతరులను ఏమాత్రం నొప్పించడం ఇష్టంలేని జాలిమనస్సుగల హాస్యరచయితలు ఆ అమాయకత్వాన్నీ, అవలక్షణాలనూ తమమీదనే వేసుకుని ఫస్ట్‌పర్సన్లలో రాస్తారు. మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు అలాగే రాశారు. భమిడిపాటి వారికి అటువంటి మొహమాటమేమీలేదు. సభావేదికమీద తనపక్కనే కూర్చున్న ప్రముఖవ్యక్తినికూడా జంకుగొంకు లేకుండా కడిగేయగలడు. ఆయన వ్యాఖ్యలు పరుషంగా ఉన్నా ఆయన నిజాయితీని మనం శంకించలేము.

రాజమండ్రిలో చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారికి ఘనసన్మానం జరిగినప్పుడు ఆయ సాహిత్యం గురించి కామేశ్వరరావుగారు ప్రసంగించారు. పంతులుగారిపట్ల తనకు గల భక్తి గౌరవాలను ముందుగా ప్రకటించుకొని, ఆయన ఇతర రచనలన్నిటినీ ప్రశంసించిన కామేశ్వరరావుగారు 'గణపతి' నవలను పరుషంగా విమర్శించారు. 'గణపతి' గురించి ఆయన అన్నమాటలివి:

''గణపతి పరంగా చెప్పబడ్డ పటాటోపమూ, నిరక్షరకుక్షిత్వమూ, జీర్ణకోశపటిమా, చీట్లాటప్రజ్ఞా, నీచత్వప్రేమా, శవజలాదికవహనమూ, యామవారవృత్తి, దేశాంతర గమనమూ, బాల్య వివాహయత్నమూ, చావగొట్టినా చదువు అంటకపోయినా షోకుగా ఉండాలని ఏడుపూ, తస్కరణమూ, గాడిదనెక్కడమూ లాంటి ఘనకార్యాలు చేస్తూ పైపెచ్చు వాటిని సమర్థించడానికి సబబులు పట్రావడమూ, ఏమన్నా అంటే తొమ్మిదో అర్థం: పారాయణం చెయ్యడమూ, ముష్టికి తల్లినే వెళ్ళమనడమూ, తను వెడితే చుట్టకాలుస్తూ వెళ్ళడమూ, తనకి ముష్టివెయ్యడం ఆలస్యం అయితే తనుకుర్చీలో కూచోడమూ, మేష్టరీ చేస్తూ కుఱ్ఱాళ్ళని బాదడమూ, వేషధారణమూ, పాకశాసనత్వమూ మొదలైనవి చదివేటప్పుడు గణపతిపాత్రమీద అసహ్యంవేస్తుంది. కోపం రేగుతుంది, డోకు వస్తుంది, విచారం అవుతుంది, ఒక్కొక్కచోట జాలికూడా కలుగుతుంది. కాని. నవ్వురాదు''. 'గణపతి' విషయంలో కామేశ్వరరావుగారి విమర్శ చాలా న్యాయమైనదని నా అభిప్రాయం. ఆయన ఆ మాటలు చిలకమర్తివారి సమక్షంలోనే అనగలగడం విశేషం.

రాజమండ్రి వైద్యులసంఘ సమావేశంలో కామేశ్వరరావుగారు రకరకాల రోగాలు, రోగులు, వైద్యాలు, వైద్యులగురించి హాస్యప్రసంగ వ్యాసం చదివారు.

ముందురోగాల సంగతి:

"శరీరమనేది బహువిచిత్రమైన యంత్రవిశేషం. కాబట్టి దాని యథాస్థితిలో మార్పుకలుగుతూ ఉంటుంది. బాల్యం, కౌమారం మొదలైనవి పెద్ద పెద్ద మార్పులు. అవిఫలానాక్షణంనించి ప్రారంభమనీ నిర్ణయించలేం. అవి బాధపెట్టవు. కాని. బాధతో కూడుకుని వచ్చే మార్పులు కొన్ని కొన్ని ఉన్నాయి. అవి త్వరలో సర్దుకుంటే వాటిని 'రుగ్మత' అనీ, 'సుస్తీ' అనీ. 'అస్వస్థత' అనీ వాడతారు. త్వరలో సర్దుకోక మకాం వేస్తే 'కాయిలా' అనీ. 'దీర్ఘవ్యాధి' అనీ. 'సికస్తు పడడం' అనీ అంటారు. అసలే సర్దుకోకపోతే. శరీరాన్ని పంచభూతాల్లో దేనిక్కో ఓ దానికి దాఖలు చేసేస్తారు.

"....ఆస్తి విషయంలో మల్లేనే వ్యాధుల విషయంలో కూడా స్వార్జిత పిత్రార్జితాలు ఉండగలవు.

"శరీరం యొక్క అవయవాలూ. భాగాలూ. పదార్థాలూ ఎన్నిఉన్నాయో అన్నింటికీ అన్ని రోగాలూ ఉన్నాయి. అంచేత పై విడివిడి అవయవ వ్యాధులేకాక. లోపలి గుండె, కాలేయం లాంటి వాట్ల వ్యాధులేకాక చర్మ. రక్త. మాంస. నర.అస్థి. శల్యాది వ్యాధులు ఉద్భవించాయి. వ్యాధి అదృశ్యం. వాలకంబట్టీ, లక్షణాల బట్టీ దాన్ని గుర్తించాలి. కొన్ని వ్యాధులు బలేటక్కరి రకం. రోగి గతించేవరకూ అవి పోలికకే అందకుండా నక్కుతాయి. కొన్నింటి స్వభావం రోగి గతించిన స్వల్పకాలంలోనే తెలిసిపోతుంది."

తర్వాత వైద్యులు. వైద్యాలసంగతి:

"రోగాలు పుట్టినకార్తిలోనే వైద్యులు వెలుస్తారు. వైద్యులు ఎల్లానూ ఉన్నారు కదా. వాళ్ళ మనస్సులో ఏమన్నా ఇదవుతారేమో అనే బాధతో కొన్నికొన్ని కొత్తరోగాలు పుడుతూంటాయి. ఇటీవల చాలా రోగాలూ, వాటికి మందులూ కూడా 'లాటిన్' భాషలో జనించాయి. వైద్యుల సంఖ్య విజృంభించేసరికి అభిప్రాయ బేధాలు కూడా పెరిగిపోయి వీళ్ళల్లో మతాలు ఏర్పడ్డాయి. హిందూ, ముసల్మాన్, కిరస్తానీలాగే ఆయుర్వేదం. యునానీ. హలోపతీ మాత్రమే కాక. హోమియోపతీ. మోనోపతీ (అనగా ఒకడే). సీతాసతీ (అనగా, రామానామస్మరణ) లాంటి వివిధ శాఖలుగా వైద్యం విడిపోయింది. ఇవీకాక. వట్టిమట్టితో కుదిర్చేవారు. నీళ్ళతో 'కూనీ' చేసి తేల్చేవారు. గాలితో మంత్రం చేసేవారు, తేజంతో వెలిగి చూసేవారు, 'వైర్' మీద విని 'వైర్‌లెస్'లో లేవదీసే వారు కూడా ఉద్భవించారు. ఇవేవీ అక్కర్లేదు. ఒక్క నిప్పుతోటే సర్వమూ చివరంటా కానీ యచ్చుగదా అని నమ్మేవాళ్ళు ఆదినించీ ఉన్నారు. కాబట్టి, ఈ కాలంలో మాత్రల డబ్బీ చేత్తో పుచ్చుకుని సంసారపక్షంగా తిరిగిపోతూ చేతులు చూసేవారు. డోసుకి ఇంత అని అరుకులు సీసాల్లో పోసేవారు, సగ్గుబియ్యంలాంటి మాత్రలిచ్చేవారు, మట్టిపామించేవారు, తొట్టికొనిపించేవారు, జట్కాలూ, బళ్ళూ, సైకిళ్ళు దిగేవారు, చెవుల్లో

యంత్రాలవారు, కుంకంబొట్టువారు, వనమూలికకలవారు-ఇల్లాగ్గా రకరకాల వారు విజృంభించారు. వీరిలో ఎవరికేనా 'డాక్టర్' (బిరుదు కాదు) పిలుపు రావాలంటే ఏ బాపతో ఓ బాపతువికొన్ని ఇంగ్లీషు ముక్కలు వచ్చితీరాలి.

"... వైద్యుల్లో లెఖ్ఖలేనన్ని జాతులు. ఏ శాఖలో ఏ విషయంలో ప్రత్యేక ప్రజ్ఞ గలవాళ్ళో ఆపేరట వైద్యులు పిలవబడతారు. కంటి, పంటి, కాలి, చెవి - మొదలైనవైద్యులున్నారు. వైద్యులంతా కలిసి శరీరాన్ని ముక్కలు ముక్కలు చేసేసి ప్రత్యేక సామ్రాజ్యాలు ఏర్పరచుగున్నారు. శరీరానికి అతీతులు భూతవైద్యులూ, మతవైద్యులూ, ఆత్మవైద్యులూను." సమావేశంలో డాక్టర్లనే నవ్వించగల విషయాలు యింకా చాలా రాశారు ఆయన. నామట్టుకు నాకు భకారా గారి నాటకాలలో కంటే ఆయన వ్యాసాల్లోనూ, కథల్లోనూ నాణ్యమైన హాస్యం కనిపించింది. అవి అన్నీ బావుంటాయని నా ఉద్దేశం కాదు. కొన్ని పేలవంగా ఉంటాయి. కొన్ని కృతకంగా ఉంటాయి. కొన్నింటిలో వాక్యాలు గుక్కతిప్పుకోలేనంత పొడుగ్గా ఉంటాయి. కామాలు, సెమీకోలన్లు, హైఫెన్లు, బ్రాకెట్లతో పేజీ, పేజీన్నర పొడుగు సాగే వాక్యం చదివేసరికి రొప్పువస్తుంది. ఓ అరనిమిషం రెస్టు తీసుకోవాలనిపిస్తుంది. అలాంటి వాక్యాలు ఉదహరించి మిమ్మల్ని శ్రమపెట్టను.

'మాటవరస' అనే శీర్షికగల 114 పేజీల సంపుటిలో పెద్ద, చిన్న, మరీ చిన్న వ్యాసాలు, కొంటెవార్తలు, సంగతులు అమాంబాపతు 33 ఉన్నాయి. వీటిలో 'చుట్టా, బీడీ, సిగరెట్', 'భోజనోపదేశం', బస్తీ-దుమ్ము' అనేవి చాలా రమ్యుగా ఉన్నాయి. వీటిల్లోంచి కొన్ని వాక్యాలైనా వినిపించకపోతే మీకు అన్యాయం చేసినవాణ్ణవుతాను.

"చుట్టా, బీడీ, సిగరెట్లు త్రిమూర్తులని చెప్పవచ్చు. వీటికి జన్మస్థానం ఆ యొక్క ఆది విరాట్స్వరూపమైన పొగాకు. ఈ రూపాల్లోనే కాక పొగాకు అనేకమైన ఇతర ఆకారాల్లో భూమిమీద కర్మవశంచేత అవతారాలు ఎత్తిఉంది. తను నాశనం అయిపోయి ప్రపంచాన్ని నడిపిస్తోంది. పొగాకు ఇతరులకోసం తగులడిపోతంది. అదే చుట్టా, బీడీ, సిగరెట్ స్వరూపం. పొగాకు ఇతరుల నిమిత్తం పొడుమైపోతోంది. అదే ముక్కు పొడుం స్వరూపం. పొగాకు ఇతరులకై ఎండి, తడిసి, అడ్డమైన నూనె సరుకుతోటీ కలిసి ముక్కముక్కలు అవుతోంది. అదే మసాలా స్వరూపం. పొగాకు ఇతరులకొరకై సున్నమైనలిగి పోతోంది. అదే పట్టీ స్వరూపం. పొగాకు ఇతరులకి, శిబిచక్రవర్తికి మల్లే నిజశరీరం కండలు చెండిఇస్తోంది.

"పొగాకును అమెరికాలో ఒక తెల్ల ఆసామీ ప్రయాణం చేస్తూ కనిపెట్టినట్లు చెబుతారుగాని వొట్టిమాట. అది ఈ దేశందే అని చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. సోమపానం, ధూమపానం గురించి సెలవిచ్చినట్టే ధూమపత్రం గురించి కూడా అనేకమంది ఋషులు స్పష్టంగా, తెగేసి, సెలవిచ్చారు. వెనక బాగా చుట్ట కాల్చడం చేత 'ధూమ' బిరుదు తెచ్చుకున్న ఒకాయన యొక్క

సంతతి వాడు ధౌమ్యుడనే అభ్బాయైనటు. ఇంక ఇతర నిదర్శనాలు కావలసిస్తే 'రిసర్చి' చేస్తే మనకి ఏ విధంగా సాక్ష్యాలు కావాలంటే ఆ విధంగా రాగిరేకులు. తాళపత్రగ్రంథాలు.నాణాలు వగైరాలు దొరుకుతాయి.

"...చుట్ట అంటించడానికి పూర్వం చివరకొస పంటితో కొరుకుతారు-చివర మెలెట్టి ఉండడం వల్ల ఓ చివర నించి ఓ చివరకి గాలిలాగడానికి రాదా లేదేమో అనే భయం చొప్పున. బీడీ వెలిగించడానికి పూర్వం. దాన్ని తల్లకిందులుగా పెదవుల లోపలికి పట్టుగుని, పెదవులు బిగించి. వెలిగించబోయే వేపుకి ఆవిరి పెడతారు-కొంత ఆవిరితడి దానికి తగిలి అది హెచ్చుతగ్గులు లేకుండా గుండ్రంగా కాలుకుంటూ రావడానికిన్నీ, లోపల వేంచేసి ఉన్నటువంటి పొగాకురేణువులు పీల్చే చివర నక్కి ఉండి. బీడీ వెలిగించి ఆదుర్దాగా పీల్చగానే, ఆ మొదటి పీలుపులోనే గొంతులోపల ప్రవేశిస్తాయేమో. వాటికి ముందస్తిగా ఉద్వాసన చెప్పకపోతే ఎల్లామరి అనే అభిప్రాయంలోటేసి. సిగరెట్టుముట్టించడానికి పూర్వం. దాన్ని పుస్తకంలాంటి బల్లపరుపు ప్రదేశం మీద ఉంచి. అరిచేత్తో నొక్కి. ఇటూ అటూ రెండు మూడుసార్లు అప్పడాల కర్రని మల్లే దొల్లించి. తీసి. పుస్తకాన్నెట్టి. మెల్లిగా తాటస్తారు- అది లోగడ కఱబారిఉండినట్టయినా పొగసజావుగా రాకపోతుందేమో అని భయమేసి. ఇలాగ్గా ఈ స్వరూపాలు జీవందాలుస్తాయి. ఈ మూడింటిలోకీ బీడీ అదొక మోస్తరు జంతువు. ఏ మాత్రం వ్యవధానం లేక పెద్దపనిలో ఉండి ఒక్క దమ్ము. లిప్తలో లాగిపోడానికి మాత్రం టైము సరిపోయే పెద్ద ఉద్యోగస్థులూ. కానీకి చాలా వస్తాయి గదా ఎప్పుడు పారేసినా పారెయ్యచ్చు, మనసుకేమీ బాధలేకుండా. అనుకునే కొద్ది వాళ్ళూ. ఎవళ్ళేనా చేయిచాస్తే, క్షోభలేకుండా వాడికి ఓటివ్వచ్చును-అనే వాళ్ళూ వగైరాలు బీడీసేవిస్తారు."

ఇలా సాగుతుంది భకారా దోరణి. ఇందులో మనకి సంగతులేవీలేవు. అయినా, ఆయన రచనా చమత్కారం వల్ల నవ్వొస్తుంది. ఇదంతా 'టైంపాస్' రకం హాస్యం.

'భోజనోపదేశం' అనే మరో అద్భుతమైన చిన్న వ్యాసం ఉంది. అందులో పెళ్ళి భోజనానికి వెళ్ళి ఎల్లా వడ్డింపించుకోవాలో, ఎలా భోజనం చేయాలో ఒక అన్నగారు తమ్ముడికి ఉపదేశిస్తాడు. అందులో మచ్చుకి కొంత.

"....శ్రోత్రియుల పక్కని కూచోవలిసొచ్చి. అతాత్తుగా మడిగట్టుకోడం అవసరమైతే చొక్కా తీసేసి, బిళ్ళగోచీపెట్టి, పైమీద పంచసన్నంగా మడతెట్టి ఎత్తెత్తి అడుగులేస్తూ, జనాన్ని తప్పుకోమను. అగ్రం వున్న ఆకు చూసుకుని, ఈనెతీసేయ్. ప్రారంభించడానికి పూర్వం తెల్లబోయి మాట్లాడుతూ కూచుని టైం పాడుచేసుగోక. అంటులేని మిఠాయి వగైరాలు రుచి చూచి పేచీవస్తే, వడ్డించలేదను. జలపదార్థాలకికూడా స్థలాక్రమణ రోగం ఉంది గనక, భోజనం పూర్తికాందే ఉదకం తాగకు. తరువాత ఎక్కడేనా ఇంకోరింటో కాబోయే విందు చూపుమేరలో ఉంటే

తప్పు. పప్పు 'డబుల్‌డోస్' చెయ్యి. కొండొకచో మాగాయిటెంక వడ్డించినట్టయితే వెంటనే మజ్జిగ తెప్పించి అందులో అది ప్రథమాన్నే నానెయ్. ఆవడలువడ్డించేటప్పుడు దిక్కులు చూస్తూ కూచోక అవి దధిసమేతంగా పడ్డాయోలేదో. సరిగా పడ్డాయో లేదో గమనించు.''

అంటే మా తమ్ముడు ''సరిగా పడ్డంనేమిటి? నాకు తెలియనట్టు చెబుతావేం అన్నయ్యా'' అన్నాడు.

''సరిగా అంటే సరిసంఖ్యలో అనగా, రెండు నాలుగు, ఆరు, ఇలా పడవలసినవేగాని అవి బేసిగా దిగకూడదు. అవికొంతవరకు ముచ్చటించి, వడ్డించేవారిని దగ్గరికి పిల్చి, చెవులో చెప్పు 'పూర్వాశ్రమం' తెప్పించండి అని.

'పూరాశ్రమం' అంటే ఏమిటన్నయ్యా? అన్నాడు మావాడు. ఎంతసత్తెకాలంరా నీది! పూరాశ్రమం అంటే కారపుగారె. ఇంకా పెరుగులో పడనప్పుడు అదేగా మరి దాని జన్మ! అవి అందిన వెంటనే మరొహ వడ్డించేవాణ్ణి, ఏల్చి (మొదటి వాడే అయితే దిష్టితగలచ్చు) 'నిజస్వరూపం' పట్రమ్మను. అది కారంలేని అసలుగారె. క్షీరాన్నం పట్రాగానే ఎన్నడూ వడ్డించుగోకు. తెచ్చిన గోకర్ణంలోది చాలా భాగం అయిపోయిన తరువాత మిగిలిపోయినమడ్డి నీవిస్తట్లో బోర్లించమను. అప్పుడే నీకు జీడిపప్పు వగైరా గంభీర సామాగ్రి దక్కుతుంది.

''ఏదైనా తీపి సరుకు ప్రత్యేకంగా తినడం పాపం. అది ఎప్పుడూ పకోడీలాంటి కారపు సరుకుతో చెరిసహాయిస్వాహాలా లాగించవలసిందే.''

మావాడు-'ఏమో!కారమే ఎక్కువ తినాలని నా ఉద్దేశం'. నేను-'నీ ఉద్దేశం ఎవడిక్కావాలిరా. ఇందులో ప్రవేశమేనా లేని వాడివీ! కృష్ణుడి ఉద్దేశంరా అదీ! సుఖం అనగా తీపేనా! దుఃఖం అంటే కళ్ళమ్మటనీళ్ళుగనక కారమేనా? అయితే విను. ''సుఖదుఃఖే అనగా తీపికారాలు రొండున్నూ అనగా లడ్డూపకోడీలు రెండూన్నూ సమేకృత్వా అనగా సమరాసులుగా ఇదెంతో అదంతచొప్పునచేసి, లాభాలాభౌ అనగా లడ్డూలలో ద్రాక్షలుగాని, పకోడీలలో ఉల్లిపాయలుగాని లభించకపోయినా, జయాజయౌ నీకు చాలా సయించినా సయించకపోయినా చలించక ఏకగుణంతో ఉండి, తతః తరువాత, యుద్ధాయ అనగా లడ్డూ-పకోడీ లడాయికి, యుజ్యస్వ అనగా తయారుకావోయ్ అబ్బాయీ! నైవం పాపం అవాప్స్యసి. అనగా ఇల్లా చేస్తే నిన్ను చీమంతైనా పాపంచుట్టుగోదు'' అని.

''వీలైనప్పుడల్లా 'రెడ్‌విత్' చేస్తూండు- అనగా మిశ్రమం. పచ్చిమిరపకాయ తెప్పించి ఉప్పులో అద్ది కొరకవచ్చు. ఆ పనినే పప్పులో పచ్చిమిరప 'రెడ్‌విత్' సాల్ట్‌యాక్టు అంటారు. అల్లానే పప్పు 'రెడ్‌విత్' ధప్పళం. జిలేబీ విశేషంగా తినేటందుకు వీలు ఏర్పడడానికి జిలేబీ రెడ్‌విత్ మజ్జిగపుల్స్''!



భకారా గారి రచనల్లో కథలన దగినవి చాలా తక్కువ. 'పల్లెటూరు స్కూలు తణిఖీతంతు', 'బలరామయ్యగారి ఇంగ్లీషు తమ్ముడు', 'తమ్ముడు పెళ్ళికి తర్లీవెళ్ళడం,' అనే మూడురచనలు కథల్లాగా ఉంటాయి. ఆ మూడూ చాలా సరదాగా ఉంటాయి. వీటిల్లో మొదటిది ఒక పల్లెటూరి బడిపంతులు కథ. ఆ పంతులు వర్ణన చూడండి:

"...ఆయన బహుసౌమ్యుడు. ఆయనకి స్థిరాస్తి భార్య. చరాస్తితనే. అతగానికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఏమీ అంటే ఒక ఆడశిశువు. కొండొకచో కవలలు. పై ఖర్చుకి నాలుగురాల్ళుకాక పంటలరోజుల్లో ఊరి వాళ్ళు వసూలు చేసి అతడికి ముట్టచెప్పే ఇరవైబస్తాల ధాన్యమూ అతని సంసారానికి కొంతకూడు. ఇదిగాక, ఇతరత్రా ఓ అక్షరాభ్యాసం అనో, ఓ వసరా అనో పేరెట్టి అతడు ప్రజల దగ్గిర్నించి ఓ జామారొగ్రటో గుంజుకుంటూండేవాడు. పైగా, ఓ దస్తావేజు గోకిపెట్టో, ఓ సంబంధం ముడెట్టించో, ఓ సాక్ష్యానికి తగులడో, ఓ బ్రాహ్మణార్థానికి ఏడిసో దిష్టికొట్టకుండా ఇంతో అంతో కతుకుతూండేవాడు. ఇంకా, స్కూలు తనిఖీ దార్లలో ఎవడేనా ఒక్కొక్క తరిపిఘుటం వచ్చినప్పుడు అతగాణ్ణి మనుగుడుపుకి మేపినట్లు మేపి సిఫారస్సుల వల్ల గ్రాంటు కొడుతూండేవాడు.

"...ఇన్నిన్ని వీళ్ళూ ఉండడం వల్ల అతనికి మరొహాలోటు ఏమీరాకుండా నిమ్మకి నీరొసినట్లు జరిగిపోవలసిందేకాని, ఒక్క అసిఘాతం వచ్చిపడింది. ఆపాలెం మొత్తానికి అతనిదే ధర్మలోగిలి. అందువల్ల ప్రతీప్రయాణికుడూ కూడా వీళ్ళింటో ఆగడం సాగించాడు. పొద్దెక్కితే పొద్దెక్కిందనీ, ఎండైతే ఎండనీ, వానైతే వాననీ, మబ్బైతే మబ్బనీ, ఏదైతే అదనీకారణంగా చెప్పి తన్ని మెడేసుగుని బలవంతపెట్టగా అవతల తన పన్లన్నీ నిప్పడిపోయినా సరే ఇక బాగుండదని తప్పనిసరివల్ల ఆగిపోతూన్నట్లు నటించి వాళ్ళింటో ఆగని బంధువుడూ, తిష్టవెయ్యని పరిచయుడూ, బసచెయ్యని బంధుపరిచయుడూ, చెయికడగని పరిచయబంధువుడూ లేడు.

ఈ పంతులు ఆర్జనకి అన్నిమార్గాలూ అన్వేషిస్తూ ఉండెవాడు. 'పక్క ఊళ్ళో ఎక్కడేనా ఎవరేనా కుండతడుపుకుంటేసరి, అక్కడల్లా ఇతడు హాజరు-కబురు ఏ కాకిచెప్పేదోకాని! ఏదేనా తూతూ బాకా గాని, రాండోలుగాని వినిపించితే అదే కన్యాప్రదాతగారి సవినయాహ్వానం, వేరే పిలుపెందుకని ఆయన మతం."

ఈ వర్ణన చదువుతుంటే ఆ పంతులు ఇల్లు, అతడి రూపం, అతడి చేష్టలు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాయి. టూకీగా కథ ఏమిటంటే-ఒకరోజు అదాటుగా స్కూలు తనిఖీకి ఒక అధికారి వస్తాడు. పంతులు అలవాటుచొప్పున ఆ అధికారిని మనుగుడుపుకి మేపినట్లు మేపుతాడు. అధికారి అన్ని మర్యాదలూ అడిగి మరీ చేయించుకుంటాడు. గ్రాంటు మంజూరు చేయిస్తానని

హామీ యిచ్చి వెడతాడు. ఆయన వెళ్ళిన మర్నాడు టపాలో పంతులుకి ఉత్తరం వస్తుంది అసలు అధికారినుంచి. మరి నాలుగు రోజుల్లో స్కూలికి తనిఖీ తంతు జరుగుతంది గనక సిద్ధంగా ఉండవలసిందని ఆ ఉత్తరం తాత్పర్యం.

చదువులో జువ్వలాగా దూసుకుపోయేవాడైనా నిత్యజీవితంలో దమ్మిడీకి కొరగానివాడు. 'బలరమాయ్యగారి ఇంగ్లీషు తమ్ముడు'. కుటుంబం మొత్తంమీద ఇంగ్లీషు చదువు చదివినవాడు అతడొక్కడే గనక అతణ్ణి'ఇంగ్లీషు తమ్ముడు' అంటారు బలరామయ్యగారు. ఈ కథ అంతా తమ్ముణ్ణి గురించి ఆయన కథనమే. ఆయన మాటల్లో:

"మానాడితో కలిసి చదువుతూ చిన్నక్లాసులోనే పేలిపోయి మానేసిన వాళ్ళపని ఇప్పుడు మూడు పువ్వులూ, ఆరుకాయలుగా ఉంది. మరో చమత్కారం! వాళ్ళల్లోనూ ఎంత చిన్నక్లాసులో ఫేలై ఎంతపెందరాళే ఇంగ్లీషు మానేసినవాడై ఉంటే, అంత పనికొచ్చేవాడూ, అంత సంపాదనపరుడూ అయిపోయాడు. మావాడో! చదువుకునేటప్పుడు వీడిపని ఎంత ప్రభగా ఉండేదో ఇప్పుడు అంత నస్మరంతిగా ఉంది. వీడికి ఉద్యోగం ఇస్తాననే జ్ఞాని కనపడ్డు. ప్రతీ అధికారీ మావాడితో "నువ్వు ఏం పని చెయ్యగలవ్." అంటాడటగానీ, "నువ్వు ఎంత పెద్ద పరీక్ష ప్యాసయినావ్?" అని అడగనే అడగట్ట. ఏమైతేం, వీడికి ఒక్క దమ్మిడీ ఇంటో పడేద్దామనే ఊహలేదు. పడెయ్యగల ప్రజ్ఞలేదు. తనూ, పెళ్ళాం, ఇద్దరు కూతుళ్ళూ వీళ్ళంతా ఉమ్మడి సంసారంలోనే. అంచేత మావాడికి ఊహా మొహమాటం. పైగా వాడిదంతా అతి సుకుమారం. పైమీదకండువాకూడా బరువే-ఓ గజం నడవలేడు-కారో, విమానమోకట్టిస్తాడు. ప్రతీదీ దర్జాగా ఉండాలంటాడు. సొమ్మురావలసిన చోట దాక్షిణ్యం అంటాడు. ఇవ్వవలసినచోట తూర్పు మొహంగా తిరిగి దణ్ణంపెట్టి ఇచ్చెయ్యమంటాడు. ఎవడేనా తనకి అన్యాయం చేస్తే. వాణ్ణి కాస్త ఠకాయించడం అంటూలేదు. వాడి పాపాన్ని వాడే పోతాడంటాడు. బజార్లోంచి ఏమన్నావస్తువులు తేరా అంటే టైం లేదంటాడు. ఒక్కొక్కప్పుడు ఇంట్లో పోరుపడలేక బజారికి వెడతాడా, ఆఖరికి కూరలు తేవడమైనా తెలియదు. తక్కెడకి దాళా ఉంటుందని మావాడు ఎరగడు. కొనుక్కునే వస్తువులు మంచివోకావో ఎరగడు. వంకాయకి ముచిగిదళసరిగా ఉండాలనీ, ములక్కాడ మెలితిప్పితే తిరగాలనీ, వెలక్కాయలు డీడిక్కులు కొట్టి చూసుగోవాలనీ, బెండకాయ చివర విరుగుడు పడాలనీ, ఆనపకాయ గోరుదిగేటట్టు ఉండాలనీ, వగైరాలు మావాడికి బొత్తిగా తెలియవు. వీసెంత, శేరెంత, తులం ఎంత అని అడగడు. ఎంచేతో తెలుసా? ఏ వస్తువు ఏ లెక్కని ఉంటుందో ఎరగడు. ఓ మాటు కస్తూరికని వెళ్ళి 'వీసెంత?' అని అడిగాట్ట."

తమ్ముడి లక్షణాలు యింకా చాలా వర్ణించాడు. ఇందులో వేరే కథ అంటూ ఏమీ లేదు. ఇది ఒక సభలో అసంపూర్తిగా చదివిన రచనట.

'తమ్ముడి పెళ్ళికి తర్లీవెళ్ళడం" అనే కథలో హడావిడి వర్ణన చదువుతుంటే ఇప్పటి పెద్దతరం వాళ్ళకి తమ చిన్నప్పటి సంగతలన్నీ జ్ఞాపకం వస్తాయి. అందులోని కొన్ని వాక్యాలు.

ద్వారబంధానికి తోరణంగట్టి, పెళ్ళికొడుకు కళ్ళకాటికా, బుగ్గని చుక్కాపెట్టేటప్పటికి వొస్తుంది గావును పెళ్ళికళ! ఆపళంగా అదివరదాకా సంసారపక్షంగా ఉంటున్న ఇంటిల్లిపాదిజనంలోనూ ప్రతీ నస్మరంతి గాడూ కూడా గొడ్డలిపెట్టుగా ఒక గొప్ప మొగపెళ్ళి వాడుగా మారిపోయి ఊరుకుంటాడు. అక్కణ్ణించి అడుగులు లెక్కెడుతూ నడిచేవాడొకడూ, నిద్దరోతూ మాట్లాడేవాడొకడూ, అభోజన్నం పడుకుంటానని గడ్డం పట్టించుగునే ధీరోదాత్తుడొకడూ, తాను భంట్రోతంటే తనకిభంట్రోతనే ఘరానా వాజమ్మ ఒకడూ. 'అబ్బ! వాణ్ణెళ్ళమందూ దుక్కలా ఉన్నాడూ' అని పనిఎగేసే మందుడొకడూ ఆవిర్భవించడం వల్ల వ్యవహారం తారుమారవుతుంది. కాని. సందడి అంటే అదే సందడి లెండిమరి. ఈ దార్లో తుంగచాప పరిచారెవరూ? ఊటముకు పెటట్టై ఎవరిదర్రా. కాలుబద్దలవుతూనూ? 'ఏమర్రా మూడుకోతల దంతపు దువ్వెన్న చూడలేదుకదా మీరెవరూ?' 'ఇదుగో చూడూ! నా పట్టుతాపితాలు ఎక్కడున్నాయి ఇయ్యి. అవీ. మరచెంబూనూ'. ఈ వెధవని తియ్యవే ఇక్కణ్ణించి. తీసి నీళ్ళర్రా'. అంటూ అనవరతమూ కేకలు వినబడుతూ. చంటిపిల్లల గుక్కట్టడాలూ. కొత్త పెద్దపిల్లల అల్లర్లూ -పల్లకీలో కూర్చోడానికి తగూలాలూ. గాయికం వచ్చినవాళ్ళు మొత్తుగున్నా వినిపించుకోకుండా పేకాటలూ. ముసలివాళ్ళకూకలెయ్యడాలూ లాంటి వాటితో నిండి ఉండే అప్పటి ఆ వైభవం సంసారసౌఖ్యసారం అనవచ్చునేమో!" ఇంక ఆ తర్వాత బళ్ళు కట్టించుకొని సామాన్లతో స్టేషనుకి చేరడం. రైలు ప్రయాణం సందడి... అదంతా యింకోవర్ణన. అచ్చమైన. తెలుగుతనం ఉట్టిపడే గొప్ప హాస్యం ఈ కథల్లోనే ఉంది.

ఇంత మంచి హాస్యం భమిడిపాటి వారి నాటకాల్లో కనిపించదు. కొన్ని నాటకాలలో ఐదారేసి పేజీల స్వగతాలుంటాయి. కొన్ని పాత్రల భాషకృతకం గానూ. ప్రవర్తన వికృతంగానూ ఉంటాయి. కొన్నింటిలో వెటకారం అతిగా కరుస్తున్నట్లు. రక్కుతున్నట్టు ఉంటుంది. అయినా. 'బాగుబాగు' . 'ఎప్పుడూ ఇంతే' వంటి కొన్ని నాటకాలు చాలా సరదాగా సాగిపోతాయి. వాటిలోని హాస్యధోరణి, తెలుగులో సాంఘిక హాస్యనాటకాలకు ఒక వరవడి పెట్టిందని ఖచ్చితంగా చెప్పవచ్చు. 1950, 60 దశకాలలో కలంపట్టిన చాలామంది హాస్యరచయితలపై భకారా ప్రభావం కనిపిస్తుంది. ఆయన్న సృష్టించిన విచిత్రపదబంధాలెన్నో ఆధునిక తెలుగు భాషలో జీర్ణించుకుపోయాయి.

'బాగు బాగు' అనే నాటకంలో చిక్కేశ్వరరావు అనేవాడు ఇంగ్లీషు తెలుగు కలగాపులగం చేసి కొత్తపదాలను సృష్టించి తమాషాగా మాట్లాడుతుంటాడు. ఆ భాషమీద ఒక పుస్తకం రాసి దానికి 'ఎక్స్‌పెరిమెంట్స్ ఇన్ టెల్గిష్' అని పేరు పెడతానంటాడు. ఆ భాషలోని కొన్ని పదాలు:

కొశ్న, ఘోరిబిల్, కవిట్రీ. క్వెశ్చన్, ప్రశ్న కలిస్తే క్రొశ్న; ఘోరం, హారిబిల్ కలిస్తే ఘోరిబిల్; కవిత్వం, ప్రొయెట్రీ కలిస్తే కవిట్రీ. ఈ భాషలో చిక్కేశ్వరరావు రాసినకవిత

దస్కై ఈజ్ మబ్బీ
దరోడ్ ఈజ్ దుమ్మీ
మై హెడ్ ఈజ్ దిమ్మీ
లైఫ్, లైఫ్, లైఫ్
ఇప్పుడు దేడునాట్ విన్
వెనక్క దేదునాట్ గణ్
ముందు దేడునాట్ నమ్
లైఫ్, లైఫ్, లైఫ్
మ్యాన్ఈజ్ నాటెట్ నోబుల్
వుమన్ ఈజ్ నాటెట్ నమ్మబుల్
చైల్డ్, నాటెటాల్ పూజబుల్
లైఫ్, లైఫ్, లైఫ్

భకారా తర్వాత తరాలలో ఎవరెన్ని శాబ్దిక చమత్కారాలు చేసినా ఆరకం ఎక్స్‌పెరిమెంట్లకి ఆయనే బ్రహ్మ. అందుకే ఆయన్ని హాస్యబ్రహ్మఅన్నారు. ``ఇంగ్లీషుకి తండ్రి లాటిన్. తెలుక్కి తల్లి సంస్కృతం అవడం చేత, ఇంగ్లీషు తెలుగూ కలవ్వేమో అని కొందరికి డౌటేహం. తెలుగుని సంస్కృతం ఒక చెంపకాయా, హిందూస్తానీ ఒక చెంపకాయా వేళ్ళు అంటుకునేట్టు కొట్టాయి. ఇక చెంపలులేక, ఇంగ్లీషు వచ్చి, తెలుగుని ఓ మొట్టికాయ వేసింది. మొట్టికాయలు ఇంకా ఎన్ని పడతాయో చెప్పడం మన తలదాటిన సంగతి`` అంటాడు చిక్కేశ్వరరావు ఆ నాటకంలో.

`ఎప్పుడూ ఇంతే` అనే నాటకంలో పర్వతాలు అనేవాడు నిమీవిత నేత్రుడై, తదేక ధ్యానముతో కొంతసేపు శివపరంగా జపిస్తూ ఉండగా, ఎదరనించి శివవేషధారి అయిన అమృతం అనేవాడు నుదుటి మీది బల్బు మినహా ఒళ్ళంతా కప్పుకుని వస్తాడు. అతడు పర్వతాలును మూడువరాలు కోరుకోమని సంజ్ఞ చేస్తాడు. తనకి దురాశలేదనీ, ఒక్క వరం చాలుననీ అంటాడు పర్వతాలు. ``నా చింత నాకు లేదు. నాకు ఏది ఎల్లాపోయినా ఒకటే నా విషయంలో. నాకెప్పుడూ పరచింతే. అదీ నా స్వార్థత్యాగం. ఆ అక్షయంగాడున్నాడే. వాడు నిక్షేపంగా ఉన్నాడు. వాడుసుబ్భరంగా కుదిమట్టంలోకి తిరుక్షౌరంఅయిపోయి వొట్టి సన్యాసి పీనుగు అయిపోయేలాగు నాకు వరందయచేయించాలి మహాప్రభో. నాకదిచాలు. నే బాగుపడక్కర్లేదు. దుర్యోధనుడుకీ పై

అంతస్తున్నాది. వాడు చేతగాని వాడు. ధర్మరాజుకి ఉందనీ, తనకిలేదనీ, తనకి కూడా కలగాలనీ ఏడిచాడు. నేను, నాకక్కర్లేదు ఇంకొడికి పోతే చాలనీ!''... అంటాడు.

వేషధారి కోపం సూచించగా పర్వతాలు ''ఏమిటండీ, ఊరికేనూ! ఆ కోపం, రుసరుసానూ! వరం యిస్తానని వచ్చి! నాఇష్టం. ఏమిటి మీ గొప్ప! నలుగురూ ఎన్నుకుంటే మీరు దేవుడై ఊరుకున్నారు. రేపు నలుగురూ నన్నే దేవుడనకుంటే నేనే అయిపోతా ఎలెక్షన్లో. అబ్బో! నాదగ్గరా...? అంటూ దేవుణ్ణి దులుపుతాడు.

ఇలా కొటేషన్లు ఇస్తూపోతే తెల్లారిపోతుంది. కాని, రకానికి కొన్ని చొప్పున కొద్దిగానైనా మచ్చుతునకలు చూపించకపోతే కామేశ్వరరావుగారి హాస్యస్వభావం గురించి ఒకఅవగాహన కలగదు. ఆయన ఫ్రెంచి నాటకకర్త మోలియర్‌ను అనుసరిస్తూ కొన్ని నాటకాలు రాసినా వాటిలో నిజాయితీ కనిపించదు. ఆయన రచనలు కందుకూరి, గురజాడల రచనలలాగా సంఘ సంస్కరణోద్దేశంతో రచించినవి కావు. ఆయన రచనలు సరదాగా నవ్వు కోవడానికిఉద్దేశించినవే.



భమిడిపాటి వారి రచనలన్నింటిలోకి ఉత్తమోత్తమమైనవని నేననుకుంటున్న రెండు గ్రంథాలను గురించి ఇప్పుడు ప్రస్తావిస్తాను. వాటిలో ఒకటి 'ఆంధ్రనాటక పద్యపఠనం'. రెండోది 'త్యాగరాజు ఆత్మ విచారం.' వీటిని హాస్యరచనలలో జమకట్టడానికి వీల్లేదు. ఇవి పాఠకులను నవ్వించడం కోసం రాసినవి కావు. వీటిలో చర్చించిన విషయాలు గంభీరమైనవి, శ్రద్ధగా ఆలోచించదగినవి, తర్కించదగినవి. అయినా, వీటిలోకూడా భమిడిపాటి వారికి సహజమైన హాస్యోక్తులు, వ్యంగ్యోక్తులు, వాక్చమత్కృతులు కొల్లలుగా కనిపిస్తాయి. అందుకే వీటిని ఈ ప్రసంగ వ్యాసంలో చేర్చడం.

'ఆంధ్రనాటక పద్యపఠనం' పధ్నాలుగు వ్యాసాలు, ప్రసంగ వ్యాసాలు సంకలనం. అవన్నీ 1923 ప్రాంతం నుంచి 1939 వరకు వేర్వేరు కాలాలో, వేర్వేరు సందర్భాలలో రాసినవీ, చదివినవీ, వాటి సంకలనం 1957లో వెలువడింది. ఆయన మాటల్లోనే చెప్పాలంటే- ''అన్యత్వారోపణే ప్రధానాశయంగా ఉండవలసిన ఆంధ్రసంగీతనాటక ప్రదర్శనాలలో పద్యభాగావిష్కరణ యొక్క అద్వితీయ విధాన సంప్రదాయం వల్ల ఆంధ్రావనిలో ఏర్పడి ఘనీభవించిన అభిరుచీ, దానిపుట్టుపూర్వోత్తరాలు, దాని ఔచిత్యానౌచిత్యాలూ, దాని ప్రయోజనానర్థాలూ, దాని ధర్మమా అని ఇతర రంగాలలో కూడా పద్యాలు వినబడే ముహూర్తాలలో ఛందశ్శాస్త్రానికి, తటస్థిస్తుండే మరణావస్థా- మొదలైన సంగతులు సహేతుకంగా, సోదాహరణంగా చర్చింపబడి, పద్యపఠనం పొందవలసిన రూపం సూచింపబడి ఉన్న గ్రంథం 'ఆంధ్రనాటక పద్యపఠనం.'

నాటకాలలో పద్యాలను 'రాగించడం'- అనగా రాగాలతో లాగించడం అనుచితం అని ఆయన వాదం. 1924లో బందరులో జరిగిన నటసారస్వత మహాజనసభలో ప్రసంగిస్తూ ఆయన ఈ విషయమై మొట్టమొటిసారిగా తనవాదం వినిపించారు. ఆ కాలంలో తన వాదాన్ని ఆక్షేపించిన వారికి ఆయన ఇచ్చిన సమాధానంలో ఒక చిన్నభాగం మాత్రం యిక్కడ పేర్కొంటాను:

'పద్యం వెళ్ళి మంచి (అను) రాగంతో నిక్షేపంగా కాపరం చేస్తూంటే చూడలేక, ఆ కలయిక చెడగొట్టి, దంపతులకి విడాకులు ఇప్పించి, పద్యాన్ని బోడించి, క్షౌరం చేయించి కూచోబెట్టిస్తున్నానని అంటున్నారు. పద్యరాగ సంబంధం అసలు 'కాపరం' అయి ఉంటే గదా నేను విడాకులు ఇప్పిస్తున్నాననడం? సుప్రసిద్ధుడైన కీర్తన కర్తమాటలకీ అతడే నిర్ణయించి సూచించే రాగానికీ దాంపత్యం అంటారా, అదినేనుఒప్పుకుంటాను. కాని, ఏ పద్యం అయినాసరే ఏ రాగంతోనైనాసరే, ఎల్లాంటి అవస్థలోనైనాసరే, కలిసి లేచిపోవడానికి సబబులు చెప్పేనోటితోనేనా, పద్యరాగాలకి దాంపత్యం అనడం? ఇక, పద్యాన్ని నేను బోడించమనలేదే? రాగపు సవరం పెడితేగాని పునిస్త్రీలాగా కనిపించని పద్యం అసలు బోడిదేనన్నమాట! మరి దాన్ని బోడించడానికి ఎవ్వరూ శ్రమపడనక్కర్లేదు.''

కంపెనీ నాటకాలను, వాటిని ఆడించే కాంట్రాక్టర్లను, నటుల ప్రవర్తనను, చీటికీ మాటికీ వన్సుమోర్ కొట్టే ప్రేక్షకులను హేళనచేస్తూ కామేశ్వరరావుగారు వేరే వ్యాసాలు కూడా రాశారు. అవి 'మేజువాణీ' అనే సంపుటిలో ఉన్నాయి. అందులోని 'వన్సుమోర్' అనే వ్యాసంలో ఒక చిన్న భాగం:

''ఒక సావిత్రి ప్రదర్శనంలో సత్యవంతుడు వేసిన రావు ఒక రమ్యమైన కీర్తన పాడిమూర్ఛిల్లాడు. జనం వన్సుమోర్ అని గోలెత్తారు. అనగా, చచ్చినవాడు మాబాగా చచ్చిపోయాడు. లేచి మళ్ళీ చస్తేగాని మాకు తోచకుండా ఉంది. అని! తద్దినపుగార్లు తిన్నసాయిబు తద్దినానికి వన్సుమోర్ కొట్టినట్టు! సత్యవంతుడు లేవలేదు. సభవారు ఇంకా గట్టిగా కూశారు, బుసకొట్టారు. గర్జించారు. ఓంద్రపెట్టిదరువేశారు. అంటే నాటక సభవారి కుండే హక్కుల్లో కొన్ని మాత్రం ప్రకటించారు. అయినా సత్యవంతుడు లేవలేదు. మేనేజరు వచ్చి (అప్పుడింకా నాటక కంపెనీకి ఎవరో ఒక మేనేజరంటూ అహోరించేవాడు) సత్యవంతుడు తీరా మూర్ఛిల్లిన సందర్భములో లేచి మళ్ళీ యిదవడం అసందర్భం అని చెప్పాడు. 'సత్యవంతుడేమిటయ్యా! ఆ రావు లేచి మళ్లీ పాడతాడా ఏమన్నాకావాలా! అని సభవారు మార్దవంగా అడిగారు. రావు. లేచి మళ్లీపాడి, మళ్ళీ మూర్ఛిల్లాడు ఖాయంగా. ఒకనటుడు రంగంమీంచి హుషారీగా నిష్క్రమించాట్ట. అతనికి వన్సుమోర్ కొట్టి వెనక్కి వచ్చి మళ్ళీ నిష్క్రమించమన్నారు సభ్యులు. ఒకచోట విశ్వామిత్రుడు హరిశ్చంద్రుడి కిరీటం తన్నుతూంటే

తాపుదూసుకుపోయింది. ఆపలంగా జనం వన్సుమోర్ అన్నారు. దాంతోటి విశ్వామిత్రుడికి కోపం రెచ్చిపోయి సాగదీసి మళ్ళీ తన్నడంలో అతడి కాలి పాంకోడు హరిశ్చంద్రుడు కణతకి ఠకీమని కొట్టుగోడం, హరిశ్చంద్రుడు మూర్ఛిల్లడం తెరవెయ్యడం, బోలెడు జరిగింది."

'తాగ్యరాజు ఆత్మ విచారం'లో కామేశ్వరరావుగారు ఆరువందలపైగా త్యాగరాజుకృతులకు తన శైలిలో క్లుప్తంగా తాత్పర్యం రాశారు. ఆ గ్రంథం అవతారికలో త్యాగరాజు వ్యక్తిత్వం గురించి, సంగీత సాహిత్యాల గురించి, కీర్తన స్వరూపం గురించి. కచేరీలలో త్యాగరాజ కీర్తనలను పాడుతున్న తీరు గురించి హాస్య ధోరణిలో చాలా రాశారు. త్యాగరాజు గురించి ఆయన చెప్పిన మాటల్లో కొన్ని :

"అతడు సంగీత సాహిత్యాలను దుప్పటించాడు. తెలుగు సంస్కృతాల్ని మేళగించాడు. గ్రాంథిక వ్యావహారికాల్ని సిమెంటు చేశాడు. సగుణ నిర్గుణత్వాల్ని సమపాళం చేశాడు. వైష్ణవ శైవాల్ని 'పడుగూ-పేకా' చేశాడు. లౌకిక వైదికాల్ని మట్టం చేశాడు. పశుత్వ దివ్యత్వాల్ని ఒకే రాట కట్టేశాడు. భూతవర్తమానాల్ని రంగరించాడు. పురాణ ప్రత్యక్షాల్ని ఏకపాశం చేశాడు. అరవత్వ ఆంధ్రత్వాల్ని కర్ణాటించాడు. వాస్తవికత్వ అవాస్తవికత్వాల మధ్య తెరతీసేశాడు. ముగ్గురు మూర్తులకీ మూడు నీచపు పన్లకి యాజమాన్యాలు ఇప్పించి వాళ్ళని కింద కూచోబెట్టేశాడు. పది అవతారాల్నీ గుండకొట్టేసి తన రాముణ్ణి సృష్టి చేసుగుని అతణ్ణి ఆఘ్రాణించి, విని, చూసి, స్పృశించాడు. తను పుట్టింది తన ఆశ చొప్పున తనూ రామమహిమ వర్ణించడానికే అని చెప్పేశాడు"

ఇంకో వాక్యం :

"శ్రీ నారదముని" అనే కీర్తన యొక్క వాలకమూ, భాషాభావాలూ, ఉపమానాలూ చట్రమూ చూస్తే, అది, ఒకే క్షణంలో అనేకమందికి నారదుల వారు కనిపించారడానికి 'ఎందరో మహానుభావులు' లో సీటుదొరకని ఎవడో మహానుభావుడు బనాయించినట్టు ఉంది గాని 'త్యాగరాజత్వం' అందులో బొత్తిగా లేదు'.

ఇతర రచయితలు మడిగట్టుకుని గంభీర పదజాలంతో చెప్పే విషయాలను కామేశ్వరరావుగారు ఎంత సరదాగా తేలిక మాటలతో, సూటిగా చెబుతారో చూపించడానికి ఆ వాక్యాల్ను ఉదాహరించాను.

'తాగ్యరాజు ఆత్మ విచారం' కాకుండా కామేశ్వరరావుగారు ఇంకో రెండు వ్యాసాలు విడిగా త్యాగరాజుపై రాశారు. అవి వేరే సంపుటాలలో ఉన్నాయి. సమకాలికుడైన ఒక మహానుభావుణ్ణి బతికున్నన్నాళ్ళూ అవమానించి, చచ్చిపోయాక అతడికి దైవత్వం ఎలా ఆపాదిస్తారో 'త్యాగరాజు మాటలు' అనే వ్యాసంలో కామేశ్వరరావుగారు యిలా రాశారు:

"బతికున్నన్నాళ్ళూ వాణ్ణి ప్రజలు కాల్చుగుతిని, వాడు కాలాతీతమైన తన కృతి సృష్టించడంలో పడే శ్రమకి మరో సమిధ తగలిస్తూండి, తీరా వాడు బకతలేక చచ్చిపోయింతర్వాత వాడికి తద్దినాలు పెట్టడానికి ఎగబడతారు. అంటే, అటువంటి ప్రజ్ఞ గలవాడు బతికున్న కాలం అంతా చచ్చినట్టుండి, చావడంతోటే బతకడం మొదలు పెడతాడు. వారు బతికున్నప్పుడు ఎంతెంత శ్రమపడి, ఎన్నెన్ని గంటలు ఎక్కడెక్కడి సంగతులు ఎల్లా ఎల్లా సేకరించి శరీర పోషణ ఎల్లా ఎల్లా నిర్లక్ష్యం చేసి, తన మెప్పు గురించి కళ్ళల్లో నిప్పులోసుగునే వాళ్ళ నుంచి తప్పుగుంటూ, తన కృతి సాగించుగునే నిమిత్తమే తన సర్వస్వం ఏ రీతిగా ధారపోస్తాడో చూడక, వినక, అర్థం చేసుగోక, నమ్మక, క్షమించక, ఊరుకోక ఉరెట్టుకుని, వాడు గతించగానే వాడికి తేజస్సూ, వర్చస్సూ, మాహాత్మ్యం, దివ్యత్వం ఇవన్నీ తెచ్చి కట్టబెట్టి, వాణ్ణి బహువచనంలో సంబోధించి, దేవతల్లో జమకట్టి, శుద్ధ అబద్ధాలతో కూడిన కట్టుకథలు కల్పించి, అవి నమ్మని వాళ్ళకి కళ్లోతాయని శపించి, ఆ ప్రజ్ఞావంతుడి ప్రజ్ఞ అంతా సహజ ప్రజ్ఞే అనీ, అందులో శిక్షిత ప్రజ్ఞ రవంతైనా లేనేలేదనీ, ఒకనాటి సాయంత్రం దాకా వాడు మొద్దు వాలకంగా శతబండలా ఉంటూంటే, ఆ రాత్రి పరమాత్ముడికి (ఇతర పనిలేక) వాడి మీద దయ కలిగి, వాణ్ణి "నాలిక ఇల్లా పట్రా, గాత్రం ఏదీ ఇల్లాతే, చెయ్యో మాటయ్యి" అన్నట్టు వ్యవహరించి, వాడికి వీలును బట్టి అఖండ కవిత్వమో, అపారగానమో, అమోఘ చిత్ర కళో దఖలు పరచి చక్కా బోతాడనిట జనం లొట్టలేస్తూ కళ్ళు తెరిచి చెప్పుగుని చప్పరిస్తారు"

ఒక్క వాక్యం కోట్ చేద్దామని మొదలెడితే అది ఇలా జిలేబీ చుట్టలా చుట్టుకుపోతుంటే మధ్యలో ఆపడం ఎలా? మొత్తానికి ఎలాగో ఇప్పటికి భకారా హాస్యం తాలూకు అన్ని పార్శ్వాలను తడిమి చూసినట్లయిందనుకుంటున్నాను.

**కరుణరసం కావాలా? గ్లాసులతో పోసుకో!**
**బీభత్సం కావాలా? బిందెలతో పోసుకో!**
**భయానకం కొరత లేదు - బ్రతుకంతా అదేగా!**
**హాస్యరసం కావాలా? చంచాతో వేసుకో!**

**-డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**



# మునిమాణిక్యం రచనలలో హాస్యం

-శ్రీ సుధామ

ఆనందో(బ్రహ్మ అన్నారు. సృష్టికి హేతువు, స్థితికి సేతువు, లయ అనంతర శాశ్వతత్వ ధాతువు ఆనందం. జనన మరణాతీతమైన శాశ్వతముక్తిని కూడా బ్రహ్మానందమనే అన్నారు. అన్ని కళలు ఆనందం కోసమే. మనిషి పుట్టుక, మనుగడ, మృత్యువు కూడా ఆనందం కోసమే.

హాస్యలహరి అంటే వేదాంతలహరి మొదలైందేమిటా అని అనుకోకండి! వేదాల అంతమైనా, వేదనల అంతమైనా ఆనందం కోసమే. ఆ ఆనందం యొక్క బాహిరరూపమే హాస్యం అన్నారు. హాసం కలిగించేది హాస్యం. నవ్వించేది హాస్యం. అయితే సహృదయుడూ, ఆరోగ్యవంతుడూ, సంస్కృతమతీ, నాగరికుడూ అయిన వాళ్లే నవ్వించేదే ఉత్తమహాస్యం అనీ, అలాకానిది హాస్యంగా అనుకోవడం హాస్యాస్పదమనీ గుర్తించాలి.

అయితే తమాషా ఏమిటంటే చాలా సున్నితమూ, రసగ్రహణ చేయగలవారికే గోచరించే సత్యమూ అయిన ఈ హాస్యం- నవరసాల్లో శృంగార కరుణల మధ్య ద్వితీయంగా పేర్కొనబడిన అద్వితీయ రసం. శృంగారానికి వెన్నంటి వెన్నుదన్నుగా నిలిచేదీ, పరిపక్వమై కరుణగా మనిషిని మనీషిని చేయగల మానవీయ స్పందనలకు ప్రాతిపదిక కాగలిగేదీ హాస్యమే. 'నవ్వినా ఏడ్చినా కన్నీల్లే వస్తాయి' అంటే అది నిజమైన రసస్థాయి అనే. గొప్పగా నవ్వించే ఛార్లీఛాప్లిన్ వంటి హాస్యనటుల జీవితాలలోని కరుణకాంతులు గురించి అందుకే సహృదయ విమర్శకులు విశదీకరిస్తుంటారు.

'లాఫ్ విత్ ఎనీబడీ బట్ డోంట్ లాఫ్ ఎగైనస్ట్ హిమ్' అని హాస్యం గురించి పేర్కొన్న వారే, హాస్యం గొప్పదనాన్ని చెబుతూ - 'ఇట్‌లైటెన్స్ ది హార్ట్ బట్‌ది ప్రోసెస్ టు అరైవ్ ఎట్ ఇట్ రిక్వయిర్స్ సీరియస్ థింకింగ్' అన్నారు. అందుకనే క్లిష్టతరమైనదీ, కష్టతరమైనదీ నిజమైన హాస్యం. నవ్వు వికృతితో జనించడమే జనానికి ఎక్కువగా తెలుసు. ఎందరు కవులూ, రచయితలూ, కళాకారులూ వున్నా అందుకే - హాస్యవైదుష్యం కలవాళ్లు కొంచెం మందే వుంటారు.

ఆలంకారికులు కూడా-

"వికృతాకార వాగ్వేష చేష్టాదేర్నర్తకాద్భవేత్<br>
హాస్యోహాసః స్థాయీ భావః" అనేశారు

వికృతమైన ఆకారమూ, వేషమూ చేష్టలూ, భాష వీటివల్ల హాస్యం పుడుతుంది అన్నారు. వేషం వల్లా, చేష్టవల్లా పుట్టే హాస్యం బాహ్యామైనది. కానీ భావంతో జనించే హాస్యం ఆంతరమైనది. భావంతో అది అభివ్యక్తి కావడానికి భాష అవసరం. వికృతమైన వేషంతో, చేష్టలతో నవ్వించడం కంటే, భాషా సంబంధంగా రచనా చమత్కృతితో నవ్వించడానికి మేధాసంపత్తి కావాలి. అందుకే అన్ని రచనలకన్నా హాస్యరచనలు చేయడం మరీ కష్టం.

అందునా - తెలుగులో హాస్యం అనేసరికి జుగుప్స, మొరటు, అవహేళన, ఎగతాళి, వెక్కిరింత, ఏవగింపు, అసభ్యత, అవినీతి ఇవన్నీ ఆక్రమించి - 'హాస్యం' అనే దాని స్థాయినే ప్రథమగణ్యం కాదుసరికదా, ఒక్కోసారి అధమస్థాయికి గురిచేసాయి, చేస్తున్నాయి. ప్రాచీన సాహిత్యంలోని హాస్యం, నాటకాల విదూషకులూ, కేతిగాళ్లూ, గంధోళిగాళ్లూ వికృతి జన్యమైన హాస్యాన్ని సృష్టించిన మాట నిజమే గానీ, ఆ నవ్వులో ఉదాత్తత లోపించనట్లే అనిపిస్తుంది. కుంటి, గుడ్డి, చెవిటి, నత్తి వంటి పాత్రల ద్వారా సృష్టించబడిన హాస్యం నేడు మనం నిరసిస్తున్నా, అదొకరకం హాస్యంగానే, ఆ మాటకొస్తే చాలా మటుకు ఆ బాపతుదే హాస్యంగా - చెలామణి అయింది. వెకిలి హాస్యమూ హాస్యమే కావచ్చు కానీ, అది సభ్యనాగరికత అనిపించుకోదుమరి!

ఆంధ్రసాహిత్యంలో సరిగా కాలూనని ఆరోగ్యకరమైన హాస్యానికి-గట్టి పునాదులు వేసి, తరతరాలు తెలుగువారు హాయిగా, ఆనందంగా నవ్వుకుంటూ విహరించడానికి ఒక రమ్యహాస్య మందిరాన్ని నిర్మించి ఇచ్చారు శ్రీమునిమాణిక్యం అని కీర్తిశేషులు పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి గారు వేసిన అంచనా సరియైనది. విహసితం, ఉపహసితం, అపహసితం, అతి హసితం కాక ఉత్తమమైన స్మితానికీ, హసితానికీ సంబంధించి సహృదయుడూ, విజ్ఞుడు, దయామయుడూ, నాగరికుడూ, సంస్కారీ అయిన పాఠకుడు ఆనందించే ఆరోగ్యకరమైన హాస్యాన్ని ఇరవయ్యో శతాబ్దంలో భమిడిపాటి, మొక్కపాటీ, మునిమాణిక్యం అనే హాస్యత్రయమే పాదుకొల్పిందని, గురజాడ, వీరేశలింగం, చిలకమర్తి, పానుగంటి వారల హాస్యంలో కూడా ఎగతాళాలూ, వెక్కిరింపులూ, వెటకారాలూ, కొంత మొరటూ ద్యోతకమౌతాయని అనే మాటలోనూ యదార్థం లేకపోలేదు.

మేలిరకమైన హాస్యాన్ని తన రచనలకు జోడించి, లలితంగా, నాజూకుగా శబ్ద భావాశ్రయాలతో బాటు అర్థ సంబంధిగా కూడా సంతరించి, పదికాలాలపాటు పఠించి ఆనందించగల అవకాశం - తెలుగు వారికి కాన్కపెట్టిన, మునిమాణిక్యం అందుకే నిజంగా విశిష్టులు.

"నేను వ్రాసిన మొదటి కథ టీ కప్పులో తుఫాను. ఒక చిన్న శృంగార కలాపం అందులో కథావస్తువు. అందులోనే కొంతం కనబడుతుంది. అప్పటి నుండి ఇప్పటిదాకా కాంతం లేకపోతే కథేలేదు" అని ఒకచోట ఆయనే స్వయంగా చెప్పుకున్నారు. తెలుగు సాహిత్యంలో 'కాంతం'

ఒక అజరామరమైన పాత్ర. దాంపత్య జీవితపు సరససరాగాల అందచందాలను మధ్యతరగతి భిత్తికపై నిలిపి, గృహమనే స్వర్గసీమనూ, ఇల్లాలు అనే బంధాన్నీ పటిష్టపరిచిన రచనలు మునిమాణిక్యం వారివి. 'కాంతం' పాత్రను ఆయన సృష్టించి ఉండకపోతే, ఆ కాలంలో భావకవులు ఒకవంక సృష్టిస్తున్న భావనా ప్రేయసులు చలం స్త్రీవాదంతో రేపిన ఝంఝూ మారుతాలు పాఠకులను మరింకెటో నెట్టుకుపోవడం జరిగేదేమో!

''నాకు రాబందుల రెక్కల చప్పుడూ ఝంఝూనిలషడ్జధ్వానం వినిపించవు. కణకణమండే త్రేతాగ్నులూ, అగ్నికిరీటపు ధగధగలూ కనిపించవు. పదండి ముందుకు అని నేనసను. ఇంట్లోనే ఉండమంటాను. ఆవిడిచ్చిన కాఫీతాగి హాయిగా పిల్లలతో ఆడుకోమంటాను. సుఖదుఃఖాలు అనాదిగా ఉన్నవే. ఇకముందు కూడా ఉండేవే. మనం ఎంత గుండెలు బాదుకున్నా పోవు. ఏదో కలో అంబలో తాగి తృప్తిగా జీవించమంటాను. జీవితానికి తృప్తీ ఆనందమూ దేనివలన కలుగుతుందో దాన్నే కథా వస్తువుగా, కావ్యవస్తువుగా తీసుకుంటాను. అదే చెప్తాను. అయితే దాన్ని వీలైనంత రమ్యంగా చెప్తాను'' అంటారు మునిమాణిక్యం.

ఆయన 'కాంతం' పాత్రను సృష్టించి నిజానికి మహిళాసాధికారికతకు మకుటం పెట్టాడు. కాంతం ముగ్ధ, ప్రౌఢ. ఆమె గయ్యాళితనం-జాణతనం తప్ప మరేమీ కాదు. 'దాంపత్యోపనిషత్తు' వెలయిస్తూ 1954లో 'మునిమాట'గా ఆయన చెప్పిన మాటలు- ఆయన రచనాశయాన్ని స్పష్టం చేస్తాయి-

*''హరిణీప్రేక్షణా యత్ర గృహిణీ న విలోక్యతే*
*సేవితం సర్వసంపద్భిరపి తద్భవనం వనమ్*

ఏ భవనంలో కురంగీనయన అయిన గృహిణి కనపడదో, ఆ భవనం సకల సంపత్తుల కూడుకున్నప్పటికీ అడివే అవుతున్నది. కానీ భవనం కావడం లేదు. గృహానికి గృహలక్ష్మి ఉండాలె అన్నాడు పండిత రాజు.

దాంపత్య జీవితాన్ని రమ్యంగా చిత్రంచాలని నా అభిలాష. మంజులమయిన మధురవాక్కులతో కథాకథనం చెయ్యాలనీ, గార్హస్థ్య జీవిత సౌందర్యమును మనోహరంగా ఆవిష్కరణ చేయాలని ముప్పది సంవత్సరాల నుంచీ ప్రయత్నం చేస్తున్నాను. ఏదో కొంతవరకు నా కోరిక నెరవేరిందనే నేను అనుకుంటున్నాను.

రంభలు, నలకూబరులు, హంసలు, చిలుకలు, రాయబారాలు లేకుండానే వాస్తవ జీవితంలోని మధుర తమమైన ఘట్టాలను తీసుకుని చిత్రంలో కళారూపం పొందేలాగున చెయ్యడానికి నా శక్తులన్నీ ధారపోసినాను.

జీవిత రామణీయకము మహారాజుల ఉన్నత సౌధాలలోనూ, ఉద్యాన వనాలలోనూ

మాత్రమే కాక రసవిహీనమనుకున్న సామాన్య గృహస్థ జీవితంలో కూడా ఉన్నదని చూపడానికి నేను నా జీవితం అంతా ప్రయత్నించాను'' అని పేర్కొంటారాయన.

హాస్యం గురించి మునిమాణిక్యం వారికి వున్న స్పష్టమైన అభిప్రాయం కూడా ఆ 'మునిమాట' లోనే ఉంది-

హాస్యరస ప్రధానమైన రచనను ఉత్తమ రచనగా పరిగణించే ఆచారం మనకు లేదు. కరుణకూ శృంగారానికీ ఇచ్చిన గౌరవం దీనికి ఎప్పుడూ లేదు. కానీ హాస్య రసం కూడా రమణీయమైనదే. దీనికీ గౌరవమూ, ఆదరణా ఇయ్యవలసి ఉంది. హాస్యం తేలిక అయినదనీ బరువు లేనిదనీ అంటారు. బరువు లేకపోతే నేమి? బంగారం లాంటి సరుకు ఇది. జీవితానికి ఆనందాన్ని ఇస్తుంది. అంతకంటే ఏం కావాలి? హాస్య సృష్టికి కూడా ఒక విశిష్టమైన దృష్టి , ఒక రకమైన ప్రతిభ కావాలి. దీనికి తేలిక తనం ఎందుకు వచ్చిందీ అంటే, ఇది అందరికీ అర్థము అవుతుంది కాబట్టే. పద్యాలు అర్థం కాకపోయినా బాగానే ఉంటవి. పద్యం అర్థం కాకపోయిన కొద్దీ దానికి గౌరవం ఎక్కువ అవుతుంది. దాని కావ్యగుణం కాడా పెరుగుతుంది. దాని సంగతి అల్లా ఉంచండి. అర్థం అయినంత మాత్రాన హాస్యం ఏమీ తక్కువది కాదు.

హాస్యం అర్థమైనట్లు ఉంటుంది. కానీ నిజానికి బాగా అర్థం కాదు. దాని లోతులు తెలియడమూ కొంచెం కష్టమే. కవిత్వం ఎట్లా అర్థం చేసుకుంటారో, హాస్యాన్నీ అట్లాగే అర్థం చేసుకోవాలె. లోతుపాతులు వెదకి కనుక్కోవాలె. మెరుగుల లోపల ఉన్న చమత్కారపు లోతు తెలిసికొని ఆనందిస్తే ఇంక కావలసినది ఏమున్నది'' అంటారాయన.

వినోదానికి రాసిన గ్రంథాల వల్ల కలిగే విజ్ఞానం, వికాసం నిజానికి విశిష్టతలో వేటికీ తీసిపోయేవి కావు. ఆయనే అన్నట్లు ఆయన రచనల్లో ఏది ఉన్నా ఏది లేకపోయినా - 'అది' ఉన్నదని ధైర్యం. ఏమిటి 'అది?' పాఠకుణ్ణి పుస్తకం చివరదాకా లాక్కుని వెళ్ళే గుణము 'అది' ఉన్నది. దానిని రసం అనచ్చు. రమణీయత్వం అనవచ్చు.

మునిమాణిక్యం హాస్యం లోని వైశిష్ట్యాన్ని అందుకునే ముందు ఆయన జీవితరేఖలు స్థూలంగా:

మునిమాణిక్యం నరసింహారావుగారు సంగం జాగర్లమూడి అనే గుంటూరు జిల్లాలోని ఒక గ్రామంలో హేవిళంబి నామ సంవత్సరం ఫాల్గుణ బహుళ అష్టమినాడు అంటే 1898వ సంవత్సరం మార్చి నెల 15వ తేదీన జన్మించారు. సంప్రదాయ కుటుంబమే అయినా కలిగిన వారు మాత్రం కారు.

ఆయన తల్లి పేరు రుక్మిణమ్మ. తండ్రి సూర్యనారాయణ. మునిమాణిక్యం వారి తండ్రి

గారయిన సూర్యనారాయణగారు కూడా మంచి హాస్య సంభాషణ చతురులే. బహుశా అదే వారసత్వం తండ్రి నుంచి ఆయన పుణికి పుచ్చుకున్నారు. తండ్రి ఉపాధ్యాయవృత్తిలోనే ఉండేవారు. ఆ వారసత్వమూ ఈయనకు వచ్చింది. మునిమాణిక్యం చిన్నతనంలోనే తల్లి రుక్మిణమ్మగారు మృతిచెందారు. మేనత్తగారింట పెదరావూరులో మునిమాణిక్యం బాల్యం గడిచింది. తెనాలి, విజయవాడలలో ఉన్నతపాఠశాల చదువును, గుంటూరులో ఇంటర్మీడియట్, ఆ తరువాత విజయనగరంలో శ్రీ కొండా వెంకటప్పయ్య గారి ధనసహాయంతో కళాశాల చదువు పూర్తిచేసి, బి.ఏ. డిగ్రీ పొందారు. 1923లో రాజమండ్రిలో ఎల్.టి.పూర్తి చేసారు. ఆ తరువాత సుమారు ముప్పై ఏళ్లు గుంటూరు, భీమవరం, ఎడ్లపాడు, వేటపాలెం, మచిలీపట్నం, వరంగల్ జిల్లా బచ్చన్నపేట ప్రాంతాలలో ఉపాధ్యాయునిగా, ప్రధానోపాధ్యాయునిగా చేసి ఆ తర్వాత ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో విద్యావిషయిక కార్యక్రమాల ప్రొడ్యూసర్‌గా చేసి, పదవీ విరమణ అనంతరం ఆంధ్రసారస్వత పరిషత్తు తెలుగుపండిత శిక్షణా కళాశాలలో అధ్యాపకులుగా, ప్రధానాధ్యాపకులుగా అయిదుసంవత్సరాలు పని చేసారు. ఉపాధ్యాయునిగా వేలాది మంది శిష్యుల అభిమానం పొందారు. రేడియోలో రసాత్మకమైన శ్రవ్య, దృశ్యనాటికలు రచించారు.

బి.ఏ. చదువుతున్న రోజుల్లోనే ఆయనకు సాహితీ సమితి సభాపతి తల్లావఝుల శివశంకరశాస్త్రిగారి ప్రోత్సాహం లభించింది. "ఇన్ని కబుర్లు ఇంత ఆసక్తికరంగా చెబుతావుకదా! ఇవే కథలుగా మలచి వ్రాయకూడదూ" అన్నారట శివశంకరులు ఒకనాడు. ముందు మునిమాణిక్యం కూడా పద్యాలు, గేయాలు రాసారు. 'గాజులపెట్టి' పేర ఆయన కవితల సంకలనం వెలువడిందిట. ఆ తరువాత కథానికలు, గల్పికలవైపు ఆయన దృష్టి మళ్లింది. భావకవుల అమలినశృంగార భావాన్నీ, చలం ఉద్ఘోషిస్తున్న స్త్రీ స్వేచ్ఛనూ గమనించిన మునిమాణిక్యం-మధ్యతరగతి తెలుగుకుటుంబాల దాంపత్య సాంసారిక జీవన మాధుర్యాన్ని నిలబెట్టే రచనలకు సమకట్టాడు. అనురాగ సుధలతో రసానంద ఫలాలు పండించే ఇల్లాలుగా స్త్రీమూర్తిని నిలపడానికే - ఆయన అనురాగవతి, సంభాషణా చతురమతి అయిన తన ధర్మపత్నే స్ఫూర్తిగా - 'కాంతం' పాత్రను సృష్టించారు. మునిమాణిక్యంగారి భార్య పేరు 'కాంతం' కాదు. ఆమె పేరు శేషగిరమ్మ. కాంతం భర్తగా 'నేను' పేర చిత్రించే పాత్రకు - మునిమాణిక్యం ఇచ్చిన పేరు వెంకట్రావు. తన స్వీయానుభవాలనే వెంకట్రావు, కాంతం పాత్రలద్వారా కమనీయమైన కథలుగా మలిచారు మునిమాణిక్యం. ఆయన తొలి కథల సంకలనం 'కాంతం కథలు'గా 1927లో అచ్చయింది. ఆ తరువాత నేను మా కాంతం 1933లో అచ్చయింది. 'కాంతం కైఫీయతు', 'కాంతం కాపురం' వంటి సంకలనాలు ఆపై వెలువడ్డాయి. 1938లో మునిమాణిక్యం భార్య శేషగిరమ్మ మరణించింది. అదే ఏడాది పెద్దకూతురు రుక్మిణి మరణం కూడా ఆయనను కృంగదీసింది.

హాస్య, శృంగార రసాలనే అంతవరకూ తన రచనలకు ఆలంబనం చేసుకున్న మునిమాణిక్యం, అప్పుడు కరుణ రస ప్రాధాన్యం గల రచనలు చేసారు. అందుకు తార్కాణం ఆయన రాసిన మూడు నవలికలు అవి 'తిరుమాళిగ', 'రుక్కుతల్లి', 'దీక్షితులు'.

మునిమాణిక్యం ఆ తరువాత సంస్కరణ దృక్పథంతో మళ్లీ పెళ్లిచేసుకున్నారు. ఆయన ద్వితీయపత్ని రాజ్యలక్ష్మమ్మగారు. ఆయన రచనావ్యాసంగంలో హాస్యంకే పెద్దపీట. 'తిరుగుబాటు', 'గృహప్రవేశం' అనే నాటకాలు 'ఆడబడుచు', 'జయమ్మ కాపురం', ఇబ్బందులు' , 'ఎలోప్‌మెంట్', 'కరువురోజుల్లో కాంతమ్మ ఇంట్లో', 'దొంగనాటకం', 'బ్రహ్మరాక్షసి', 'మరపు' , 'మేనరికం', 'సంవత్సరాది పండుగ', 'రాజబంది', 'విదూషకుడు', 'వెలుగు' వంటి పలునాటికలు రచించారు. అయితే వీటిలో సంభాషణాత్మకమైన సన్నివేశాలే ఎక్కువ. ఎక్కువ భాగం ప్రహసనాలుగా కూడా అనిపిస్తాయి. 'తిరుగుబాటు', నాటకం పుస్తకం మీద, సామ్యవాద దోహదం అనిపించేలా అట్టమీద సుత్తులు, కొడవళ్లు ఉండటంతో-వస్తువిషయం గమనించకుండా బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించిందట కూడాను. విద్యార్థులకోసం 'అన్నయమంత్రి', 'కింగ్ లింగ్‌ల కథ', 'వక్రలేఖ' వంటి రచనలు చేసారు. నవలలూ, కథలూ, నాటికలే కాక సున్నిత హాస్య చమత్కారాలను వెదజల్లుతూ 'వితండవాదాలు', 'మంచివాళ్లు-మాటతీరు', 'మాటనేర్పరితనం' , 'స్తుతి-ఆత్మస్తుతి', 'అప్పులు చేయడం - తీర్చడం', 'మాణిక్య వచనాలు,' 'ఇల్లూ ఇల్లాలు', 'ఇంటావిడతో పోట్లాట', 'ప్రణయ కలహం', 'భార్యను లొంగదీసుకోవడం ఎలా?' వంటి వ్యాసాలు, గల్పికలు వంటివి కూడా ఆయనకు మంచిపేరు తెచ్చిపెట్టాయి. 'హాస్యకుసుమావళి' పేర జోక్స్ సంకలనాన్ని తెలుగులో ఆ బాపతు పుస్తకాలు అధికంగా రావాలనే ఆకాంక్షతో మునిమాణిక్యంగారు వెలయించారు. అలాగే 'మనహాస్యము' పేర పి.హెచ్.డి. పరిశోధనకు మిన్న అయిన రీతిలో హాస్యం గురించిన ఒక రమణీయ పఠన యోగ్యమైన గ్రంథాన్ని సంతరించారు. శ్రీ ముట్నూరి సంగమేశంగారు హాస్యం మీద అంతకుమునుపే ఒక పుస్తకం రాసారనీ, ఆయన ఇచ్చిన హాస్య గర్భితమైన పద్యాలు తన సిద్ధాంత గ్రంథంలో కొన్ని వాడుకున్నాననీ, హాస్యపారిభాషిక పదాల సృష్టిలో కేశవపంతుల నరసింహ శాస్త్రిగారు తోడ్పడ్డారనీ పేర్కొన్నారు. హాస్యరీతులను అంత సవిస్తరంగా వర్గీకరించి, భేద ప్రభేదాలు విశదీకరించి, వాటికి పారిభాషిక నామ కరణం చేసి ఉదాహరణ సహితంగా వివరించడం నిజంగా గొప్ప కృషి. వయసుపైబడినా శ్రమకోర్చి అంతటి కృషి చేసిన మునిమాణిక్యం వారిని ప్రశంసిస్తూ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు 'వయస్సు, ఓపిక, అవకాశాలూ ఉండి బద్ధకించే కొందరు యువతరం వారు నిజంగా సిగ్గుపడి వారిని చూసి నేర్చుకోవాలి' అని చురకవేస్తారు. ఉపాధ్యాయవృత్తి నిర్వర్తించడం వలన పాఠకులు సరిగ్గా అర్థం చేసుకుంటారో లేదోనని విషయవివరణలు విస్తరించి చేయడం, పునరుక్తం చేయడం వంటివి వున్నా - 'మనహాస్యం' హాస్యరససిద్ధాంతాన్నీ, హాస్యలక్షణాలనూ నిరూపించే తొలి తెలుగు గ్రంథం అనవచ్చును.

వ్యక్తిగా మునిమాణిక్యం వారు పొట్టివారికిందే జమ. నల్లటి చాయే. ఆయనను చూస్తే వెంటనే ఎవరూ ఆయనలో అంత హాస్య ప్రియత్వం దాగి ఉందని అనుకోలేరు. కానీ ఆయనతో సంభాషణకి దిగితే ఆ 'చమత్కారిదారి' అందుకోగలిగేవారు అంతా. విశ్వనాథ, ముట్నూరి, చెరకువాడ నరసింహం వంటి పెద్దల చెలిమి, తల్లావఝుల, నోరి, జలసూత్రం వంటి వారితో సాహితీ సమితి సభ్యత్వం, దేవులపల్లి, బుచ్చిబాబు, స్థానం వారల స్నేహం - ఇవన్నీ కథకునిగా మునిమాణిక్యం వ్యక్తిత్వాన్నీ, ప్రతిభాపాటవాలనూ తీర్చిదిద్దిన అంశాలే. నిజానికి ఆయన సృష్టించిన 'కాంతం' అనే పేరు మునిమాణిక్యం వారి ఒక మిత్రుని సోదరిదట. ప్రభావ మంతా తొలి భార్య శేషగిరమ్మతో గడిపిన దాంపత్య జీవనానిదట. అవే ప్రాతిపదికలు అని ఆయనే చెప్పుకున్నారు.

మునిమాణిక్యం వారి హాస్య రచనా సంవిధానంపై వున్న మరో ప్రభావం 'బారీపెయిన్' అనే ఆంగ్ల రచయితదనవచ్చు. 19వ శతాబ్ది చివరలో ఇంగ్లీషు సాహిత్యంలో, విమర్శలో ప్యూరిటీ అనగా పవిత్రతను గురించిన కొన్ని సిద్ధాంతాలు వచ్చాయి. బారీపెయిన్ సాంసారిక జీవన మాధుర్యం వస్తువుగా తీసుకొని చేసిన రచనలు ఆయనకు ప్రేరణ కలిగించాయి. ఇంటి ఇల్లాలికి సాహిత్యంలో పట్టంకట్టిన ఘనత 'కాంతం' పాత్రద్వారా మునిమాణిక్యం వారికే దక్కుతుంది.

మునిమాణిక్యం కథకులుగా సుప్రసిద్ధులు కావడానికి- ఆయన కథనరీతి, శిల్పం, సన్నివేశకల్పన, సంభాషణ చాతుర్యం, భాష, శైలి వంటివన్నీ కారణాలే. తనదైన ఒక సహజతను, సరళతను ఆయన దానిలో సాధించారు. వ్యావహారిక శైలినే కాక కొన్ని రచనల్లో గ్రాంథిక పద్ధతిని వాడినా అది హాస్యాన్ని పరిపుష్టం చేసుకునేందుకే మలుచుకున్నారు. అలాగే 'శ్రీ కాంతాయమ్మారావు గారి కై ఫీయతు', 'దర్బారు దాని కథాకమామీషు' వంటి కథల్లో చరిత్రకు, సాంఘిక పరిస్థితుల అవగాహనకు సాధనంగా ఉండే మెకంజీ రాయించిన కైఫీయతుల ధోరణినీ, అలాగే 'కోర్టులో కాంతం' వంటి కథల్లో కోర్టు పరిభాషను పేరడీ చేసి హాస్యాన్ని సృష్టించారు. వ్యాసంలో, ఉపన్యాసంలో వారి సహజ హాస్య ధోరణికనిపిస్తుంది.

1968 ఫిబ్రవరి 1న ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మునిమాణిక్యం నరసింహారావుకు విశిష్ట సభ్యత్వం ప్రదానం కావిస్తూ చేసిన ప్రశంసలో అన్నట్లుగా- శ్రీ నరసింహారావు గారు హాస్య రసపోషణ ప్రౌఢి ప్రియంభావుకులు. ఎంత హాస్యోక్తి ప్రియులో అంత ప్రతిభాసంపన్నులు హాస్యలక్షణ విచక్షణులు నిరాడంబరులు. వారి యొడలెంత శ్యామలమో యెడదంత కోమలము. మాట యెంత లలితమో మతియంత నిశితము. వర్తనమెంత నిర్మలమో వైఖరి యంత ధార్మికము. సర్వాంధ్ర జనసాదర పఠిత సరసకృతి రచనా దురంధరులు వారు' అన్న ఏతాదృశ గుణగణ భూషిత సంవిధానాను సంధానం వారి రచనల్లో దర్శించగలం.

'హాస్యకుసుమావళిలో' ఆయన సంతరించిన కొన్ని నిర్వచనాలు:

గ్రంథకర్త : సమకాలికులను, స్నేహితులను విసిగించడంతో తృప్తిపడక ముందుతరాల వారిని ఏడ్పించడానికి ప్రయత్నించేవాడు.

బ్రహ్మచారి : అందరికీ తెలిసిన భార్యలేనివాడు. పక్కనుండి నిద్రలేచేప్పుడు ఏవైపు నుంచి అయినా దిగటానికి అవకాశం వున్నవాడు.

విసుగుపుట్టించే సంభాషణ : నీవు నిన్ను గురించి మాట్టాడాలని అనుకుంటూంటే అవతలివాడు తనను గురించి మాట్లాడడం ఆపకుండా సాగిస్తే అది విసుగుపుట్టించే సంభాషణ అవుతుంది.

స్వర్గం : ఒక ప్రదేశం. అక్కడకు ఎప్పుడూ వెళ్లని వాళ్లు, అక్కడకు వెళ్లే అర్హత లేనివాళ్ళతో దాన్ని గురించి గొప్పగా చెబుతారు.

కమ్యూనిజం : లేనివాళ్లందరూ ఉన్నవాళ్ల ఆస్తిని సమంగా పంచుకోటానికి వేసిన పథకం

అప్పుపుచ్చుకునేవాడు : ఏదో నీకొచ్చే దాంతోనే తన సంసారం కూడా గడవాలని చూసేవాడు

సామర్థ్యం: ఏదైనా పనిని నిర్వహించగల నేర్పు అంతకంటే బాగా చేయాలని కోరిక తాను చేయాల్సిన పనిని ఇతరుల చేత చేయించగల శక్తి.

మొదలైన: చెప్పిన దానికంటే ఇంకా ఎన్నో విషయాలు తెలుసుననే భావం చదివేవాడికి కలగచేయటానికి ఏర్పడ్డ గుర్తు.

నలభై ఏళ్ల క్రితం తన చిన్నతనంలో జరిగిన సంగతి అంటూ మునిమాణిక్యం 'హాస్యకుసుమావళి'లోనే ఓ విషయం రాసారు. గుంటూరు నుండి రైలు పోతున్నది. రైలు మంగళగిరి దాటిన తరువాత ముసలమ్మ ఒక రైలు కట్టవెంటనే గుంటూరువైపు నడుస్తూ ఉండటం చూశాడు డ్రైవరు. పాపం ఆమె వృద్ధురాలు. నడవలేక నడవలేక నడుస్తున్నది. ఆమెను చూచి డ్రైవరు జాలిపడ్డాడు. పోనీ రైలులో ఎక్కించుకుని గుంటూరులో దింపేద్దాము పుణ్యము అయినా ఉంటుంది అని అనుకొన్నాడు.

"అవ్వా గుంటూరుకేనా"

"అవును నాయనా"

"పెద్ద దానవు ఏం నడుస్తావు. రైలు ఆపుతా ఎక్కు గుంటూరులో దింపేస్తాను"

"మంచివాడవు నాయనా సంతోషమే కాని నాకు కొంచెము తొందరపని ఉందినాయనా ఏమనుకోకే" అన్నదా ముసలమ్మ.

★★★

ఏదో పనిమీద బయటకు వెడుతున్న కొడుకును నిలబడి చూచి కాంతం "ఎట్లా నడుస్తాడో చూశారా" అన్నదిభర్తతో.

"ఏం మామూలుగానే ఉంది" అన్నాను

"మామూలుగా ఉంది. వంకర కాళ్లతో... వంగి, తూలుతూ నడిచేవాళ్లకు నడకలో ఉండే దర్జాతనం ఏం తెలుస్తుంది? బెంగాలులో ఉంటారు చూశారూ జమీందారులు శరత్‌బాబు హేమచంద్రు... అదిగో అట్లాంటివాళ్లనడక అబ్బాయిది" అందిట కాంతం (దొరబాబు). భర్త నడకను భంగ్యంతరంగా ఎకసెక్కంచేయడం అది.



మునిమాణిక్యం వారు నిజానికి తెలుగు మాస్టారు కాదు హిస్టరీ, ఇంగ్లీషు మాస్టారు. ఆయన ఉపాధ్యాయునిగా ఉండగా తెలుగుపాఠాలు చెప్పమని నియోగించారట. 'డోంట్‌టాక్ సిట్‌డౌన్' ' అని గట్టిగా కోప్పడితే వచ్చే ఫలితం, 'మాట్లాడకు కూర్చో' అంటే అల్లరి కుర్రాళ్ల దగ్గర సత్ఫలితాలివ్వదనే మాట నిజమే అంటారాయన. తెలుగు క్లాసు తీసుకుంటుండగా 'ఒక కుర్రవాడు వచ్చి పాండిత్యాన్ని పరీక్షిస్తున్న వాడిలాగ 'లంగూడీ' అంటే ఏమిటండీ అని అడిగాడట. 'ఆ మాట ఎక్కడొచ్చిందిరా' అంటే 'వెంకయ్య వ్యాకరణంలోనండీ' అన్నాడట. ఈ మాటకు అర్థం చెప్పకపోతే వ్యాకరణ జ్ఞానం లేదనుకుంటారని ఆయన భయపడ్డారట. ఆ పూటకు గంటకొట్టే సరికి మర్నాడు అడగవచ్చాడా అనుకున్నారటగానీ, ఆ కుర్రాడు మర్నాడు అడగనే అడిగాడు. 'ఏ సందర్భంలో ఆ పదం వాడారో చూడాలి. పుస్తకంతే' అని తెప్పించి చూస్తే ఆ వాక్యం " అ ఆ ఇ ఈ లంగూడి అనిఉందిట". అలాగే మరోసారి ఇంకో కుర్రాడొచ్చి 'రావణాసురుడి ఇంటి పేరేమిటండీ' అని అడిగాడట. 'ఆ కాలంలో అలాంటివేం లేవబ్బాయ్' ' అంటే - "లేకేమండీ రావణుడి ఇంటిపేరు 'గాదె' వారండీ" అన్నాడట. "నీకెట్లా తెలిసిందిరా' ' అంటే పాఠ్యపుస్తకంలో ఉందని తెచ్చి చూపించాడు. అందులో ఉన్నది 'గర్వించి చెడిపోయె గాదె రావణుడు' అని విడదీసిచదవడంతో ఉత్పన్నమయ్యే హాస్యం అది.



శక్తి హీన పదప్రయోగం అన్నదాన్ని గురించి వివరిస్తూ మునిమాణిక్యం వారు 'మనహాస్యంలో' ఒక వృత్తాంతం చెప్పారు. ఒకసారి ఆయన రైలులో ప్రయాణిస్తుండగా కంపార్టుమెంటులోకి వెళ్లేసరికే ఓ పెద్ద మనిషి కూర్చుని ఉన్నాడట. ఆయనను ఎక్కడో చూసినట్లుందిగానీ ఎవరో గుర్తుకు రాలేదు. బైటప్లాట్‌ఫారం మీద నిలబడివున్న ఓ కుర్రాడితో ఆయన ఏదో మాట్లాడుతున్నాడు. ఎందుకో గట్టిగా కోప్పడుతున్నాట్ట కూడాను. ఆయన అన్న మాటలు ఇవి- "అల్లాగ తెల్లబోయి చూస్తావేంరా! స్కెనాజర్ ఒకటి తెచ్చిపెట్మంటే. స్కెనాజర్‌రా. స్కెనాజర్

అంటే తెలీదురా సన్యాసీ! ఇంత మాత్రం తెలీని వాడివి ఎలా బ్రతుకుతావురా'' ఆ మాటలు విని ఈయనా ఆశ్చర్యపడ్డాడు. ఆయన మునిమాణిక్యం వైపు తిరిగి ''బాబూ చూశారా ఈ కాలపు పిల్లలు తెలివి తేటలు ఒక స్కెనాజర్ తెమ్మన్నానండీ. మామూలు స్కెనాజర్. అయిన అదేమిటో వాడికి తెలీడం లేదు. వీడు ఎందుకయినా పనికొస్తాడంటారా'' అన్నాడు. 'ఈ కాలపు కుర్రాళ్లు వాడే వస్తువులు, కొన్ని నాకు కూడా తెలీదు నిజానికి, అదేమిటో మీరైనా చెప్పండి అని ఎక్కడంటాడో' అని మునిమాణిక్యం గారు భయపడుతూంటే, అతగాడు - 'స్కెనాజర్ కూడా తెలీకపోతే ఏం చదువులండీ వెధవచదువులు! ఇలాంటి వారు అడుక్కుతిని పోవాల్సిందే' '' అన్నాడు. ఈయన 'మరే మరే', అంటే, 'అడుక్కోడానికి మాత్రం ఎలా పనికొస్తాడండీ స్కెనాజర్ అంటే తెలీపోతే అన్నాడు. 'నిజం నిజం అంతేనండీ' అని ఈయన దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు పక్కకు తిరిగితే ' మాస్టారూ స్కెనాజర్ ఖరీదు రూపాయికంటే ఎక్కువ ఉంటుందంటారా' అని అడిగాడట. దానికి జవాబుగా ఈయన 'అబ్బే ఉండదండీ తక్కువ ఉండచ్చు' అని ఎందుకయినా మంచిదని - 'అయితే ఇటీవల అన్ని వస్తువుల రేట్ల లాగానే పెరిగి ఉండవచ్చు' అన్నారట. అలా పదినిమిషాలు స్కెనాజర్ గురించి ఈయన్ని రకరకాలుగా అనిపించి, ఆ తర్వాత విరగబడినవ్వాడట 'మాస్టారూ! స్కెనాజర్ మీరెప్పుడైనా చూసారా! నేనయితే చూళ్లేదు. అసలా పేరే విన్లేదు. నేను మీ విద్యార్థిని సరదాగా అలా మాట్లాడాను అంతే ఏం అనుకోకండేం' ' అన్నాడట. తన విద్యార్థి హాస్యచతురతకు ఆయన ఆనందించారు.



పోట్లాటలకు తలాతోకా ఉండదు అని చెప్పడానికి 'దాంపత్యోపనిషత్తుం'లో కలహస్వరూంపలో ఓ ప్రస్తావన చెప్పారు. ఏదో విషయం వచ్చి 'ఆయనకు చూస్తూ చూస్తూ పిల్లను ఎవ్వరూ ఇయ్యరు' అంది కాంతం ఒకతని గురించి, 'ఎందుకివ్వరు' అన్నాను. 'ఎట్లా ఇస్తారండి' 'ఏం ఎందుక్వికూడదు' 'ఆయన బర్మా వెళ్లి వచ్చాడండి' 'బర్మా వెళ్ళొస్తే పిల్లనియ్యడానికేం' 'ఏమో మీకు నేను చెప్పలేను బర్మా వెళ్లొచ్చినవాళ్లకు పిల్లను ఎవ్వరూ ఇయ్యరు' ఎందుకు అటువంటివాడికి పిల్ల నియ్యకూడదో నాకు అర్థం కాకపోవడం వలన పోట్లాట నలభై నిమిషాలు సాగింది. చివరకు ఆమెగారు ఒక మాట అంది. ''మీకు చచ్చినా అర్థంకాదు. బర్మా వెళ్లి వచ్చినవాళ్లకు చూస్తూ చూస్తూ పిల్లను ఎవ్వరూ ఇయ్యరు' నాకు వళ్లు మండి 'అసలు ఆయన బర్మా వెళ్లివచ్చాడని నీకెట్లా తెలిసింది' అని నిలదీసి అడిగాను. ఆవిడ జంకలేదు. అంగుళం కూడా వెనకడుగు వేయలేదు. నాకంటే పెద్దగా అరిచి చెప్పింది ''ఆయన బర్మా వెళ్లి వచ్చాడని చూచిన వాళ్లకు ఎవరికైనా తెలుస్తుంది. ఒక్కరు చెప్పక్కరలేదూ పెటక్కరనూ లేదు. అలాగ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ తూలుతూ నడవడం కనబడడం లేదుటండీ' ' అని తేల్చి చెప్పింది.



దాంపత్య జీవిత పరిణామ సౌఖ్యజనిత శాంతిసాధనకు ఒకటే మార్గం. ఏమిటంటే కొంపలో నీ మాట సాగాలని కలలోనైనా అనుకోకపోవటమే. అమె గారిదే హైకమాండు. ఇది అందరికీ తెలిసిన విషయమే.. గృహసామ్రాజ్యానికి ఆమె పట్టమహిషి అంటారు మునిమాణిక్యం.



సంగీత శాస్త్రంలో మంద్రస్వరం ఎలాంటిదో కలహశాస్త్రంలో సాధింపు అల్లాంటిది. ఇక్కడ కలహం కాశీ వద్ద గంగానదివలె మందగతిని పొందటం మనం గమనింపతగిన విషయం.

సాధింపులో కలహశక్తి లేతరంగులో ప్రకాశిస్తుంది.

ఒక చిన్న పొరబాటు జరిగితే దానిని బ్రహ్మాండమైన తప్పుగా నిర్ణయించి దానివలన రాగల ఆపత్తు ఒకటి ఊహించి అది వచ్చినట్లుగానే భావించి భర్తను నిందించడం అనే ప్రక్రియనే సాధింపు అంటారు. మగవాళ్లు సాధించలేరు. ఈ సాధింపు జయప్రదంగా జరపడం ఆడవాళ్లకే తెలుసు. ఈ ప్రజ్ఞ స్త్రీకి మాత్రమే ఉన్నది. మంత్ర శాస్త్రజ్ఞులు దీనికే స్త్రీ విద్య అని పేరు పెట్టి బోలెడంత గ్రంథం వ్రాశారు. అని వివరిస్తారాయన. గొడుగు పారేసాడు భర్త. భార్య మొదలు పెట్టింది. ''గొడుగు పారేశారుటండీ! మొన్ననే కదండీ కొన్నది! కొత్త గొడుగు! ఆ గొడుగు పారేయడానికి మీకు చేతులెట్లావచ్చినైయండి''

''పారేయాలని పారేశానా'' అంటాడు ఆయన

''ఆ:!... పారేయాలని పారేయకపోతే ఆయ్యో గొడుగు పోయిందే అని అనుకోనైనా అనుకోరేం మరి! చీమకుట్టినట్లు అయినా లేదే మీకు''

''అసలు మీ చేతుల్లో గొడుగు ఉంటుందా! పసివాడి చేతిలో గారెముక్క ఉంటుందా! తీసికెలుతున్నప్పుడే అనుకున్నా దీన్ని ఎక్కడో పారేసివస్తారని!

''అయ్యో నిక్షేపం వంటి గొడుగు! పది రూపాయలు! నేను రెవికలు కుట్టించుకుంటానండీ అని మొత్తుకున్నా వినక గొడుగు కొంటిరి. అయిదు రెవికలన్నా వచ్చేవి! ఒక సంవత్సరం పాటు రెవికలకు ఇబ్బంది లేకుండా ఉండేది. మీరెందుకు వింటారు! ఇంట్లో డబ్బు ఉంటే నేను రెవికలు కొనుక్కుంటానని మీకు తెలుసు. నాకు రెవికలు లేకుండా చేయాలనేగా మీరు గొడుగుకొని పారేశారు. రేపు ఆఫీసుకు ఎల్లా వెడతారు వానా కాలం కూడాను''

''ఏం, తడిస్తేతడుస్తానులే''

''అవునవును మీకేం మీరు వానలో తడిసి జ్వరం తెచ్చుకుని దర్జాగా పడుకుంటారు. చెయ్యలేక

నేను చావాలి. మీరు ఏమి చేసినా నన్ను అవస్థ పెడదామనేగా''

''పిల్లలు బడికి ఎల్లా వెడతారు! వాళ్లు తడుస్తారు! వాళ్లకు జ్వరాలువస్తవి! ఇంటిల్లిపాదీ జ్వరాలతో పడుకుంటే చెయ్యకేం చేస్తుందనేగా మీ ఊహ. ఎన్ని దురుద్దేశాలు లేకపోతే నిక్షేపం లాంటి గొడుగు పారేసి వస్తార్లెండి''

''మా అన్నయ్య సంవత్సరం నుండి జబ్బుతో తీసుకుంటునానడు. ఈ పదిరూపాయలు వాడికిస్తే మందుపుచ్చుకునేవాడు. దాంతో జబ్బు కూడా నయం అయ్యేది! అట్లానైనా చేయకపోతిని ఏది చేయనిస్తేనా! ఆలోచించనిస్తేనా! లటిక్కున గొడుగు కొనుక్కొస్తిరి. అస్సలు మీకు మా అన్నయ్య బ్రతకాలని ఉంటే గొడుగు ఎందుకు కొంటారు లెండి! పోతే పోయినాడని అనుకొనే గొడుగు కొనుకొచ్చారు''

''మాట్లాడు తారేమో! ఎందుకు మాట్లాడుతారు! అంతానా మాటలు విని ఈవిడ ఎంత గడుసుమనిషో అని అనుకోవద్దూ! అందుకనే మీరు మాట్లాడక పోవడం మీరు నోరుమూసుకుని నన్ను కోత కోస్తున్నారు

''అబ్బ! నిద్రపోనియ్యి''

''ఎవరొద్దన్నారు! నిద్ర పోండి మహారాజులాగా పొండి. గొడుగు పోయింది. నాకు రెవికలు లేకుండా పోయినవి! మా అన్నయ్యకు జబ్బునయమూ కాదు! ఇంకేం మీ కళ్లు చల్లబడ్డవిగా హాయిగా నిద్రపోండి'

'నిశ్చింతగా ఎట్లా నిద్రపోయినారు! అప్పుడే గురక కూడా పెడుతున్నారు'

'ఏం మనిషో అబ్బ!' - ఇది ఒకరకం సాధింపు

విషయము, అధికారము, ప్రయోజనము అనే అంగాలను గురించి సంపూర్ణ జ్ఞానం ఉన్నప్పుడే ఈ ప్రక్రియ జయప్రదంగా సాగుతుంది. ఈ ప్రక్రియ జరపడానికి అధికారి ఎప్పుడూ స్త్రీయే. సర్వకలహ ప్రపంచానికి స్త్రీ మూర్తియే అధిష్ఠానదేవత.

... సాధింపు గంగాస్నానాలవలె సకల మనోవైక్లబ్యమునూ కడిగి వేస్తుంది. కోపం అంతా ఆ రూపంలో వెళ్లి పోయిన తరువాత స్త్రీ మూర్తి కడిగిన ముత్యంలాగా కళకళలాడుతుంది. ఆమె ఆత్మ ప్రకాశిస్తుంది.



" నేను నిజంగా సంఘానికి లోకానికీ ఉపకారం, మేలు చేశాను. నేను ఆపని చేసి అధమము ఒక ప్రాణినైనా కాపాడినట్లు లోకం గుర్తించాలి'' అన్నాడు భర్త.

భార్య 'ఏమిటి ఆ మేలు'' అన్నది

'' ఆమేలు ఏమిటంటే నేను నిన్ను పెళ్లి చేసుకోవటమే'' అన్నాడు గృహస్తు.

★★★

ప్రారంభవాక్యంలోనే ఆకర్షించే కథా చమత్కృతి మునిమాణిక్యంది.

'పొద్దున్న ఎనిమిది గంటలైంది' అనే వాక్యంతో ''నిజం నిజం'' అనేకథ, ''ఏమిటండీ ఇవన్నీ అన్నది మా ఆవిడ'' అనే వాక్యంతో ది పెర్‌ఫెక్ట్ వైఫ్ అనే కథ, 'మన ఇంటి పక్కన ఉన్న వాళ్లని బట్టే ఉంటుంది మనసౌఖ్యం' అంటూ ఇరుగుపొరుగు అనేకథ మొదలౌతాయి. ఉత్కంఠకు ఊతం ఆ తొలి వాక్యాలే మరి!

★★★

పరమ ఆహ్లాదకరమైన కుటుంబ జీవితేతివృత్తాన్ని కథగా చెప్పిన మనస్వి ఆయన. 'ప్రయాణసన్నాహం'తో హంపీ వెడదామనుకున్న భర్తతో తానూ పిల్లలతో వస్తానంటుంది కాంతం. అతను ఏవేవో కబుర్లు చెప్పి తప్పించాలని చూస్తాడు. 'నారదుడు త్రిలోక సంచారి అయినా ఆయన భార్య వెంట వస్తానని ఎప్పుడూ అనలేదు తెల్సా' అంటాడు. 'అవునవును చాల్లెండి మీ కల్పనా మీరున్నూ... అసలు నారదుడికి భార్యలేదంటారే' అంటుందావిడ. 'ఎవరు చెప్పారు నీకు' 'ఎవరు చెప్పేదేమిటి నాకు తెలీదా?' మొన్న గుళ్లోమాఘపురాణం చదువుతున్నప్పుడు కూడా ఆమాటే విన్నాను.' 'ఇంతేకదా మాఘపురాణం వ్రాసే కాలం నాటికి ఆయనకు వివాహం కాలేదు. దాని తరువాత మత్స్య కూర్మ, వరాహాది పురాణాలు వ్రాసారు. వాటిలో ఆయన భార్య సంగతి ఉంది' అంటాడు. కథ చివర మా భార్యగారి మహాపతివ్రతామహత్యం వల్ల నా ప్రయాణం ఆగిపోయింది అని ముగుస్తుంది.

★★★

'పిల్లలుగల తల్లి' అనే కథ కాంతం మరణాన్ని వివరించేకథ. 'బద్‌నసీహత్' అనే కథలో కాంతం గడుసుదనం లేదుగానీ, కాంతం గారి భర్త సుఖప్రదమైన సంసారం కోసం తయారు చేసిన పద్ధతి ఒక ముసలిదంపతుల విషయంలో బెడిసికొట్టిన సమాచారం సాగుతుంది. భార్యని భర్త పెట్టుకునే 'ముద్దు' సహజమైన ఆవేశంతో కాక, శాస్త్రపరమైన ధోరణిలో జరిగినప్పుడు జరిగే అవాంతరాలను హాస్య ధోరణిలో వివరిస్తారా కథలో. 'కాంతం వృద్ధాప్యం' వంటి కథలు ఆయన రాయకుండా ఉంటేనే బాగుండేది అంటారు శ్రీకాంతశర్మ. 'మునిమాణిక్యం దీధితులు' అని ఆయన రచనలపై సిద్ధాంతగ్రంథం రాసిన రామగిరి మాధవరావు మానవమనస్తత్వం చక్కగా ఎరిగిన ప్రౌఢులు, విశ్వజనీనమైన అనురక్తికలవారు, సహజంగా చమత్కార సంభాషణా

శైలి కావడం వల్లనే మునిమాణిక్యం కథనడవడంలో సిద్ధహస్తులు కాగలిగారనీ, వినోద ప్రధానంగానే ఆయన సాహిత్యసృష్టి అంతా జరిగిందనీ, ఆహ్లాదజనకమైన రచనలు సృజించారనీ అంటారు.

మునిమాణిక్యం హాస్యం ఆరోగ్య ప్రదమైనది. లలిత మైనది. మధ్యతరగతి మందహాసాలకు, దాంపత్య మధురిమలను ఆయన హాస్యం ప్రోది చేస్తుంది. కాంతం పాత్ర ద్వారా ఇంటి ఇల్లాలికి సాహిత్య గౌరవం కల్పించి సంసారాలు రాగ సుధాభరితాలై నిలిచేందుకు - భార్యా భర్తలిద్దరూ రైట్‌రైట్ అంటూ బతుకు బండిని నలుగురిలో చిన్నతనం పడకుండా నడుపుకు పోవడంలోనే మానవుడు ఆనందాన్ని అనుభవించే ట్రిక్కు దాగి ఉందనీ నిరూపిస్తారు. "సంసారం ఈదలేని సాగరం కాదు. ఆనందాల కొలను" అని జనానికి అర్థ మయ్యేట్లు చెప్పటమే ఆయన జీవితాశయం. సంసారంలో చిప్పిల్లిన ఆనందాన్ని సార్వజనీనం చేసిన ఘనతవారిది అంటారు కర్నాటి లక్ష్మీ నరసయ్య గారు. మునిమాణిక్యం గురించి హస్య రచయితగా తనదైన విశిష్టముద్రవేసి. 'కాంతం' పాత్రతో నిజంగానే కావ్య ప్రయోజనమైన 'కాంతాసమ్మితయోపదేశయుజే' ని సాధించిన ఆ మహనీయుడు 1973 ఫిబ్రవరి 4వ తేదీన హైదరాబాద్‌లోనే అస్తమించారు. ఆయన మనోజ్ఞ హాస్య దీధితులు పఠితల హృదయాలలో, చదివినప్పుడల్లా ఉదయించి ప్రకాశిస్తూనే ఉంటాయి.



# ఎదహోయి నింపే హాస్య చంద్రికలు
# డా॥ భానుమతి రచనలు

శ్రీమతి శారదా అశోకవర్ధన్

'నలుగురి మధ్యన కూర్చున్నప్పుడు, నొప్పించ కుండా, నొవ్వకుండా చక్కగా మాట్లాడడమే ఒక కళ. ఇక గలగలా హాస్యాన్ని గుప్పిస్తూ మాట్లాడడం? ఒక విశిష్టమైన ప్రత్యేక కళ. ఆ కళలో సిద్ధ హస్తులు అనిపించుకోవడం మరీ గొప్ప కళ అంటే అతిశయోక్తి కాదు. హాస్యంగా మాట్లాడాలన్నా, హాస్యాన్ని రాసి పండించాలన్నా, ఆ వ్యక్తి ముందు అందమైన అద్దంలాంటి మనసుండాలి అంటాను. పసిపాపలు వారి ముద్దు ముద్దు మాటలతో, ఏం మాట్లాడినా అందంగానూ, ఆనందంగానూ వుంటుంది. ఎందుచేత? కల్మషం లేని కృత్రిమం ఎరుగని స్వచ్ఛమైన మనసు వారిది. అందుకే అందరి దృష్టినీ ఆకర్షిస్తాయి వారి మాటలు. అలాగే హాస్య ప్రియత్వం తెలిసిన ప్రతీ వారు వారి మాటలతో అందరినీ ఆయస్కాంతంలా ఆకర్షిస్తారు. హాస్యం సహజంగా సన్నివేశానికి అతుక్కున్నట్టు సరిపోతేనే అది ఆనందాన్నిస్తుంది. లేకపోతే ఆపహాస్యాల పాలవుతుంది. వెగటు పుట్టిస్తుంది. అందుకేనేమో గతంలో కనీసం హాస్యాన్ని ప్రధానంగా పెట్టుకుని రచనలు చేసిన వాళ్లని వేళ్ల మీదనైనా లెక్కపెట్టవచ్చు. ఇప్పుడసలు ఎవరూ లేరేమోనని చెప్పవచ్చు!

హాస్య రస ప్రధానంగా రచనలు చేసిన బహు కొద్ది మందిలో డా॥ భానుమతీ రామకృష్ణగారు అగ్రస్థానాన్నందుకున్నారు. ఈమె బహుముఖ ప్రజ్ఞాశాలి. సినిమా రంగంలో తనకు తానే సాటిగా, ఈ పాత్ర భానుమతి తప్ప ఎవ్వరూ చెయ్యలేరని పించేంత ఎత్తునందుకున్నది. గాయనిగా ఆమె కంఠం ఎవ్వరూ అనుకరించలేనటువంటిది. ప్రత్యేకమైనది. గళం విప్పితే చాలు జనం స్తంభించి పోవలసిందే. ఆమెలో నిక్షిప్తంగా దాగివున్న అందరికీ తెలియని మరొక ప్రత్యేకమైన కళ చిత్రకళ. అందులోనూ ఆమె అగ్రగామియే. కుంచెపట్టినా గళం విప్పినా, కలం చేతపట్టినా ఆమెకు ఆమే సాటి. సవ్యసాచి!

జీడిపప్పులు నమిలినంత కమ్మగా, తేటతెల్లనైన తేనె గ్రోలినంత తీయగా, ఆచారాల్లోనూ అలవాట్లలోనూ, తెలుగు తనాన్ని గుబాళిస్తూ గిలిగింతలతో ఉలికిస్తూ కులికిస్తూ ఊరిస్తూ ఉరకలెత్తించేవి భానుమతిగారి కథలు అని జనం ఏనాడో కితాబు నిచ్చారు. భానుమతిగారి కథల్లోని పాత్రలు ప్రత్యేక తరహాలో అవి సహజంగా జన జీవనానికి ఎంతో దగ్గరగా మురిపిస్తూ బులిపిస్తూ

వుంటాయని పాఠకులు మురిసిపోతారు. భానుమతిగారి కథల్లోని పాత్రలన్నీ మనకు కళ్లకు కట్టినట్టు సజీవంగా కనిపిస్తాయి. హాస్యం సంభాషణల్లో అతి సహజంగా ఇమిడి పోయి మన పక్కన కూర్చుని మనతో సంభాషిస్తున్నట్టుగా అనిపించి కడుపుబ్బ నవ్విస్తాయి.

## భానుమతి అత్తగారు:-

భానుమతిగారి అత్తగారి కథల్లోని అత్తగారి పాత్ర అలాంటిదే. ఆమెలాగే ఆమె అత్తగారి పాత్రకూడా అంత ప్రత్యేకమైనది. అవి కథల్లా కాక మనకళ్లముందు కదలాడే పాత్రలా మనకి ఎంతో పరిచయమున్న వ్యక్తిలా అనిపిస్తుంది. మనింట్లో మనకి సన్నిహితంగా వుండే వ్యక్తిలా గోచరిస్తుంది. ఆమె చేసే ప్రతీపనీ అనే ప్రతి మాటా మనకి నవ్వు పుట్టించేలా వుంటుంది. ఆమె అన్నీ తెలిసిన వ్యక్తిలా ఏ విషయాన్నైనా బల్లగుద్ది చెప్తినట్టు ఖచ్చితంగా అంతా తెలిసినట్టు చెబుతుంది. ఆమెకి ఏమీ తెలీదని మనకు చదువుతుంటే తెలిసిపోతుంది. అయితే ఆమె తెలీకపోయినా తెలిసినట్టు చెప్పే విధానం ఎంత హాస్యాన్ని కుమ్మరిస్తుందో చెప్పలేం. పాఠకులని గిలిగింతలు పెట్టినట్టుంటుంది.

ఆవకాయకు పళ్లకాయలు కూడా వెయ్యొచ్చు ఎప్పుడు కావాలంటే కారం అప్పుడు కలుపుకోవొచ్చు. అని అత్తగారు అంటూ వుంటే ఆమెకి ఏమీతెలీక పోయినా ఎంతో తెలిసినదానిలా చెప్పడం, ఆఁ...నిమ్మకాయెంతో ఆవకాయ అంతే 'అని వివరించడం' చదువుతూంటే ఆమె మీద ఆమె కున్న అపారమైన నమ్మకానికీ, ఏ మాత్రం సంకోచం లేకుండా చెప్పే ఆతీరుతెన్నులకీ చచ్చేంత నవ్వొస్తుంది. అలాగే, గొడ్ల విషయంలోనూ, చెట్లు నాటడం లోనూ, అరటి కాయపొడి చెయ్యడం, వడియాలు పెట్టడం, చాకలి పద్దులు రాయడం, కిరాణా కొట్టుకు పంపే లిస్టులు రాయడం, ఒకటేమిటి ఆమె గారు చేసే ప్రతీ పనిమీద ఆమెకి అపారమైన నమ్మకం. కల్తీ లేని నమ్మకం. అందువల్లే ఆమె చేసే పనికి విఘ్నాలు కలిగినప్పుడు, సునాయసంగా, అప్రయత్నంగా ఆతప్పను ఆమె ఇతరుల పైకి తోసేస్తుంది. ఉదాహరణకి, ఆమెనాటిన అరటిచెట్టు గెల వెయ్యలేదనుకోండి, "ఆఁ ... అదసలు కాయలుకాసే చెట్టు కాదు, కేవలం ఆ పెద్ద పెద్ద ఆకుల కోసమే నాటాను" అని చెప్పే మనిషి, పక్కింట్లో వాళ్లు నాటిన అవేచెట్లు గెలలు వేశాయని తెలిస్తే, తలవంచుకుని అక్కడి నుంచి వెళ్లిపోతుంది, ఇకవాదన పెట్టుకోకుండా, ఆవిడ ఎవరికీ కనబడకుండా ఉండాలంటే దాక్కునే ప్రదేశం వంటయిల్లే.

అలాగే, అబ్బాయి ధోవతులు పదిహేను చాకలాడు కొట్టేశాడని ఖచ్చితంగా చెప్పిన మనిషి, అవి చాకలాడు కొట్టెయ్య లేదు లాండ్రీకి పడ్డాయని తెలిసినప్పుడు, కుర్రాడి ఖాకీ నిక్కరు కూడా చాకలాడు పారెయ్యలేదని తెలిసినప్పుడు, ఆవిడ 'కిం' అనకుండా మొహం చాటేస్తుంది.

అలాగే, ఆమె తిరుపతికి వెళ్లినప్పుడు శకుంతలా వాళ్లిళ్లు సరోజావాళ్లిళ్లూ తాళాలు వేసికనపడితే, తెగబాధపడిపోతుంది. అది తనకి పరాభవంగా భావిస్తుంది. అంతకన్నా పరాభవం తను తనకిష్టంలేని తోటికోడలు గారింట్లో దిగడం!.... ఇలా ఎన్నో సంఘటనలు ఈ కథల్లో మనని అత్తగారి పాత్రకి దగ్గరగా తీసుకుపోతాయ్. నవ్విస్తాయ్, కవ్విస్తాయ్ మన మనసుల్లో నిలిచి పోతాయ్.

"భానుమతిగారి అత్తగారి సృష్టి గయ్యాళితనం కాదు. ఆమె పైన ఆమెకి తిరుగులేని ఓవర్ డోస్ నమ్మకం. ఆమె చాలా భారీమనిషిగా కనిపిస్తుంది. కానీ, నిజానికి ఆమెకి తెలిసిన ప్రపంచం చాలా చిన్నది. చాలా పురాతనమైనది. ఆవిడ ప్రపంచంలో ఆమెకి పూటకి అయిదు మానికల 'పంచకం' ఇచ్చే ఆవులకి స్థానం వుందికానీ, అయిదు మానికల పాలిచ్చే ఆవులకు స్థానం లేదు. ఢిల్లీ దగ్గర వుండే జపాను ఆమెకి అర్థమవుతుంది కానీ జపాను అక్కడ కాదు ఎక్కడో మూడు వేలమైళ్ల దూరాన వుండడము. తన కొడుకు, అంత దూరం వెళ్లడమూ ఆమె ఊహకి అతీతమైన విషయాలు. అంతెందుకు? బస్సుకీ కారుకీ మధ్య 'Van' వుండడం, ఆమె గుర్తించదు. అందుకే 'ఫోర్డ్ వానునీ' ఆమె బస్సే అంటుంది అంటారు సుప్రసిద్ధ రచయిత కొడవటిగంటి కుటుంబరావు గారు ఈ కథల గురించి చెబుతూ! ఇది అక్షరాలా నిజం.

భానుమతిగారి అత్తగారి పాత్ర ఒక అపూర్వ సృష్టి. నిజానికి అలాంటి పాత్రలు మనమధ్య నిజజీవితంలో చాలా వున్నాయి. తెలీని వన్నీ కూడా తెలిసినట్టుగా చెప్పడం, తను చెప్పింది తప్పు అని తెలిసినప్పుడు తప్పించుకు తిరగడం, ఇలాటి వ్యక్తుల మాటలు విన్నప్పుడు మనం హేళనగాకాక, తమాషాగా నవ్వుకుంటాం. అలా సృష్టించిన అమూల్యమైన అపురూపమైన పాత్ర వీరి కథల్లోని అత్తగారి పాత్ర. సాధారణంగా ఇటువంటి వ్యక్తుల్ని గురించి, మూర్ఖులనో అమాయకులనో అర్థమొచ్చేలా రచనలు చెయ్యడం సులువు. కానీ, హాస్యంగా రాయడం నవ్వు పుట్టించడం ఒక్క భానుమతి గారికే చెల్లింది. దీనికి కారణం భానుమతిగారు స్వతహాగా హాస్యప్రియురాలు కావడమేనంటాను. అత్తగారి పాత్ర చిత్రణలో భానుమతిగారు చూపిన నైపుణ్యం బహుగొప్పది. బాహ్యాప్రపంచానికీ, ఆమె మనస్తత్వానికి ఎక్కడా పొత్తుకుదరని అమాయకత్వం ఉట్టుపడే పాత్ర. ఏపుగా ఎదిగినా పసితనం పాలుగారే లాంటి స్వచ్ఛమైన చిట్టి ఆలోచనలతో అల్లుకుపోతూ సాగిపోయే పాత్ర. ఉదాహరణకు, సవతులంటే ద్వేషం, రోషం, పోట్లాటలు, ఏడుపులు, హేళనలు. ఇది మాత్రమే ఆమెకు తెలిసిన సత్యం. ఇవి కాకుండా అతీతంగా ఆత్మీయంగా కూడా వుండొచ్చునేమో నన్నది ఆమె ఊహకందని విషయం. అందుకే సవతులన్న తరువాత పోట్లాడుకోవద్దూ? మీరిద్దరూ పోట్లాడుకోరేం? అని నిలదీసి అడుగుతుంది, పాలవాడి పెళ్లాన్ని.

ఇలా ఎన్నో ఎన్నో! మరవడానికి వీలులేని పాత్ర భానుమతి గారి అత్తగారి కథల్లోని అత్తగారి పాత్ర. సినిమా రంగంలో గయ్యాళి అత్తగారు అంటే సూర్యకాంతం గారి పాత్ర ఎలా శాశ్వతంగా నిలిచిపోయిందో, అమాయకమైన సున్నితమైన అజ్ఞానంతో తెలీనివన్నీ కూడా తెలిసినట్టు వివరించి, తెల్లమొహం వేసే హాస్యపు పాత్ర కథా ప్రపంచంలో చిరకాలం నిలిచిపోయింది, భానుమతి గారి అత్తగారి పాత్ర. యావదాంధ్రుల గుండెల్లో గూడుకట్టుకుని, నవ్వులు పూయించే పాత్రగా మిగిలిపోయింది. సజీవంగా శాశ్వత స్థానాన్ని పొందింది. ఇలా పాత్ర సృష్టిచెయ్యడం భానుమతి గారి రచనా సామర్థ్యం. వీరి హాస్యం కేవలం, అత్తగారి కథలకే పరిమితం కాలేదు. అత్తగారి కథల్లో 'అప్పులు' అనే వంటవాడి పాత్ర ఒక టుంది. వాడి గురించి రాస్తారిలా భానుమతిగారు.- 'అప్పులు అత్తగారికి అన్ని విషయాల్లోనూ సాయపడలేడు ఒక్క వంటపనిలో తప్ప! అని ఇది చదవగానే మనమనసులో ఒక కబుర్ల రాయుడు మెలుగుతాడు.

'ఈ పెద్దమ్మగోరు (అంటే అత్తగారు) నన్ను ఏమీ తెలియని గాడిద కింద కట్టేసింది. ఏ గొడ్డు ఎట్టుటిదో నాకు తెల్సు. నా సంగతి గొడ్డుకి తెల్సు' అంటాడు పాలవాడు. ఇదీ గొప్పలు చెప్పుకునే హాస్యగాణ్ణి మనసులో నిలుపుతుంది. పాఠకులని నవ్వులపువ్వుల పల్లకీలో ఊరేగింపచేస్తాయి ఆయా పాత్రలు ! చక్కటి హాస్యం వేసవిలో వేపగాలి వీచినట్టు, మల్లెలు సుగంధాలు పంచుతున్నట్టు హాయి గొలుపుతాయి.

## ప్రత్యేకతలు - ప్రధానాంశాలు:-

భానుమతి గారి రచనల్లో చెప్పుకో వలసినవి విషయాలు ప్రధానంగా మూడు కనిపిస్తాయి. పాత్ర సృష్టి, అనుభవైక వేద్యమైన వాస్తవికత, మూడవది సున్నితమైన హాస్య రసం. సజీవ మైన పాత్రను సృష్టించి, ఆ పాత్రయొక్క ప్రధాన మైన వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేయడం అతికష్టమైన విషయం. అటువంటి పాత్రలు మన సాహిత్యంలో చాలా తక్కువనే చెప్పాలి. అసలు ఆంధ్ర సాహిత్యం లోనే హాస్య రసం తక్కువ. 'పూర్వ సాహిత్యాన్ని పరిశీలిస్తే శృంగార మొక్కటే ప్రధాన రసంగా పరిగణింపబడేది. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల కథల్లో వాస్తవికతను రాయడం ప్రవేశమయింది. మన కథల్లో పాత్రలు ప్రధానంగా రెండు విషయాలకు చెందినవిగా ఉంటాయి. అతి మంచి పాత్రలు, లేదా అతి చెడ్డ విలన్ లాంటి పాత్రలు. ఆ పరిస్థితిని మార్చి, సాధ్యమైనంత వాస్తవికతను సృష్టిస్తూ రచనలు చెయ్యడం అలవడింది పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్లనే. హాస్య రసాన్ని ప్రధానంగా తీసుకుని, వాస్తవిక పాత్రలను సృష్టించి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ఆపాదించి రచన చెయ్యడం గొప్ప సాహసం. ఆ పని అత్యంత నైపుణ్యంతో సహజత్వంతో పాత్రలను పోషించి, ప్రతీ ఘట్టమూ మన కళ్లముందు కదలాడేలా రచనలు చేశారు భానుమతి గారు.

'శమంతకమణీ చారుశాస్త్రి', ' రాంగ్ నెంబరు', 'త్రిశంకు నరకం', 'మావాడి లవ్ ఎఫెయిర్స్' , 'వరసలు', 'గుభేళ్లు', 'ఇరుగుపొరుగు', 'చక్రపాణి - రాజధాని', 'రంభా - చక్రపాణీయం' ఇలా ఎన్నో కథలు.

## పాత్రల సృష్టి:-

అత్తగారి కథల్లో అపూర్వ సృష్టి అత్తగారయితే 'చక్రపాణీ - రాజధాని' 'రంభా చక్రపాణీయం' కథల్లో చక్రపాణి గారి పాత్ర అమోఘం. చక్రపాణిగారు సాక్షాత్తూ మన మధ్య తిరిగిన చక్రపాణి గారే. సినిమా ప్రొడ్యూసర్‌గా, 'యువ' అనే మాస పత్రిక అధినేతగా వారు చాలా మందికి పరిచితులే అయినా, భానుమతిగారికి వారితో అనుబంధం ఎక్కువ. అతని ప్రత్యేక భాషా శైలినీ, మాట్లాడే విధానాన్నీ ప్రవర్తించే తీరునీ, వివిధ కోణాల్లోంచి పరిశీలించిన భానుమతి గారు, చక్రపాణి గారు స్వర్గస్థులయినా, వారి పాత్రని సజీవంగా సృష్టించి వారు నిజంగా ఇలా చేశారేమోనన్నంత గొప్పగా సన్నివేశాలు సృష్టించి సిల్కు స్మితని ప్రవేశపెట్టినా, సాక్షాత్తూ రంభే దివినుండి భువికి దిగొచ్చి భూమ్మీద నానా ఇబ్బందుల పడినా క్షణ క్షణం మన హృదయంలో గిలిగింతలు పెడుతూ కళ్లకి కట్టినట్టు కనిపించే పాత్ర చక్రపాణి గారిది. అలా వారు కీర్తి శేషులైనా, మళ్లీ పునర్జన్మ ప్రాప్తింపజేసి వారినీ, వారివ్యక్తిత్వాన్నీ శాశ్వత కీర్తి పాత్రులను చేసి అక్షర రూపంలో బంధించారు భానుమతిగారు. చక్రపాణిగారి మాటల్లోని హాస్యధోరణి వారిని మనం చూస్తున్నంత స్పష్టంగా వర్ణించి నవ్వులు పండించడం, ఆ హాస్య వ్యవసాయం ఒక్క భానుమతిగారే చేశారంటే, అతిశయోక్తి కాదు. ఏ రచయితా ఇలాంటి సజీవ సృష్టి చెయ్యడం చాలా అరుదు. అందులోనూ హాస్య రసాన్ని గుప్పిస్తూ ! ఏ రచయితకైనా, కొన్ని గొప్ప కథలో నవలలో కవితలో ఉండడం సహజం. కానీ, రాసిన ప్రతీకథా దేనికదే ప్రత్యేక స్థాయిని పొందడం అసాధ్యం. అందులోనూ ప్రతీదీ హాస్యాన్ని ప్రధానంగా నింపుకున్న కథే కావడం అపురూపం. వీరి కథలలోని హాస్యాన్ని విశ్లేషించాలంటే ఒక్కొక్క కథపైనా ఎంతైనా రాయొచ్చును. ఒక్కొక్క కథపైనే కాదు, ఒక్కొక్క కథలో ఒక్కొక్క పాత్రపైనా ఎంతైనా చెప్పొచ్చును.

శమంతకమణీ - చారుశాస్త్రి కథలో రూపవతి యైన శమంతక మణికి కురూపియైన చారుశాస్త్రి పడేయమ యాతనలనీ, రూపానికి తోడు అతగాడు మార్చుకోలేని అలవాట్లు ఆబగా తినడం, గుర్రుపెట్టి నిద్రపోవడం లాంటివి అద్భుతంగా రచించారు. చిక్కని హాస్యం జోడించి. 'త్రిశంకు నరకం' కథలో కనిపించేది 'నేను' అంటు ఫస్ట్ పర్సన్‌తో ప్రారంభించిన పాత్ర సాక్షాత్తూ భానుమతిగారేనని ఆమెను తెలిసిన వ్యక్తులకి తెలియక మానదు. ప్లేన్ ఎక్కడం, ప్లేన్ ప్రయాణం అంటే ఆవిడ ఎంత టెన్షన్ ఫీలవుతారో, కొందరు వ్యక్తులు మేకపోతుగంభీర్యాన్ని ప్రదర్శిస్తూ అంత రంగంలో ఎంత పిరికితనానికి గురౌతారో నవ్వుకునేలా హాయిగా రచన చేశారు ఈకథలో.

'మా వాడి లవ్ ఎఫైర్స్' కథలో బావ పాత్ర చాలా సమర్థవంతంగా సృష్టించారామె. నన్నడిగితే ఇదొక మానసిక సంబంధానికి ప్రతీక. ఈ బావ పాత్రకి ఆడవాళ్లంటే వొళ్లు మరిచి పోయే స్వభావం వుంటుంది. వయస్సుతో కూడా సంబంధం లేకుండా. ఈఒక్క గుణాన్ని అనేక కోణాల్లోంచి అనేక పాత్రలను చుట్టూతిప్పుతూ హాస్యాన్ని గుప్పిస్తూరాశారు భానుమతిగారు ఆ బావ వక్రబుద్ధిని అనేక రీతుల్లో వర్ణిస్తూ.

కొందరు పరిచయం కాగానే వరసలు కలపేసి పిలుస్తుంటారు. అందులో ఒసే అక్కా- ఏమే అక్కా అని కూడా పిల్చుకుంటూ వుంటారు. ఇవి ఒకొక్క సారి ఎంత ఎబ్బెట్టుగా వుంటాయో, చక్కని హాస్యాన్ని గుమ్మరిస్తూ రాసిన కథ ఇది. ఇలా భానుమతి గారి కథల్లో కేవలం హాస్యమే కాక, చక్కటి సందేశాలూ వుంటాయి. అయితే కొట్టినట్టుగానో, ఏడిపిస్తూనో చెప్పరు. నవ్వుతూ నవ్విస్తూనే చెప్పవలసిన విషయం చెప్పేస్తారు. అదే వీరి ప్రత్యేకత.

భానుమతిగారికి ఏడుపు పాత్రలన్నా ఏడుస్తూ కూర్చునేవారన్నా ఇష్టం వుండదు. వీరు ఏ చిత్రంలోనూ బోరుమని ఏడవడం లేదా ఏడుస్తూ నోరు మెదపకుండా కుంగిపోవడం లాంటి పాత్ర మనకి కనిపించదు. గుండె మండిపోతున్నా, దుఖంముంచుకొస్తున్నా నిబ్బరంగా నిలబడి ఆత్మస్థైర్యంతో, ఆత్మ విశ్వాసంతో, సంఘర్షణలను ఎదుర్కునే సాహసంతో సాగుతాయి వీరి పాత్రలు. అలా అనేక చిత్రాలలో వారి పాత్రలను మలుచుకోవడం, ఆమె పాత్రకు ఆమె స్వయంగా సంభాషణలు కూర్చుకోవడం కూడా జరిగింది. నిర్మాత ఆవిధంగా ఒప్పుకుంటేనే ఆమె ఆ చిత్రంలో నటించడానికి ఒప్పుకోవడం, లేకపోతే లేదు. అంటే! ఇచ్చకాలు ఆమెకి గిట్టవు. కుండబద్దలు కొట్టినట్టు మాట్లాడడం ఈమె నైజం. హాస్యం ఆమె ఆరోప్రాణం. మామూలుగా మాట్లాడుతున్నా హాస్యం అలా దొర్లి పోతూనే వుంటుంది మాటల్లో. ఇది తెచ్చి పెట్టుకున్నది కాదు. భగవంతుడిచ్చిన వరం.

ఉదాహరణకి ఒక విషయం చెబుతాను. ఆరోజుల్లో భానుమతి గారికి ఫ్లయిట్ ఎక్కడమంటే చాలా భయంగా వుండేది. అందుకే ఎప్పుడూ ఎక్కడికి వెళ్లాల్సి వచ్చినా కార్లోనో లేదా రైలు ప్రయాణమే. ఆమె రైలు ప్రయాణం గురించి ఒక కథ రాయెచ్చు. కంపార్టు మెంటునాలుగు బర్తులూ ఆమె బుక్ చేసేసే వారు. ఇష్టమైన ముగ్గురిని తనతో కూడా తీసుకెళ్లే వారు. తన ప్రియమైన ట్రంకుపెట్టే, కంచుమరచెంబూ కూడా, కూడావుండవలసిందే, వి.ఐ.పి. సూటుకేసులతో పాటు. ఒకసారేమయిందంటే నాలుగుబర్తులూ వీరికి దొరకలేదు. రెండో మూడో బర్తులు మాత్రమే దొరికాయి. ఈమెతోపాటు ఆరోజున ప్రఖ్యాత రచయిత డి.వి. నరసరాజుగారు కూడా వున్నారు ప్రయాణంలో. వీరురైలెక్కే సరికే మద్రాసు స్టేషన్లో, ఒక బర్త్ మీద, అప్పర్ బర్త్ మీద ఒక పెద్ద పెద్ద మీసాలున్న ఆసామి, హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతూ కన్పించాట్ట. వాణ్ణి చూసి భానుమతి గారు గతుక్కుమని నరసరాజు గారికి సంజ్ఞలతో అతణ్ణి చూపిస్తూ 'అటు

చూడండి. బూచాడు' అన్నారట. ఈ మాటవినగానే ఆమెతో కూడా వున్న వాళ్లంతా పొట్టచెక్కలయ్యేలా నవ్వారట. ఆరోజుల్లో బూచాళ్లని, విలన్లనీ ఇలాగే పెద్ద పెద్ద మీసాలు గళ్లలుంగీలు పెట్టి చిత్రించేవారు. బూచాడంటే ఒక జోలే మీసాలు గడ్డాలు వున్న వ్యక్తిగా మనవాళ్లు వర్ణించడం మనకి అలవాటే. ఇలాంటి నిజజీవితంలో జరిగిన సంఘటనలను కూడా హాస్యంలో గుప్పించే వీరి స్వభావ స్వరూపాలను నాకు వారితో వున్న పరిచయాన్ని పురస్కరించుకుని, 'డా॥ భానుమతి-నేను' అన్న నాగ్రంథంలో వారి స్వభావాన్ని విశ్లేషించాను. అందులో ఈ బూచాడి' సంఘటన కూడా వుంది.

నన్నడిగితే మనకి చరిత్రలో తెనాలి రామకృష్ణుడు ఎంత గొప్పకవో, ఎంత చమత్కారవంతుడో, ఎంత పాడిత్యాన్ని సంతరించుకున్న సాహితీ సంపన్నుడో, ఈ ఆధునిక యుగంలో డాక్టర్ భానుమతి గారు అంతటి వ్యక్తి అంటాను. వీరి 'నాలో నేను' స్వీయ చరిత్ర గ్రంథం చదువుతూన్నా అందులోనూ కొన్ని పాత్రలను వర్ణిస్తూన్నతీరు మనకి ఒక చక్కటి నవల చదువుతున్న అనుభూతినే కలిగిస్తుంది. ఎక్కడా భయం మొహమాటం అనేవి కనిపించకుండా స్వేచ్ఛగా విచ్చుకున్న మల్లెల్లా అక్షరాలు దొర్లిన ఈ గ్రంథం చదువుతుంటే మనసున మల్లెమాలలూగుతాయి, కన్నుల వెన్నెలడోలలూగుతాయి. ఈ గ్రంథానికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాయలయ పురస్కారం, రచయిత్రి ఉత్తమ గ్రంథంగా కేంద్ర ప్రభుత్వం స్వర్ణకమలమూ లభించాయి. ఆమె కథల పుస్తకం 'భానుమతి కథానికలు' అత్తగారి కథలూ' సాహిత్య అకాడమీ బహుమానాలతో పాటు తెలుగు ప్రజల కాదు భారతీయుల ప్రేమానురాగాల పులకింతల గిలిగింతల స్పందనల నందుకున్నాయి. వీరి రచనలు చదువుతూ వుంటే, చక్కటి విందు భోజనాన్నారగించి, కస్తూరీ, జాజికాయ, జాపత్రి లాంటి సుగంధ ద్రవ్యాలతో చుట్టిన తాంబూలాన్ని సేవించి, పారిజాతాలూ, మల్లెలూ కలగలిపి మెత్తని పాన్పుపైన జల్లి, ఆ పరిమళాన్ని ఆస్వాదిస్తూ పండువెన్నెల ఒళ్లంతా నిమురుతూంటే, భానుమతీ, బాలమురళీ కృష్ణ, రవి శంకర్, సైగల్‌ల సంగీత క్యాసెట్లని మంద్ర స్వరంతో వింటూ, పులకించి పరవశించి పోయే అనుభూతి కలుగుతుంది. అంటే కొంచెం దోసేజీ ఎక్కువయిన అతిశయోక్తేమో గానీ, అబద్ధం మాత్రం కాదు.

హాస్యం జీవితానికి టానిక్కు. ఆరోగ్యానికి రహదారి. అందుకే భానుమతిగారి కథలు, నాడూ నేడూ రేపూ కూడా హాస్య రసక్షేత్రంలో పూసిన వన్నెతరగని వసివాడని స్వర్ణకమలాలుగా నిలిచి పోతాయి! ఆమె కథలలోని కొన్ని సన్నివేశాలనూ, సంభాషణలనూ, నాటకీయతనీ పరిశీలిద్దాం.

## సన్నివేశగత హాస్యం:

'అత్తా తోడికోడలీయం' కథలో అత్తగారు తిరుపతి ప్రయాణమవుతారు. కొడుకుకి

వీలుపడదని రానంటాడు. 'నీ కోడలిని వెంటబెట్టుకెళ్లమంటాడు. "నువ్వు రానందుకు హుండీలో అపరాధ కానుక వేస్తాలే' అని సర్దుకుంటుంది ఆమె. ఆవిడ అనుకున్నట్టుగా తిరుపతిలో శకుంతలా, సరోజా వుండరు. గతి లేక ఇష్టం లేకపోయినా తోడికోడలింటికే వెళాల్సి వస్తుంది? అక్కడ, తోటి కోడలితో భానుమతి 'అత్త' గారికీ సంభాషణలు విసుర్లుగా దొర్లుతాయి. దానికి కారణం ఈ అత్తగారు ఆమెతో ఎప్పుడూ కొంచెం ఎగతాళిగానే మాట్లాడడం వల్ల తోటికోడలికి కోపం. ఆ కోపాన్ని అవకాశం దొరికినప్పుడల్లా ప్రదర్శిస్తుంది తోడికోడలు. ఒళ్లూ, ఆరోగ్యం మీదే జరుగుతుంది సంభాషణంతా. నన్ను ఎగతాళి చెయ్యాలా అంటుంది తోడికోడలు. 'నేనేమీ దేశమంతా చెప్పలేదు. చూసేవాంఢ్లకి కండ్లు లేకపోతేగా'

"కండ్లున్న వాళ్లెవళ్లూ నేను లావుగా ఉన్నానని ఏనాడూ అన్లేదు"

"అయితే ఏమిటే నువ్వనేది? నాకు కండ్లు లేవంటావా? పండ్లు లేవంటే ఒప్పుకుంటాను. దాందుంపతెంచా కండ్లు కూడా లేవంటే ఎట్లా చచ్చేది! ఈ రోజు జబ్బు చేసి నువ్వు చిక్కిపోయావేమోగానీ, మొదట్నించీ నువ్వు లావనే సంగతి అందరికీ తెలిసిందే" అత్తగారు

"అదుగో ఆ మాటే నేనడుగుతున్నా, మొదటినుంచీ మీ ఒళ్లు కట్టెలా వున్నా ఈ రోజు పెట్టెలా వుందని చూసే వాళ్లందరికీ తెలీదాంట? నన్ను చూసి నవ్వినవాళ్లే ఈ రోజు మిమ్మల్ని చూసి నవ్వడం లేదాంట" తోడికోడలి వాదన.

తారాస్థాయికి అందుకున్న వారి వాదనలు చిన్న పోట్లాటలా వుంటుంది. కాస్సేపు ఇద్దరూ మాట్లాడు కోకుండా మౌనంగా వుండి పోతారు. ఆతరువాత కాస్సేపట్లోనే ఏమీ జరగనట్టు మారిపోతారు. తిరుపతి కొండకి బయల్దేరే సమయంలో రాత్రి జరిగిన వాదులాటలూ, సూటీ పోటీ మాటలు అన్ని మార్చిపోయి ఒకరి కొకరు అత్తగారూ తోడికోడలు ఎంతో ఆప్యాయంగా మాట్లాడుకోవడం చూసి అందరూ ఆశ్చర్యపోతారు.

'తోడికోడలూ ఒస్తే సరదాగా వెళ్లొచ్చు తిరుపతికి అనుకుంటుంది అత్తగారు. తోడికోడలు మనసులో వెళ్లాలనే వుంటుంది. అందుకే బయల్దేరుతూన్న భర్తతో ఏమండోయ్, పిల్లాడివీ, అబ్బాయివీ కొన్ని ముడుపులు అట్టాగే వున్నయ్, తీసికెళ్లి హుండీలో వేస్తారా లేకపోతే మళ్లా వారం మనం వెళ్లినప్పుడు వేద్దామా? మనకీ వుందిగా మొక్కు. అంటుంది తొటికోడలు. ఆమాటలకి అత్తగారు పోనీ దాన్ని కూడా రమ్మనా నీ కోడలూ మనవడూ వాళ్లనీ రమ్మను. మళ్లా వారం రోజుల దాకా ఎందుకూ మీ ప్రయాణం? ఇవ్వాళే అందరం కలిసే వెళదాం సరదాగా అంటుంది అత్తగారు.

"దానిష్టం కక్కీ" అంటాడు అబ్బాయి "పోనీ వెళదాం అన్నది కోడలు సరదాపడుతూ. క్షణంలో అందరూ తయారయి కార్లో కూర్చుంటూరు. అంతలోనే మళ్లీ తోడికోడళ్ల గొప్పలు. ఎవరి

పుట్టింటారి గురించి వాళ్లు గొప్పలు చెప్పుకోవడం, అవతలి వారి గురించి చులకనగా మాట్లాడడం. దాంతో మళ్లీ వాదనలు. ఇలా వాదనలకి అనుకూలంగా ఎదో ఒక సన్నివేశం చిత్రంచడంలోనూ, వాదనలు మాని అనుకూలమైన సన్నివేశాలను చిత్రించడంలోనూ భానుమతిగారిది అందెవేసిన చెయ్యి. ఈతోడికోడళ్లిద్దరికీ ఒకరి మీద ఒకరికి అసూయలేదు. ద్వేషం లేదు. క్షణంలో ఎవరి అభిప్రాయాలు వాళ్లు బలంగా చెప్పేస్తారు. వాదులాడుకుంటారు. మరుక్షణంలో మళ్లీ మామూలుగా ఆప్యాయత లొలకబోసుకుంటూ మాట్లాడు కుంటారు. అదే వారి ప్రత్యేకత. అలా పాత్ర సృష్టి చెయ్యడం భానుమతి గారికి ఉగ్గుతో పెట్టిన విద్య. నిజానికి నాటి మానవతా సంబంధాలు ఇలాగే వుండేవి. చిన్న చిన్న పోట్లాటలూ, వాదులాటలూ, ఎవరి గొప్పలు వాళ్లు చెప్పుకోవడం ఇవన్నీ వున్నా, సంబంధ బాంధవ్యాలు మాత్రం సాధారణంగా తెగిపోయేవి కావు. ఇలాంటి సన్నివేశాలు ప్రతీ కథలోనూ ఎన్నో గుప్పిస్తారు భానుమతి గారు.

మరో చక్కని సన్నివేశం అత్తగారూ- అరటి కాయపొడి కథలో అత్తగారికి కొడుకుకిష్టమైన అరటి కాయపొడి చేసి పెట్టాలని కోరిక. తల్లి వంటంటే కొడుకుకి భయం. తినకపోతే ఆవిడ బాధపడుతుంది. తినాలంటే నోటికి పోని బాధ. అందుకే తల్లి ఉదయం లేచేలోపలే అరటి గెల కోసేసి ఎవరో స్నేహితులింట్లో గృహ ప్రవేశానికి ఇచ్చానని అబద్ధంచెప్పి పక్కవాళ్లకిచ్చేస్తాడు గెలని. అమ్మకి బాధ కలిగించని చిన్న అబ్ధం చెప్పినా, అది ఆమె మనసు నొప్పించ కుండా తాను నొవ్వకుండా తప్పించుకోవడానికి మాత్రమే చేసిన ప్రయత్నం అని తృప్తి పడతాడు. ఆ తల్లి మనసు కొడుకుకి ఇష్టమైన అరటికాయ పొడి చేసిపెట్టలేదని పీకుతూనే వుంటుంది. అరటి గెలని అలా తనకి తెలీకుండా ఇచ్చేసి నందుకు బాధపడుతూనే వుంటుంది. రెండు రోజులు తల్లికి మొహం చాటేసి తిరిగినా మూడోనాడు పట్టుబడ్డాడు కొడుకు. సరిగ్గా ఆరోజే తోడికోడలి కొడుకు కూడా ఊర్నుంచొచ్చాడు. అందరికీ వడ్డిస్తూ అత్తగారు చెబుతారు! అమ్మాయ్ చక్కటి అరటికాయ పొడిచేశానే అబ్బాయికోసం తొందరగా రమ్మను వాళ్లని భోజనాలకు అంటుందామె సంతోషంతో! కోడలు ఆశ్చర్యం లోంచి తేరుకుంటూ "అసలు అరటి కాయ లెక్కడివి అత్తా" అడుగుతుంది. బంధువులొచ్చారు ఇంట్లో కూరలు నిండుకున్నాయి ఏవైనా కూరలుంటే ఇవ్వమనీ పక్కవాళ్లని అడిగాను. ఆవిడ అచ్చం మన అరటి కాయల్లాంటివే ఆరు తెచ్చియిచ్చింది. అందులో మూడు చేశాను. మూడు అట్టిపెట్టాను అంటారామె. నయం ఆవిడ అసలు ఇవి మీ గెలకాయలే అని చెప్పింది కాదు అనుకొని సంతోషిస్తూ అందరికీ ఆకులు వేసి భోజనాల ఏర్పాటు చేస్తుంది. అప్పులుకి చెప్పి భోజనం చేస్తున్న వాళ్లబ్బాయి తల్లి ప్రేమతో వడ్డించిన అరటికాయ పొడి ముద్ద నోట్లో పెట్టుకుని, గబుక్కున లేచి వెళ్లి పోయాడు. నోట్లోంచి గరగర శబ్దం వినిపించింది. తోడికోడలి కొడుకూ అంతే. ఏమిట్రా ఇది అని అడిగింది ఆమె కంగారుగా. అతడు భయం భయంగానే చెబుతాడు "కక్కీ! దీన్లో పోపుదినుసుల రాళ్లూ బొగ్గుల కుంపటిలోని చిన్న బొగ్గు ముక్కలూ పడ్డాయి. నమలగానే

గరగరలాడాయి'' అని ఒరేయ్ ! రుచి చూద్దామని నేను కొంచెం నోట్లో వేసుకున్నాను. నాకురానివి మీకెలా ఒచ్చాయిరా ఇవన్నీ అంటుంది. కక్కీ నీకు పళ్లు లేవు కదా! ఎలా కొరుకుతావ్ మింగేసుంటావ్? అంటాడు. అమె తలదించుకుంటుంది.

''పోనీలేరా! రేపు మళ్లీ చేసి పెడతాలే జాగ్రత్తగా అన్నీ చూసి'' అంటుంది ఇంకా అరటికాయలు లోపల ఉన్నాయి కదా అన్న ధీమాతో.

ఇలా సన్నివేశం చదువుతూంటే అత్తగారి అబ్బాయికి ఇష్టమైన వంటకాలు చేసిపెట్టాలన్న తపన ఆతల్లి పడే ఆరాటం ఆమెకు మనసున్నా వంటకాలు రుచిగా చెయ్యలేదని తెలిసి ఆ వంటకాలు తినలేక బాగులేవు అని చెప్పి ఆమె మనసును బాధపెట్టలేక యింటిల్లిపాదీ పడే బాధ ఎంతో చక్కగా చిత్రీకరించారామె. మమతల పొదరిల్లులాంటి కుటుంబాలలో ఎవరికి వారే ఎదుటి వారిని కష్టపెట్టకూడదు అన్న ఉద్దేశ్యంతో, చిన్న చిన్న ఏరకంగానూ హానికరంకాని అబద్ధాలైనా చెప్పి ఎవ్వరూ నొవ్వకుండా వుండే పరిస్థితిని కల్పించడానికి ప్రయత్నిస్తారో ఈ సన్నివేశం కళ్లకి కట్టినట్టు చెప్తుంది.

## ఇక సంభాషణ గతహాస్యం:-

వీరి కథలన్నీ పరిశీలిస్తే, ఏ కథలోనైనా సంభాషణలు అతికి నట్టుగా ఇమిడిపోతాయి. అతి సహజమైన ధోరణిలో.

అత్తగారూ- జపాను యాత్ర అన్న కథలో అత్తగారికి జపాన్ ఎంత దూరంలో వుందో ఎలా వెళ్లాలో ఏమీ తెలియదు. ఆమెకి తెలిసిందల్లా, అంటే తను కనీసం తరుచుగా విన్నది 'ఢిల్లీ పేరు. ఢిల్లీ మీదుగా జపాన్ వెళ్లొచ్చు అంటే ఆవిడ ఉద్దేశం రాజమండ్రి మీదుగా కాకినాడ వెళ్లినంత తేలిక. కొడుకునడుగుతుంది. ''ఒరేయ్! కోడలిని ఎలాగా తీసికెళ్లడం లేదు, కుఱ్ఱాడికి పరీక్షలున్నాయని. పోనీ నన్ను తీసికెళ్లరా జపాను చూసొస్తాను'' అని తల్లికాస్సేపు సరదాగా ఆట పట్టించడానికి సరేలే ''అమ్మా తీసుకెళతాను'' అంటాడు కొడుకు

''ఇంతకు జపాన్ రైల్లో వెళ్లాలా విమానంలో వెళ్లొచ్చా?''

''నీ ఇష్టం అమ్మా ఎందులోనైనా వెళ్లొచ్చు''''రైల్లో ఎందుకురా? ఎన్నో సార్లు వెళ్లానుగా! విమానంలోనే ఒకసారి జపాను తీసికెళ్లరా''

''సర్లే అమ్మా అట్లాగే లేమ్మా! రేపు ఢిల్లీ వెళ్లి తిరిగి ఇంటికి రావాల్సిన పనుంది. మళ్లీ వెళ్లేటప్పుడు నిన్ను తీసుకెళ్తాలే! ఈలోపుగా నీవంటసామానంతా గోతానికి వేసుంచు''

''ఆ!... అదెంత వంటసామాన్రా! గోతాంలో వేసికట్టడం క్షణం పని. మరి కోడల్నీ, అబ్బాయినీ ఎప్పుడు తీసుకెళ్లతావురా?''

''ఇదుగో రేపు నువ్వు జపాను వెళ్లి వస్తూనే, వాళ్లిద్దర్నీ తీసికెళతాను. దగ్గిరేగా''

''ఆ!... అదే మరి ఆపాటికి పిల్లవాడి పరీక్షలు కూడా అయిపోతాయిలే''

''ఇలా ఎంతో సహజంగా మాట్లాడుతున్న ధోరణి మననెంతో హాయిగా చదివిస్తాయి.

ఇది చూడండి చక్రపాణి-రాజధాని కథలో!

సాయంత్రం అయిదు గంటలవుతుంది. హైదరాబాదు వీధులన్నీ అలజడిగా వున్నాయ్. ఒకవైపు నుంచి ఒక గుంపు పరుగెత్తుకొస్తున్నారు కేకలేసుకుంటూ ''చంపేస్తున్నారు ... పొడిచేస్తున్నారు! బాబోయ్ త్వరగా పరుగెత్తండి అంటూ. అదే సమయంలో ఒక సన్నటి పొడుగాటి వ్యక్తి తాపీగా ఆవైపు నడిచి రావడం చూసి యిద్దరు వ్యక్తులు ఆగి అంటారు'' ఏం? చావడానికొచ్చావా''?

''ఏం చచ్చేఒచ్చాను''

''అంటే?'' అన్నారు వాళ్లు కనుబొమలు చిట్లించి

''అంటే, నేను చచ్చిపోయి నాలుగైదేండ్లు అయిందిలే! నాపేరు చక్రపాణి! నాకిక చావులేదు!'' ''అది విని వాళ్లు ఒక్కసారిగా, ''అయ్యబాబాయ్! యితను మనిషిగాడు'' అంటు గావుకేకపెట్టి అక్కణ్ణించి పరుగులంకించుకున్నారు.

చక్రపాణి గారు మరి కొంత దూరం నడిచారు. మళ్లీ కొందరు గుంపుగా రావడం చూసి ''ఏంటయ్యా! ఎందుకు పొడుచుకుని చస్తున్నారు? ఏం జరిగింది?'' అడుగుతారు చక్రపాణి గారు. ''ఏమో మాకు తెలీదు బాబు! ఆవైపు అల్లర్లుగా వున్నాయ్ ముందు మమ్మల్ని పోనీయండి. యింతలో వెనకనుంచి ఎవరో ''చక్రపాణిగారూ! ఏమిటిట్లా ఒచ్చారు'' అంటాడు

''ఎట్లా రమ్మంటావ్?''

''అది కాదండీ... మీరు''

''ఎందుకొచ్చానంటావ్? చూడు ప్రతీ ఏడాదీ దీపావళి ముందు నేను హైద్రాబాదొస్తూవుంట. మా దీపావళి యువ ఇష్యు ఎట్టా తయారవుతుందో చూట్టానికి. అస్సరేగానీ యిక్కడ ఒకే అల్లర్లుగా వున్నాయంటనే...''

''అవునండీ! ఈ రోజు నేనొక్కణ్ణే తప్ప అంతా పారిపోయారు'' అయినా శానామటుకు ఈ గొడవలు తగ్గడానికి గవర్నమెంటు కంట్రోల్ చేశారు. కానీ సైక్లోనూ, వరదలూ, చాలా జన నష్టం చేసి తెలగుదేశం అంతా దెబ్బతిన్నది.

"ప్రతీ ఏటా ఇదొక పీకులాటే! వానలు కురవక పోతే నీళ్లు లేక చస్తున్నారు. కురిస్తే వరదల్లో చస్తున్నారు! గవర్నమెంటు దీనికేమైనా చేయాలి!

"ఏదీ ఇప్పుడేగా ఒస్తున్నా..."

"పోయిన సంవత్సరం ఒచ్చినప్పుడు చూశారా? చీఫ్ మినిస్టర్ గారిని!"

"పోయిన సంవత్సరం దీపావళి ముందునేనొచ్చినప్పుడు రామారావెక్కడున్నాడయ్యా చీఫ్ మినిస్టరుగా!"

"చిత్తం... చిత్తం... అప్పటికింకా ఆయన సి.ఎం. కాలా... ఎలక్షన్ల గొడవలో ఊర్లన్నీ తిరుగుతున్నారు అప్పట్లో...

"అందుకే చూళ్లా! ఏదో వాన్ ఒకటి కొని తిరిగాడని విన్నా..."

"అవునండి!... ఒక్కక్క పల్లే... ఒక్కొక్క యిల్లూ చివరికి చిన్న చిన్న గుడెసెల్లోకెళ్లి బీదప్రజలతో పాటు కూర్చుని 'అమ్మా..అన్నం పెట్టు' అని దోసిలి పట్టి వాళ్ల చేత ముద్దలు వేయించుకుని తిన్నారటండీ! ప్రతీ ఆడదీ 'అన్నా...అన్నా' అని.."

"అదినే విన్నా...."

"ఎండలో తిరిగి ఎంత కష్టపడ్డారనుకొన్నారు!... నల్లబడ్డారు బాగా!... ఎప్పుడూ ఎ.సి.రూములో కూర్చునేవాడు మరి ఒక్కసారి ఎండలో కొస్తే కష్టమే కదామరి! అంత ఎండలో తిరిగితే నల్లబడక... తెల్లబడతాడా! నీకో కథ తెల్సా...

"తెలీదండీ...?

"చెప్తా..."

ఇలా సాగుతుంది వారి సంభాషణ ఎంతో సహజంగా. ఇది చదువుతూంటే వాళ్లు మన ఎదురుగుండా కూర్చుని మాట్లాడుకుంటున్నారా అన్నంత స్పష్టంగా అనిపిస్తుంది. అలాగే ప్రతీ కథలోనూ సుదీర్ఘమైన సంభాషణలు కాకుండా, మామూలుగా మనం మాట్లాడుకుంటున్న విధంగా చకచకా సాగిపోతాయి మాటలు. అందుకే పాఠకులకి పుస్తకం చదువుతూన్నట్టుగా కాక ఆసంభాషణలు మనం వింటున్న అనుభూతి కలుగుతుంది.

## నాటకీయత:

ప్రతీ కథలోనూ చక్కటి నాటకీయత ఇమిడి వుంటుంది వీరి కథల్లో. చదువుతూన్నంతసేపూ దానికి సంబంధించిన దృశ్యం మన కళ్ల ముందు కనబడుతూ వుంటుంది. ఉదాహరణకి

అత్తగారూ- ఆవు నంబరు 23. ఇందులో నీళ్ల పాలు బావుండట్లేదని అత్తగారు ఏకంగా ఒక మంచి ఆవునే కొనేద్దామనుకుంటారు. ఇక ఆవును కొనే తతంగం ఏ మార్కెట్టులో ఎట్లాంటి ఆవులు దొరుకుతాయా అని అన్వేషించడం. కొంత దూరంలో వున్న ఆమార్కెట్టులో ఆవులు చక్కనివి దొరుకుతాయని తెలుసుకోవడం, వాటిని కొనడానికి పాలవాణ్ణి వెళ్లి సెలక్ట్ చెయ్యమనడం, అతడు తన ఇద్దరు భార్యల్ని కలిపి వెంటబెట్టుకుని వెళ్లడం. అతగాడొచ్చి మరో రెండు వారాల్లో ఈనబోతున్న ఆవుని సెలక్ట్ చెయ్యడం నచ్చని అత్తగారు. ఆవునీ పాలవాడి సెలక్షన్ని మాత్రమే కాకుండా ఇరవైమూడు నెంబరు కూడా అచ్చిరాని సంఖ్యకింద జమకట్టి పాలవాడితో పోట్లాడడం. శుక్రవారం నాడు ఆవు ఇంటి కొస్తుందని గొడ్లశాలంతా శుభ్రం చేసి కడిగి ముగ్గులు వేస్తే ఆరోజు ఆవు రాలేదు సరికదా పాలవాడు రాక పాలుకూడా రాలేదు. ఇలాంటి చక్కటి నాటకీయత రమణీయంగా చిత్రంచగల నేర్పరి భానుమతి. ఇలా నాటకీయంగా ప్రతి కథను మలచగల శక్తి మంతురాలీమె. అందుకే వీరి కథలు చదువుతూన్నప్పుడు, వాటిని చదువుతున్న అనుభూతే కాకుండా, కళ్లకి కట్టినట్టు చూస్తున్న అనుభూతి అనగా ఒక దృశ్యం మనముందు కదలాడుతుంది స్పష్టంగా.

## ప్రాంతీయత:-

ఏ రచయితకైనా, వారి రచనల్లో ఆయా ప్రాంతాల్లో దొర్లే భాషా యాసా, వారికి తెలీకుండానే దొర్లుతూ వుంటుంది. అనుకోకుండానే అవి రచనల్లో స్పష్టంగా గోచరిస్తాయి. భానుమతి గారి కథల్లోనూ అంతే. ఆమె పుట్టి పెరిగినది అచ్చ తెలుగు ప్రాంతాలు. గుంటూరు, ఒంగోలు జిల్లా పడి కట్టుపదాలు, 'అట్టుగా, ఇట్టుగా, అనే మాటలు ఎక్కువగా పడతాయి.

తరువాత ఉన్న దంతా మద్రాసులోనే కనుక కొన్ని కొన్ని ప్రత్యేకంగా కనబడే తెలుగువారు కూడా వాడే తమిళ బాషాప్రభావం? 'ఏం సమాచారం?' ఇది ఎన్న సమాచారం? అన్నట్టుగా అనిపిస్తుంది. 'ఏం సంగతి? అనో ఏం విశేషం? అనో తెలుగులో సాధారణంగా వాడుతాం. సమాచారం అంటే మనకి 'ఇన్ఫర్మేషన్ అనే అర్థమే ఎక్కువగా గోచరిస్తుంది. 'అలాగే నేను విచారిస్తేలే' - అంటే నేను కనుక్కొంటాలే అన్న మాట. ఇది కూడా ఎక్కువగా మద్రాసులో తెలుగువారి భాషలో కనబడుతుంది. 'అయ్యో నెత్తిరాతా' అంటారు. ఇది కూడా మద్రాసు ప్రభావమేననుకుంటా! సాధారణంగా మనం 'తలరాత' అని వాడుతాం. అలాగే మద్రాసు వాతావరణంలో తెలుగు మాట్లాడేవారు 'తెస్తీనీ...చెప్తినీ' అంటారు. తెచ్చాను- చేశాను అన్న పదాలను 'ఆమె చేసే పులుసు పచ్చళ్లు, మీ కంచాలు ఎత్తిపడేస్తారని ఆమెకి భయం' 'ఎత్తి పడేస్తారనే మాట పారేస్తారన్న మాటకి బదులుగా వాడిన పదం. ఇలా కొన్ని కొన్ని మాటలు అక్కడి భాషా ప్రభావం వల్ల ఒచ్చినవని స్పష్టంగా తెలుస్తుంది. అయితే భానుమతిగారి కథల్లో తెలుగు తనం ఉట్టిపడుతూ వుంటుంది. కనుక నూటికి నూరుపాళ్లూనూ, ఈ పదాలూ. యాసలు

మనకి తొందరగా అంటవు. పట్టించుకోం. కథలోనూ,కథనంలోనూ ఉషారు గొలిపే సంభాషణల తీరులోనూ, సన్నివేశాలలోనూ లీనమైపోతాం. అయితే ఈ రకమైన పదాల ధోరణి ఎక్కడా ఆమె స్వీయ చరిత్ర గ్రంథం 'నాలో నేను' లో ఎక్కడా కనిపించదు. ఇది చిన్న నాటి నుంచి నెమరు వేసుకున్న జ్ఞాపకాల పుట్ట. అనుభూతుల మూట. అందుకే "నాలో నేను"లో తానుగా మాట్లాడుకుంటున్న భాషతనదైన శైలిలో పలుకుతుంది కాబట్టి.

## శైలి, చమత్కారం:-

ఆమెది ప్రత్యేకమైన శైలి, విశిష్ట మైన చమత్కారం, కథ చెప్పే రీతి. ఈ మూడింటిలో ఆమెకి ఆమేసాటి? అస్తమానం కొడుతూ భయపెట్టే రంగయ్య పంతుల్ని 'యముడిలాంటి' అంటూ చెబుతారు "నాలో నేను"లో. చిన్ననాటి స్కూలు విషయాలు చెబుతూ అలాగే హనుమయ్య పంతుల్ని రౌడీ మాస్టారు అంటారు. ఎవరో ఆడ పిల్లని గిల్లకూడని చోట గిల్లాడని. పైగా "వాడి పేరే హనుమయ్య పంతులు" అంటారు. అంటే అందుకే అన్నీ కోతి గుణాలని చెప్పడమన్న మాట. ఇలా ఒకర్నొకరు దెప్పిపొడుచుకుంటూ సాగుతుంది సంభాషణ.

ఇక చమత్కారాలు అనేకం ముఖ్యంగా "నాలో నేను"లో ప్రత్యేకంగా కనిపిస్తాయి. చిన్నప్పుడు వేసిన స్కూలు నాటకంలో లక్ష్మీదేవిగా, పాదుకా పట్టాభిషేక నాటకంలో రాముడిగా వెయ్యాల్సొచ్చిందిట. లక్ష్మీ దేవిగా బోలెడంత అలంకరణ తో పాటు బోలెడు నగలు కావాల్సొచ్చాయిట. సమయానికి వాళ్ళ నాన్న గారు ఊళ్లో లేక పోవడంతో ఏంచెయ్యాలో ఆలోచిస్తున్న సమయంలో అమ్మ అక్కమ్మ అనే ఆ స్కూల్లోనే పనిచేసే ఆవిడకి కబురు చేసిందట. వెంటనే ఆవిడ తన పెళ్లి నాటి చీర రాళ్లూడి పోయిన జడ రాకెడ, తమ పెళ్లికి ముందు వేసుకున్న జుమ్కీలు, అవీ హడావిడిగా తెచ్చేసిందట. తట్చాచార్యుల తాతయ్య ఇంటి నుంచి వడ్డాణం, ఎదురింటి వెంకటప్పయ్య శేష్టి గారి కూతురి వంకీలు, భార్య చంద్రహారం, అన్నీ కలిసి నన్ను 'చిల్లర కొట్టు చిట్టెమ్మ' లాంటి 'అరువు నగల ఆదిలక్ష్మి'ని చేశాయి అంటారు చమత్కారంగా. 'అరువు నగల ఆదిలక్ష్మి' అన్న మాటలో ఎంత చమత్కారం వుంది! ఆదిలక్ష్మికీ అరువు తప్పలేదనొచ్చు లేదా అరువు నగల బరువుతో ఆదిలక్ష్మి అయిందనొచ్చు. ఇలాంటి చమత్కారాలు భానుమతి గారి ప్రతీ కథలోనూ, 'నాలో నేను'లో నూ కూడా కొల్లలుగా కనిపిస్తాయి.

ఇది వారి చమత్కార పూరితమైన స్వభావానికి ప్రతీక. హాస్యధోరణి. ఈ ధోరణి ఆమెకి పుట్టుకతో ఒచ్చింది కనుక, అనాయాసంగా, అతి సహజంగా ఆమె కథల్లోనే కాదు, నిజ జీవితంలో సంభాషణల్లోనూ దొర్లుతుంటాయి. అందుకనే వారి కథలు కానీ, 'అత్తగారి కథలు' కానీ, 'నాలో నేను' కాని, ఎన్ని సార్లు చదివినా తనివితీరక, మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తుంది.

చదివినప్పుడల్లా మొట్టమొదటిసారి పొందిన ఆనందాన్నే కలిగిస్తుంది. అంత సున్నితమైన హాస్యం. సహజత్వంతో కూడిన, ఆరోగ్య వంత మైన హాస్యం. అందుకే చదుతూన్నంతసేపూ, మనసు నిండుతుంది. మనసుమీద పన్నీరు జల్లినట్టుగా వుంటుంది. వీరి సామర్థ్యానికి పద్మశ్రీ, పద్మభూషణ్‌లు రెండూ కూడా చిన్నవే! ఈ బహుముఖ ప్రజ్ఞాశాలికి ఈ హాస్య ప్రియురాలుకి ఇంకా పెద్ద బిరుదులు రావాలని మనసా వాచా కోరుకుంటున్నాను. ఆమె ఆంధ్రుల ఆడపడుచైనందుకు గర్విస్తూ....





# ముళ్ళపూడి వారి అక్షరాలు మణిదీపాలు

**శ్రీ శ్రీరమణ**

ఆయన ఇంకొకరిలా రాయరు. ఇంకొకరు ఆయనలా రాయలేరు. రాసింది తక్కువ. కాని. రాసిందంతా మేలిమి బంగారం. ముళ్లపూడి వెంటరమణ పత్రికలకు రాయడం మానేసి నలభై ఏళ్లు దాటింది. అయినా ఆయన రాసిన ప్రతి అక్షరం నిత్యనూతనం. ప్రజల నాల్కలమీద నిలిచి, తరం నించి తరానికి పౌరుషేయాలు అపౌరుషేయాలుగా సంక్రమించే సులక్షణ లక్షితమైన సాహిత్యం అరుదుగా వస్తుంది. ఆకోవకు చెందిన కవి, కథకుడు ముళ్లపూడి. ఔను మొదట ఆయన కవి తరువాతే కథకుడు.

"కానుక"లో:

''పొద్దువాటారినప్పటినించి మర్రిచెట్టులోంచి ఊడలు ఊడలుగా దిగకారుతున్న చీకటి చెలమై, చెరువై, చెలరేగిన యమునై సముద్రమై భూమినంతా ముంచి వేసింది.''

''వంశీనాదాన్ని హృదయంలో పోసుకున్నాడు''

''మంటలు వెదుళ్లమీద వెలుగునీడల భాషలో కావ్యాలు రాస్తున్నాయి''

''చితుకుల మంటలు కృష్ణుడిమీద ఎర్రపట్టుకండువాలా కదలాడుతున్నాయి''

''చీకటి రాధకంటి కాటుకలా, కృష్ణుడి వంటి నలుపులా నందుడి యింటి చల్లలా చిక్కబడింది''

''శ్రుతులన్నీ దాచుకున్న బొజ్జలోంచి ఓంకారానికి మూలస్థానమైన నాభిలోంచి మంగళ గళంలోంచి మధురాధరాల లోంచి.. వెన్నా, పాలు ఆరగించిన మదురాధరాలలోంచి జీవం వచ్చి తన వేణువులో ప్రవేశిస్తుంది.'' పైన 'కానుకలో' అన్నాను. ఇవి కానుక కథలో కొన్ని వాక్యాలు. ఇవే కాదు రమణగారి ఏ కథలోంచి అయినా రసాత్మకమైన వాక్యాలు అనేకం వుదాహరించవచ్చు.

బాల్యంలో అంటే పది పన్నెండేళ్ల వయసులో మొట్టమొదటిగా దగ్గరనుంచి చూసినపుడు వుద్వేగవుత్సాహ ఆనందాలతో (దుష్టసమాసమైతే కావచ్చు) నన్ను పరవశింప చేసినవి ప్రధానంగా మూడు. మొదటిది సముద్రం, రెండోది ఏనుగు, మూడోది విమానం.

మరి వాటిలో ఏమి మహిమ వుందో గాని యిప్పటికీ వాటిని చూడడం ప్రతిసారీ వొక కొత్త అనుభవంగానే అనిపిస్తుంది. మూడిటి మీద ఎన్నోసార్లు ప్రయాణం చేశాను. అయినా యిప్పటికీ అవి ఆకర్షణీయంగా, కొత్తగా కనిపిస్తూంటాయి. ఈ గ్రామర్ రమణగారి రచనలకీ వర్తిస్తుంది. జనరల్ బుక్స్ చదవడం ప్రారంభించగానే సామాన్యంగా చందమామ బాలమిత్రలతో అన్న ప్రాశన చేసేవారు. తర్వాత వీక్లీల్లో పడేవారు. ఆ రోజుల్లో వీక్లీ చేపట్టిన అమ్మాయికీ అబ్బాయికీ అభిమాన రచయిత ఎవరంటే ముళ్లపూడి వెంకటరమణ.

## రాధాగోపాలం కథల్లో:

"రాధ చెప్పుకొచ్చింది. పెళ్లికి ముందు మీకు మాత్రమే ఎస్టాబ్లిష్ మెంటు చార్జీలయ్యాయంటున్నారే! మీకు పచ్చజార్జెట్ చీర యిష్టమని మీరు వుత్తరం రాసినపుడు నేను మా అత్తయ్యనడిగి ముప్పయి రూపాయలు అప్పుచేసి మూడోనాటికి అది కట్టుకుని కనబడలేదూ? మీకు సంతోషమని తెలిసి, ఆదివారం తలంటు మానుకుని సోమవారం నాడు-బడికి టైమైపోతున్నా, తలంటుపోసుకుని, కాటుక పెట్టుకుని, కాళ్లకి పట్టా చేయించుకుని.. అన్నట్టు నాగరం కూడా.... వీటన్నిటికీ డబ్బు అవలేదా? ఆదివారం సాయంత్రాలలో మీరు బీచికి వస్తే మా ఫ్రెండ్సుకి పకోడీలు కొనేదాన్ని. మీరు గ్రీటింగు కార్డులు పంపితే మా చెల్లాయికి చాక్లెట్లు కొనిచ్చేదాన్ని. ఇలాగ నాకు బోలెడు ఎస్టాబ్లిష్‌మెంటు అయింది" -అని రాధమ్మ తనకష్టనిష్టూరాలు చెబుతుంది.

రాధమ్మ బాకీ, లహరి లాంటి రసవత్తరమైన పోస్ట్‌మారీడ్‌లైఫ్ కి సంబంధించిన కథలు రాసేటప్పటికి రమణగారికి యింకా పెళ్ళికాలేదు. "అబ్బ! పెళ్లికాకుండా అంతబాగా ఎలారాశారండీ" నికొందరు; "కనుకనే రాశారని కొందరు ఆశ్చర్యం, సమాధానం పడుతుంటారు. మంచి రచయితకి కావాల్సిన ప్రాథమిక అర్హత పరిశీలన తర్వాత ఆకళింపు చేసుకునే నైజం. దొంగ అంతరంగ మథనం తెల్పాలంటే కథకుడు దొంగ అయిఉండాల్సిన అవసరం లేదు. రాజైనా, కింకరుడైనా రాజకీయ నాయకుడైనా ఏయే సందర్భాలలో ఎలా ఆలోచిస్తాడు, ప్రవర్తిస్తాడో అంచనా కట్టలేనివారు రచయితలు కాలేరు.

చాలా ఏళ్లక్రితం దశాబ్ది తెలుగు కథలు పేరుతో కేంద్ర సాహిత్య అకాడెమీ ఒక సంపుటిని ప్రచురించింది. దానిని సంపుటీకరించిన వారిలో వాకాటి పాండురంగారావు (ఆయనకు రంగారావు అని రాస్తే కోపం వచ్చేది) గారు వున్నారు. అందులో రమణగారి "జనతా ఎక్స్‌ప్రెస్'కథ ప్రచురించారు. అది చూసిన రమణగారి అభిమాని వొకడు "ఏమండీ! కానుక కథ వేస్తే అదిరిపోయేది మీరు జనతా ఎక్స్‌ప్రెస్ సెలక్ట్ చేశారే" అని రెచ్చబడ్డాడు. వాకాటి వారు జవాబుగా నవ్వేసి వూరుకున్నారు. అభిమాని అంతటితో ఆగక "కథ అనగా నేమి, రమణగారి రచనలలో ప్రత్యేకత..." యిలా అనేక లోతైన అంశాల్లోకి జొరబడుతుంటే ఆయన

వారించి ఎందుకు ఆ కథ చేర్చారో చెప్పారు. ''ఇప్పుడో, కొన్నాళ్ల తర్వాతో; ఆంధ్రుడో, ప్రవాసాంధ్రుడో ఆ సంపుటి చదువుతాడనుకోండి. అప్పుడు ముళ్లపూడి వెంకటరమణ 'కానుక' కథ చదివి., ఓహో రమణ అనే కథకుడు యీ బైపు కథలు రాశాడన్న మాట అనే నిర్ణయానికి వస్తాడు. ఎందుకంటే అతను యిది ఒక్కటే చదివి వుంటాడు. రమణ ''కానుక'' లాంటి కథ ''కానుక'' వొక్కటే రాశారు. రమణ మార్క్ కథని, అతని వచన శిల్పాన్ని శాంపిల్‌గా అందించాలంటే 'జనతాఎక్స్‌ప్రెస్' కథ చేర్చడమే భావ్యమని నాకు తోచింది. ఆ సంపుటి సమగ్రంగా రమణని చదివిన వారికోసం కాదు. ఆ దశాబ్దంలో వచ్చిన గొప్ప కథకులను సంక్షిప్తంగా పరిచయం చెయ్యడం దాని లక్ష్యం.'' అని వివరంగా చెప్పాక అభిమాని కుదుట పడ్డాడు.

'జనతా ఎక్స్‌ప్రెస్' కథ భారతిలో మొట్టమొదటగా అచ్చయింది. ఆ రోజుల్లో భారతిలో ఏ రచన అయినా అచ్చు అవడమంటే అదొక అవార్డు వచ్చినట్టు లెఖ్ఖ. సాధారణ విషయం కాదు.

ఇక్కడ సందర్భం వచ్చింది కనుక వొక్క సంగతి చెప్పాలి. ముళ్లపూడి కథలతోనే మధ్యతరగతి మనుషులు పల్లెలనుంచి పట్టణాలకు, నగరాలకు చేరారు. అప్పటిదాకా కథలలో పల్లెటూరి నేపథ్యం కనుపించేది. తెలుగు కథ అర్బనైజేషన్‌కి ఆద్యులు ముళ్లపూడి. అపాద మల్లాది, పా.ప, కొ.కు, వీరి కథల్లో మనం పదహారణాలు తెలుగు పల్లెలనూ, అగ్రహారాలనూ చూస్తాం. భమిడిపాటి కామేశ్వరరావుగారి రచనల్లో మాటల్లో చిక్కని తెలుగు జానపదబాణి, చిత్రమైన పేర్లు కనిపిస్తాయి. మధ్యతరగతి-వీళ్ళే ఏ దేశంలో అయినా మెజారిటీ-మనస్తత్వంలో వొక నిరంతరమైన నస వుంటుంది. అదేంటంటే పై తరగతికి వెళ్లాలనే ఆశ, కిందికి పడిపోతామేమో ననే భయం. మధ్యతరగతి వారిలో వుండే నసని, యావని, గీరని వలపన్ని, కాపుకాసి పట్టి అక్షరాలలో బంధించిన గజ వేటగాడు వెంకటరమణగారు.

మిడిల్ క్లాస్ సైకాలజీ... ఇలాఇంగ్లీషులో చెప్పాలనుకోవడం కూడా మధ్యతరగతి నైజాల్లో వొకటి. చూడండి. జనతా ఎక్స్‌ప్రెస్‌లోంచి నాలుగు ముక్కలు అవధరిస్తే నాఘోష ఏమిటో సుస్పష్టం అవుతుంది:

''సుందరమ్మ నాలుగు వందలు పెట్టికొన్న పాతకారేసుకుని చీరల దుకాణానికి వెళ్లి పెద్ద పెద్ద చీరలన్నీ బేరమాడి ఒక జేబురుమాలు రూపాయ పెట్టికొంది. ఇంకోచోట ఏవో నాలుగు సామానులు కొని కారులో పడెయ్యిమంది షాపువాడ్ని. ఏ కారులో నండి అని అడిగాడు అతడు. కాంతులీనే పెద్ద పెద్ద కారులమధ్య ఉన్న తన పాత చిన్నకారుని చూసి సిగ్గువేసింది సుందరమ్మకి. అదుగో ఆ డొక్కుకారులేదూ... చిన్నది, అందులో పడెయ్యండి అంది. మళ్లీ ఏంతోచిందో.. ఆకారు మా డ్రైవరుది లెండి. మాది రిపేరుకెళ్లింది-అనేసింది.'

ఇలాంటి హిపోక్రసీ, కసిలతో కలల్నికంటూ, ఎవరికంటా పడకుండా కష్టాలను భరిస్తూ కాలం వెళ్లమార్చడమే మధ్యతరగతి జీవితం. అలాగని జీవితంలో వుండే చిన్న చిన్న ఆశలు, సరదాలు లేకుండా వుండవు.

మధ్యతరగతిని 'జనతాకాలనీ'కి ప్రతీకగా వాడుకున్నారు. 'జనతా ఎక్స్‌ప్రెస్'లో హైక్లాసు బోగీలు వుండవు. జనతా క్లాసు వొకటే వుంటుంది. ఈ కథలో పదకొండు ఇళ్లు, లేదా వాటాలు కథలో ముఖ్యభూమికగా నిలుస్తుంది. ఆ కాలనీలో రకరకాల మధ్యతరగతి మందహాసాలు, మంద్రహాసాలు వినవస్తాయి. ఆశలు, కలలు, కోపతాపాలు బాధలు బరువులూ, నిట్టూర్పులు వొగుర్పులు మిడిల్‌క్లాస్‌లో వడ్లగింజల్లో వొక్కలాగే వుంటాయి. వాళ్లమీద దేశకాలమాన పరిస్థితులు, ఆర్థిక సాంఘిక నైతిక విలువలూ అన్నీ తగుమోతాదులో పనిచేస్తూ వుంటాయి. వీటన్నింటినీ తట్టుకుంటూ త్రిశంకు స్వర్గంలో జీవితాన్ని సాగిస్తూ, అప్పుడప్పుడు "త్రిశంకు"ని బ్రాకెట్‌లో పెట్టేసి స్వర్గంలో వున్నట్టే పరవశించిపోయే మంచి మనుషులు వీళ్లు నిజానికి మధ్యతరగతి మనుషులంతా బతికిచెడ్డవాళ్లే. ముందు తరంలోనే స్థిరచరాస్తులు హరించుకుపోగా, మిగిలిన డాబు దర్జాలని కాస్తోకూస్తో వంటబట్టిన చదువుని స్వార్జితంగా తెచ్చుకుని బస్తీలో సెటిలైనవారే. వీళ్లకి పూర్తి వ్యతిరేకంగా ఇప్పుడు అల్లుకుంటున్న "నియోరిచ్" తరగతి. వీళ్ళు కొత్త భాగ్యవంతులు.

రమణగారి జనతా ఎక్స్‌ప్రెస్‌ని కదిలిస్తే డొంకంతా కదులుతుంది. మహారాజు యువరాజు, ఛాయలు, ఆకలీ, ఆనందరావూ యింకా రెండు మూడు కథలకి వేళ్లూ చిగుళ్లూ జనతాఎక్స్‌ప్రెస్ కథలో వున్నాయి. రమణ-బాపు చలన చిత్రరంగంలో అడుగు పెట్టి సాక్షి, బంగారు పిచిక తీశాక; అక్కినేని లాంటి పెద్దస్టార్‌తో "అందాలరాముడు" నిర్మించారు. ఈ కథకు పునాది జనతాఎక్స్‌ప్రెస్. నియోరిచ్ గారి రాజహంస, జనతాలాంచి ఒకే గోదావరి మీద ఒకే దేవుడిని చూడ్డానికి భద్రాచలం బయలు దేరతాయి. తర్వాత కథా కమీమిషు అందరికీ తెలుసు. అందాలరాముడులో పాత్రలు, వారి మాటలు యిప్పటికీ నిత్యనూతనం. అవన్నీ వున్నట్టుండి పుట్టుకొచ్చిన క్యారెక్టర్స్ కావు. జనజీవితంలోంచి రచయిత ఆలోచనల్లోకి వెళ్లి అక్షర రూపంలో ఆయన కథల్లో అడుగుపెట్టాయి.

ఎవరు ఏమి చెప్పినా ఒక్క మాట మాత్రం నిజం. గురజాడ వారి కన్యాశుల్కం వచ్చేవరకూ తెలుగువారు చదువుకుని హాయిగా నవ్వుకునే రచనలేమీ రాలేదు. గిరీశం పాత్ర తెలుగుదనానికి జెండాలా, ఆయన మాటలు తెలుగు తనపు ఎజెండాలా నూటపదహారు సంవత్సరాలుగా మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తోంది. నాటకం వల్ల గిరీశం, గిరీశం వల్ల నాటకం రక్తికట్టాయి. ఎప్పుడైనా కాల్పనిక సాహిత్యంలో రచయిత ఎన్ని సాముగరిడీలు చేసినా ఒక సజీవమైన పాత్రని, పాఠకులు ముమ్మూర్తులా ఐడెంటిఫై అయ్యే పాత్రని సృష్టించినపుడే ఆ

రచనకు సార్వజనీనత సార్థకత ఏర్పడుతుంది. గిరీశం, పార్వతీశం, కాంతం యివి నూరేళ్ల తెలుగు సాహిత్యంలో వచ్చిన పాత్రలలో కొన్ని. ఆ పాత్రల సృష్టికర్తలు పాత్రల పేరుమీదనే చిరస్థాయిగా నిలుస్తారు. ఆర్కెలక్ష్మణ్ కార్టూన్ పాత్ర "కామన్‌మాన్" అశేష ప్రజాకోటి ఆదరణకు నోచుకుంది. ఇటీవలే కాంస్య విగ్రహాన్ని నెలకొల్పి భారతీయులకి "సామాన్యుడి"పై గల అభిమానాన్ని చాటుకున్నారు.

యాభై ఏళ్ల క్రితం అలా ఆడుతూ పాడుతూ రమణగారు రూపకల్పన చేసిన పాత్రలు వొకటే రెండూ కాదు. ఆ చేతిలో పరుసవేది వుండి వుండాలి లేకుంటే పట్టిందల్లా బంగారం కాదు. రాధా గోపాలం అనే జంట, బుడుగు సీగానపెసునాంబ అనే గడుగ్గాయిలు, పక్కింటి లావుపాటి పిన్నిగారు, ఆవిడ ముగుడు, బాబాయి, రెండుజెళ్ళసీత అప్పారావు యింకా యింకా... అందరూ తెలుగువారి హృదయాలలో సుస్థిరంగా సెటిలైపోయారు. ఎక్కడెక్కడో వున్న వారిని గుర్తించి వాళ్లతో మాట్లాడించి కథలు నడిపించిన రమణగారికి తెలుగు పాఠకులు అత్యున్నత స్థానాన్ని యిచ్చారు. ఇస్తున్నారు. ఇవ్వకపోతే ఆయన సృష్టించిన పరివారం వూరుకోదు.

ప్రాచీన తెలుగు సాహిత్యంలో గౌరన సృష్టించిన "నక్షత్రకుడు" పేరు చెబితే వులిక్కిపడతారు. హరిశ్చంద్రుడంతటి వాడిని విశ్వామిత్రుడు తరపున వసూల్తా పుచ్చుకుని వేధించుకు తిన్నాడు. రోజూ వొకసారైనా మన యింట్లో "వీడొకడు నక్షత్రకుడు లాగా..." అనడం సర్వసాధారణం. ఆ పాత్రని కౌంటర్ చేస్తూ రమణగారి క్రియేషన్ అప్పారావ్. నక్షత్రకుడు అప్పులు వసూలు చెయ్యడంలో ఘటికుడు. ఇప్పుడు అలాంటివారి కోసమే జాతీయ బ్యాంకులు తీవ్రంగా గాలిస్తున్నాయి. నక్షత్రకుడు ధన ధృవం అయితే, పూర్తి వ్యతిరేకంగా అప్పారావు రుణధృవం. ఇతను సర్వాంతర్యామి. వెన్నెల ఎందుకు కాస్తుంది? పువ్వు లెందుకు పూస్తాయి? కృష్ణశాస్త్రి పొయిట్రీ ఎందుకు రాస్తాడు? యువభారతి వారు పుస్తకాలు వేసి ఎందుకు చేతులు కాల్చుకుంటారు? పిల్లలెందుకు నవ్వుతారు?- అందుకే అప్పారావ్ అప్పులు చేస్తాడు. అప్పారావుకు వొక వ్యక్తిత్వం, సొంత ఫిలాసఫీ వున్నాయి. పృథ్వ్యాపస్తే జోవాయురాకాశం అన్నారు. పెద్దలు. పంచభూతాల్లో అప్పు ఒకటి. ఈ భూప్రపంచంలో అప్పులో కాలు వెయ్యనివాడు వుండడు. ప్రపంచంలో ప్రజల నుంచో, ఇతర దేశాలనుంచో అప్పుచెయ్యని దేశమంటూ వుండదు. మొదటిదానికి తనే ఉదాహరణ, రెండోదానికి మనమే ఉదాహరణ అంటాడు అప్పారావ్. అప్పిచ్చువాడులేని వూళ్లో అడుగు పెట్టరాదన్నాడు వెనకటికో పెద్దమనిషి. సింహాచలం మీద వెలసిన దేవుడి పేరేమిటి? అప్పలస్వామి. కృష్ణదేవరాయలు తిమ్మరుసును ఏమనేవాడు? ఖజానా నిండుకోగానే "అప్పాజీ" అని పిలిచేవాడు. ఆయన అక్కడ అక్కడా అప్పుచేసి ఖజానా నింపేవాడు. ఇలా నడుస్తుంది అప్పారావ్ దాబుఋణకథ. అప్పుచేయడం ఏదో పెద్ద తప్పుచేయడం అనుకుంటారు కొందరు. "ఏంలేదు వాళ్ల డబ్బు కాసేపు మన దగ్గర వుండడం" అనేది అప్పారావ్

నిర్వచనం. ఎంత చల్లని మాట చెప్పాడో కదా అనిపిస్తుంది. అప్పారావ్ నేడు మనదేశానికి ముఖ్యంగా మన రాష్ట్రానికి రోల్‌మోడల్. టాంక్‌బండ్‌మీద కాస్తచోటు అరువిచ్చి అప్పారావు శిలావిగ్రహం పెడితే అందరం హర్షిస్తాం. దీనిని కొంచెం సీరియస్‌గా ఆలోచించి కార్యరూపం ధరించేలా చూడాల్సిన బాధ్యత ప్రతి తెలుగువాడిమీదా వుంది.

అప్పటిదాకా మన పిలకాయల్ని బాలకృష్ణుడిగా వూహించుకుని పెద్దలు మురిసిపోయేవారు. బుడుగు పుట్టాక తమ పిల్లల్ని బుడుగులో, సీగాన పెసూనాంబలో చూసుకోవడం మొదలు పెట్టారు. "మావాడు అచ్చం బుడుగే, చిచ్చర పిడుగే" అంటూ బుడుగన్నవాడు పాప్యులర్ సిమిలి అయిపోయాడు. కావల్సినంత గ్లామరు, సొంత గ్రామరు ఏర్పాటు చేసుకున్నాడు.

"అస్సలు నిఝుంగా అని వత్తి పలుకుతూ వొప్పించేందుకు తాపత్రయపడతాడు. "పరిగేరుకెళ్లి" అనడంలో బాణం దూసుకు వెళ్ళిన భ్రమ కలిగిస్తాడు. ఘుబుక్కున, ఇంఖా, రఖ్షించాలని, వింజిను, డికెష్టి, ఖథ, ఛ్చీన్నపిల్లలు యిలా బుడుగు రెండు సంపుటాలలో, వాక్యానికి మూడు మాటలు దొరుకుతాయి. తేలిగ్గా పిల్లాడని కొట్టెయ్యడానికి వీలులేదు. అప్పుడప్పుడు వడిసెలలో రాయి పెట్టి విసిరినట్లు కొన్ని స్టేట్‌మెంట్లు విసురుతాడు.

"నన్ను ఎవరూ తిట్టకూడదు. కొట్టకూడదు. కొట్టితే పాపం. అస్సలు నేను చిన్నవాడిని. నా నెత్తిమీద దేముడుంటాడు. నన్ను కొట్టితే వాణ్ణి కొట్టడం అన్నమాట".

"ఛాలా చిన్న పిల్లాడిని అడిగితే వాడు ఉంగా అంటాడు. అస్సలు వాడు అబద్ధం చెప్పాలన్నా చెప్పలేడు. ఎందుకంటే వాడికి తెలుగురాదుగా మరి. తెలుగొస్తేనే అబద్ధం చెప్పొచ్చు."

"శిక్ష అంటేచిన్న పిల్లల్ని బళ్లో పెట్టెయ్యడం అన్నమాట".

"నీతి అంటే కోత అని బాబాయి చెప్పాడు"

"నా అంతవాడు నేడు"

ఇలా రాసుకుంటూ పోతే బడుగు పుస్తకాన్ని మక్కికి మక్కి తిరగరాయాల్సి వుంటుంది. బుడుగు పదజాలంలో -ప్రైవేట్ చెప్పడం అంటే తిట్టడం, ఉపాయం అంటే అబద్ధం, రూల్సు మార్చడం అంటే అన్యాయం చెయ్యడం, డేంజరు అంటే పిన్నిగారూ మా బామ్మా పొట్లాడుకోడం, ధైర్యం అంటే పోలీసుతో మాట్లాడ్డం.... యింకా యిలాంటివి బోలెడు వున్నాయనుకో. ఖావాలంటే చదివి కొనుక్కో పోనీ కొని చదువుకో. తూర్పుకోస్తా నించి గిరీశాన్ని చెన్నపట్నం లాక్కొచ్చి అదే పన్థాలో కొత్త లెక్చర్లు యిప్పించి జనం డంగైపోయేలా చేశారు. గిరీశానికి ఫేస్ లిఫ్ట్ ఇచ్చారు.

కన్యాశుల్కంలో గిరీశం పదిమందిలో ఒకడు. రమణగారి గిరీశం ఒకే ఒక్కడు. దిగజారుకున్న సినీమాపన్థా మీద అనర్గళంగా మాట్లాడతాడు.

"బుక్స్ ఆర్ ది బెస్ట్ కండక్టర్స్" అన్నాడు విద్యుచ్ఛాస్త్రకారుడు. వాటిద్వారా లవ్ లెటర్స్ గట్రా అద్భుతంగా బట్వాడా అవుతాయి. ఎవరి పుస్తకం వారు కొనుక్కొని ఎరువడగడం మానేస్తే యింక ప్రేమ కలాపాలెలా సాగేట్టూ? అవి ఆగితే సృష్టి స్తంభించి పోతుంది" అంటాడు పుస్తకాల మీద లెక్చరిస్తూ

ఇతర భాషల్లోంచి సినిమా డబ్బింగ్ చేసేటప్పుడు అసలు టెక్నీషియన్స్ పేర్లను వదిలేసి అదేదో మేం సొంతంగా నిర్మించాం అన్న కలర్‌యిస్తారు. దానిమీద గిరీశం తీవ్రంగా స్పందిస్తూ- "అరవపిక్చరు పాటలు చేసిన మ్యూజికు డైరెక్టరు పేరుని తెలుగులో రీరికార్డింగ్ చేసిన వాడి పేరులోకి ఎంత షోగ్గా తర్జుమా చేస్తున్నారూ?" అని ముక్కున వేలేసుకుని వారికో సలహా యిచ్చాడు. "అందులో శివాజీగణేశనూ, పద్మిని నటిస్తే పబ్లిసిటీలో రామారావు అంజలీదేవి ఆవటాని ట్రాన్స్లేట్ చేసి అఘోరించవచ్చుగా" అని లాభసాటి ఐడియా యిచ్చాడు.

సందర్భోచితంగా మాటలు కట్టడం, కొత్తపదాలు కాయిన్ చెయ్యడం రమణగారు లీలగా అవలీలగా చేయగలరు. గిరీశం లెక్చర్స్‌లో-కంఠశోషలిజమ్, కామన్‌ధేనువు, భర్త కంట్రోలు, బ్రిలియంట్ల వెధవ, క్రిటీకాతాత్పర్యాలు, పొగరుమోతుబర్లు ఎట్సెట్రా ఎట్సెట్రా- మాటలు పొందిగ్గా అర్థవంతంగా కాయిన్ చెయ్యడం అంతతేలికకాదు. రమణగారు వొకసారి కాయినేజెసే ప్రసక్తి వచ్చినపుడు వొక ఉదాహరణ చెప్పారు. అందాల రాముడు సినిమాలో "డబ్బు జబ్బుచేసి పైకి పోయాడు" అనే డైలాగ్ వుంది. ఎవరూ ప్రత్యేకంగా ఆ డైలాగ్ అప్పట్లో పట్టించుకోలేదు. అందాల రాముడులో "తీ.తా" నించి రాజబాబు "భద్రాచలంలో యిక మీకు పువ్వులేబాకీ" అని తనతో జతకట్టడానికి మోజుపడే అమ్మాయితో అనడంతో సహా అందరూ పదే పదే కోట్ చేస్తారు. చిరంజీవి హీరోగావచ్చిన "మంత్రిగారి వియ్యంకుడు" సినిమాకి మాటలు రాస్తూ "పాపం డబ్బుచేసి పైకి పోయాడు" అనే డైలాగ్ రాశారు రమణగారు. ఈ డైలాగ్‌ని ప్రేక్షకులు బ్రహ్మాండంగా రిసీవ్ చేసుకున్నారు. "డబ్బు జబ్బుచేసి" అన్నమాట కుదించుకుని 'డబ్బుచేసి' అనేమాటగా నా మనసులో రూపాంతరం చెందడానికి ఇరవై ఏళ్లు పట్టింది" అన్నారు. అంటే ఒక చిన్న కుదింపేగాని స్ఫురించాలి కదా! మాటలు ఎవరిసొంతమూకాదు. కాని ఎవరు ఏ మాటను ఎంచుకుంటారు, ఎలా పేరుస్తారు అనేదానిమీద రచనా శిల్పం ఆధారపడి వుంటుంది

విక్రమార్కుడి మార్కు సింహాసనం కథలలో సినిమాల మీద రమణమార్క్ సెటైర్ రీళ్లకొద్దీ దొరుకుతుంది.

"మీరు ఇపుడు సినిమారైటరు. జాగ్రత్తగా ఈ ప్రశ్నకు జవాబివ్వండి. రామాయణం ఎండింగులో ఏమౌతుంది? సీత దొరుకుతుందా?"జీ

"ఏం చెప్పగలమండి? మీరు ఇలా హఠాత్తుగా అడిగితే. స్క్రిప్టుని బట్టి వుంటుంది" -ఇది పై ప్రశ్నకు జవాబు.

"ఆయన ఎన్నికష్టాలు పడి పెద్దవాడయ్యాడో తెలుసా?"

తెలీదండీ, ఎన్ని?

"జ్ఞాపకం లేదు బోల్డుంటాయి" -ఇది కూడా విక్రమార్కుడి మార్కులోదే.

ముళ్లపూడి మద్రాసులో ఆంధ్రపత్రికలో చేరడానికి ముందు శ్రీనివాస శిరోమణి గారి వద్ద రాయసకాడుగా పనిచేశారు. శిరోమణి గారు అప్పట్లో రామాయణం వచనంలో రాస్తున్నారు. వాల్మీకి మూలం మొదలు, యింకా అనేక రామాయణాలను లోతుగా పరామర్శించే అవకాశం దొరికింది. ఇటీవల విడుదల అయిన శిరోమణిరామాయణానికి అతిక్లుప్తమైన ముందు మాటలాంటి తన జ్ఞాపకాలను అందించారు రమణగారు. సందర్భశుద్ధితో ఉపమానాలను శరసంధానం చేసినట్టుగా గుప్పించడం వాల్మీకి మహర్షి బాణి. రమణగారు ఒక్కొక్కచోట వరసగా పోలిక మీద పోలిక చెప్పినపుడు ఆయన రచనలు చేయడానికి ముందు వాల్మీకిని చదివిన పుణ్యం అనిపిస్తుంది.

## విక్రమార్కుడి మార్కు సింహాసనం కథల్లో:

"...హఠాత్తుగా ఆ చిక్కటి వెచ్చటి చీకట్లో-చెరువులోరాయిలా, నిశ్శబ్దంలో గావుకేకలా, దాంపత్యంలో ద్రోహంలా, అబద్ధంలో నిజంలా, దరిద్రంలో డర్బీస్వీప్‌లా, ఆశలో నిరాశలా, మబ్బులో మెరుపులా, వీణాగానంలో తీగెతెగటంలా, మామూలు పత్రికలో యుద్ధప్రకటన వార్తలా, మృత్యువులో జీవితంలా, స్నేహంలో వంచనలా, ప్రభుత్వంలో కుట్రలా, గంద్రగోళంగా, వెకిలిగా, ఎంత భయంకరంగా, సహజంగా, అద్భుతంగా, హఠాత్తుగా, ఆ గదిలోపలి చీకటిలోపలి అతని ప్రశ్నకు జవాబులా నూరు కొవ్వొత్తు వెల్తురు బద్దలయ్యేసరికి రాజుకి ఒళ్ళు ఝుల్లుమంది."

ఇలాంటి కవితల్లాంటి, వచనగీతాల్లాంటి, మెరుపుగీతల్లాంటి పదాల పొహళింపు ముళ్లపూడి వారి రాతలలో సర్వసాధారణం. ఈ సందర్భంగా ఇద్దరు పెద్దవాళ్లను స్మరిస్తున్నాను. రావిశాస్త్రిషష్టిపూర్తి సమయంలో "జులై30"పేరిట ప్రత్యేక సంచిక వెలువరించారు. అందులో చాగంటిసోమయాజులు (చాసో) గారు తమ వ్యాసంలో:

"రావి శాస్త్రి గారితో పరిచయమైన పదేళ్ల తర్వాత- అంటే శాస్త్రిగారు రచయితగా

పదేళ్లు కృషి చేసిన తర్వాత, చెన్నపట్టణంలో మిత్రులు కొడవటిగంటి కుటుంబరావుగారు, నేను మాతరం తర్వాత (1960వ దశాబ్దంలో) విశిష్టమైన రచయితలు ఎవరు? తెలుగుదేశంలో-అనే చర్చచేసి యిద్దరే యిద్దరు విశిష్టుల్ని గుర్తించాం. అందులో ఒకరు ముళ్లపూడి వెంకటరమణగారు. రెండవవారు రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు. ఆ ఇద్దరిలో నాకు సైద్ధాంతికంగా రాచకొండ దగ్గరవాడు'' -అన్నారు.

మధ్యతరగతి సాంఘిక ఆర్థిక మనోభావాలను రమణ తనకథలలో విపులంగా పరిచి ''నామీదేనఁరోయ్'' అని ప్రతి సగటు పాఠకుడు బుజాలు తడుముకునేలా చేశారు. రాజకీయాలకు ''రాజకీయ బేతాళ పంచవింశతిక'' రచించి సముచిత స్థానం కల్పించారు. రాసిన యాభైఏళ్ల తరవాత యిప్పుడు మళ్లీ చదువుతుంటే ''యివి కథలు కావు నిజాలు, కల్పనలు కావు వార్తలు'' అనిపిస్తుంది. కాసిని మచ్చుముక్కలు:

''తప్పైనా ఒప్పేలా తప్పులు చేయడం రాజకీయం''

''ప్రజలు వేరు వోటర్లు వేరు''

''చర్చలే దేశానికి జీవం. అదే రాజకీయ చైతన్యం''

''మెజారిటీ జనం చేసేది నేరమెలా అవుద్ది''.

''ప్రతి అభ్యర్థికీ రెండు మానిఫెస్టోలుంటాయి, డబుల్ ఎంట్రీపద్దుల్లాగా. ఒకటి ప్రజలను ఆకట్టుకునేది, రెండోది గ్రూపులనూ నాయకవినాయకులనూ ఆకట్టుకునేది''

''లంచగొండితనం వంటి అవినీతి పనులన్నీ ఇవినీతి పనులన్నీ జాబితాలోకి ఎగబాకిపోయాయి''

''పిల్ల ఎలక్షను వాగ్దానంలా ఏపుగా నదరుగా వుంది. సుస్థిర ప్రభుత్వంలా ధీమాగా వుంది. కాబోయే మంత్రిగారి ముఖంలా కళకళలాడుతోంది. లంచగొండి వుద్యోగంలా పచ్చగా వుంది. రాజనీతిజ్ఞుడి భాషలా, అవకాశవాది అబద్ధాలలా ఆమె కనులు సొగసుగా తీర్చిదిద్దివున్నాయి.'' ''అతను రెడ్డిగారికి బుజ్జింక మీసంలాంటివాడు, చెప్పులజతలాటివాడు, గొడుగులాటివాడు, లవుడుస్పీకరు లాటివాడు.''

''చౌదరిగారు ఎన్నికయినట్టు మర్నాడు పేపర్లలో పడింది. ఇష్టంవున్న పేపర్లు ఏకగ్రీవంగా అని రాశాయి. లేనిది పోటీలేకుండా అని రాశాయి.''

ఇలా వుదాహరిస్తూ పోతే.. ఎక్కడా ఆగాలో, ఎక్కడ ఆపాలో తెలియదు.

సర్వసాధారణంగా ప్రతిభా పాటవాలు వున్నవారు తమని పాఠకులు విమర్శకులు

తక్కువ అంచనా వేస్తారేమోనని తమ యావత్ శబ్దశక్తినీ ప్రయోగించాలని ప్రయత్నిస్తారు. అందుకోలేక పాఠకులు విలవిలలాడిపోతారు. రీడర్స్ వేరు విమర్శకులు వేరు. క్రిటిక్కు రైటర్ పనివాడి తనాన్ని మెచ్చుకున్నాడంటే ఆ రచన పాఠకులను చేరడం కష్టతరమే. ఎవరేమనుకున్నా సరే నాలక్ష్యం పాఠకులు, పాపం వాళ్లని నిఘంటువుల్లో యిరికించ కూడదనుకున్న రచయిత ఎప్పుడూ విజేత అవుతాడు. కాని ఆ నిగ్రహాన్ని సాధించడానికి, అమలు చేయడానికి పెద్ద మనసు కావాలి.

సాంఘిక కథలోనే కాదు ఇతివృత్తం పౌరాణికం అయినా అంతసూటిగా, అంతసుఖంగా రాయగలగడం రమణగారి సొత్తు. ట్రయల్ పార్ట్‌గా సీతాకల్యాణం కథనుంచి ప్రారంభ వాక్యాలు వినిపిస్తాను.

''ఫెళ్లున విల్లు విరిగింది.

మైథిలి గుండె ఝుల్లుమంది.

సిరి హరిని వరించింది.

పర్జన్య గర్జన వంటి ఆ ఫెళఫెళార్భటికి సమస్త చేతనా ప్రపంచము సంభ్రమ చకితమై సమ్మోహితమై పోయింది. భూధరాలు బ్రదల్లయ్యేవేళ వలె భువన భవనం దద్దరిల్లిపోయింది.

ఆ హర ధనుర్భంగ ధ్వని ధర్ములకు అభయదమై, అధర్ములకు భయదమై మనోహరంగానూ, ప్రాణహరంగానూ కూడా వినిపించింది. దిశ దిశాంతాలనూ సోకి ప్రతిధ్వనించింది.

దూరాన హిమవత్పర్వతసీమలో తపోనిష్ఠలో వున్న భార్గవ రాముడికి అది హెచ్చరిక అయి వినిపించింది. ధర్మప్రతిష్ఠాపనలో, అధర్మక్షాత్రసంహారకుడు భృగుకుల తిలకుడి భూమికను క్షాత్రధర్మ సంతారకుడు రఘుకుల తిలకుడు స్వీకరించే మహత్తర సన్నివేశానికి నేపథ్యగీతమై భాసించింది. భార్గవుడు ఆధ్వని వినిముహూర్తకాలం పాటు భ్రుకుటి ముడిచాడు సాలోచనగా.

మిథిలాధిపుడి సభలోనే దగ్గరగా వున్న బ్రహ్మర్షి విశ్వామిత్రుడికి అది విజయభేరిగా వినిపించింది. ప్రకృతయుగధర్మ ప్రవర్తనానికి నాందీ ప్రస్తావన చేశావా ప్రభూ! అనుకున్నాడాయన.

దశకంఠ సంహారకాండలో పతాక సన్నివేశం ఆరంభమైంది అనుకుని ఆనందించారు దేవతలు.

మా అన్న! అనుకున్నాడు లక్ష్మణుడు సగర్వంగా

నా ప్రతిజ్ఞ చెల్లింది. భగవంతుడే నాకు అల్లుడౌతున్నాడు-అనుకున్నాడు రాజర్షి జనకుడు తృప్తిగా, సగర్వంగా.'' ఇలా సాగుతుంది. సీతా కల్యాణఘట్టం కళ్లకు కట్టినట్టు.

సాహిత్యంలో రమణగారు చేసినన్ని విన్యాసాలు మరెవరూ చేయలేదు. అన్నీ కాలానికి నిలిచేవేనని యాభైఏళ్ల తర్వాత సంశయాత్మకులు సైతం అంగీకరించకతప్పదు. రమణగారు ''నవ్వితే నవ్వండి'' అంటూ రెండు జోకు సంకలనాలు కూర్చారు. జోకువల్ల నవ్వురావడం ఒక ఎత్తు, రమణగారి చెప్పేతీరు రెండు ఎత్తులు. వెరసి టోకున జోకులన్నీ అద్భుతంగా పేల్తాయి. ఎన్నిసార్లు వెలిగించినా.

పత్రికలో జర్నలిస్టుగా పనిచేస్తూ ప్రవృత్తిగా కొన్ని, వృత్తిధర్మంగా కొన్ని రాశారు. ఏ రకంగా రాసినా ఆయన ముద్ర స్పష్టం.

1957లో విడుదలైన వినాయక చవితి సినిమాని సమీక్షిస్తూ- అంతారాసి ఆఖరున '' ''-ఇవిగాక ఖడ్గగదా మల్ల ముష్టియుద్ధాలు, రథాలమీద ఫొటోజెనిక్ తరుములాటలూ, ఆఫ్రికాలో సింహాల పోట్లాటలూ అవీ వున్నాయి. పుణ్యం పురుషార్థమూనూ... సత్కాలక్షేపం కావాలంటే నిక్షేపంగా వెళ్లి కూర్చోవచ్చు.'' అని ముగించారు. రాజ్యం పిక్చర్స్ కృష్ణలీలలు సినిమా సమీక్షని ముగిస్తూ- ''మొత్తం మీద మిగతా లీలలూ ఆటపాటలూ హాయిగానే ఉన్నాయి. కాబట్టి పిల్లలతో ఓసారి వెళ్లి చూడవచ్చు. అప్పుడేనా కృష్ణుడి నోట్లో భూగోళం (ఆస్ట్రేలియా, ఇండియా వగైరా మ్యాపులతో ఉండును) కనబడే దృశ్యం వచ్చినపుడు పిల్లల దృష్టి అట్నించి మళ్లించడం మంచిది'' - అనే సూచన చేశారు.

''పరిశ్రమ పరిమాణం పెరిగినా ప్రమాణం ఆగిపోయింది,'' బాక్సాఫీసు తోకలు పట్టుకుని గోదావరి ఈదేవాళ్లు..'' ఇలాంటి సూత్రాలను ఎన్నింటినో ఆ రోజుల్లో ప్రతిపాదించారు. వ్యాసాలలో, సమీక్షలలో తన బాణీలో అనేక కొత్త మాటల్ని సృష్టించారు. పేరులో పెట్రోలు పోయడం, తెలుగు మీరిపోవడం, అష్టాదశ సమస్యలు, సినిమా వతి, నటాళి, దిలీప్ కుమారుడు, మీనాకుమార్తె, కథరాజుకోవడం, పాలాస్టి ప్రమాదాలు యిలాంటివి మాటమాటకీ మాటిమాటికీ కనిపిస్తాయి.

రమణ గారితో యిదే పేచీ. ఇంకొందరి విషయంలో అయితే, వారి రచనలన్నీ చదివి, భూతద్దం వేసుకు వెతికి నాలుగో లేదంటే పదో కోటబుల్ కోట్స్ వున్నాయని ఫోకస్ చేసి చూపించవచ్చు. ''లోకమంతా విభుని ప్రాణమందిరమైన వీధివాకిలి ఏది చెల్లెలా'' అని కృష్ణశాస్త్రీయం గారన్నట్లు ముళ్లపూడి వారి వాక్యాలన్నీ ఉటంకించాల్సినవే. ఏదైనా వదిలేస్తే సామాన్య పాఠకుడు సైతం'' ''వీడెవడో పప్పులో కాలేశాడు. అసలు మెయిన్‌ది వదిలేసి అక్కర్లేని విన్యాసాలు చేశాడు'' అని ఆడిపోసుకునే అవకాశం వుంది.

ఈ వ్యాస విస్తరణకు కారణం రమణగారి సృష్టి లోపమే గాని వ్యాసకర్త దృష్టిలోపం కాదనిపించుకోడానికి మరికొన్ని కలుపుతున్నా.

"కృష్ణుడ్ని గురించి నాటికీ నేటికీ తుదీ మొదలూ పసిగట్టాలని చాలా మంది తిప్పలు పడుతూనే ఉన్నారు. ఆ రెండూ ఉండవని తెలిసినా ఏమాట కామాటే చెప్పుకోవాలి. ఋషుల తరవాత ఈ విషయమై గట్టిగా ప్రయత్నం చేసింది సినిమా వాళ్లే".

"ఈ చిత్రంలో కథ గురించి మటుకు మనం ప్రాణాలుగ్గబట్టుకు కూర్చోనవసరం లేదు. తరవాత ఏం జరుగుతుందన్న దానిపై పెద్దఎత్తున పందాలు వేసుకోనక్కరలేదు".

ఇంకా వాచవిగానైనా చెప్పాల్సిన అంశాలు అనేక మిగిలేవున్నాయి. ఆదుర్తి-సుబ్బారావు, రేలంగీ-వెంకటరామయ్యా, చార్లీ చాప్లిన్, తెలుగు వెలుగులలో కొందరు ప్రముఖులు - వీరి పదచిత్రాలు రమణ గారి కలం నుంచి హుందాగా స్వచ్ఛంగా, స్పష్టంగా వెలువడ్డాయి.

రమణగారు పత్రికలకు ఏడెనిమిదేళ్లు వృధృతంగా రాశారు. తర్వాత సినిమా రంగంలో అడుగు పెట్టారు. సినిమా స్క్రిప్ట్ రైటర్‌గా ఆయన సంతకానికి ఒక విలువ తెచ్చుకున్నారు. సంపూర్ణరామాయణం, సీతాకల్యాణం లాంటి పౌరాణిక చిత్రాలు సంభాషణలు రాసేటప్పుడు కూడా రమణ గారి మాటలు లలితంగా, ఒక ప్రత్యేకమైన పరిమళంతో గుబాళించాయి. పింగళినాగేందర రావు గారు మాయాబజార్‌కి రాసిన మాటలు అచ్చమైన పౌరాణికపు మాటల్లా ఘాటుగా వుండవు. అట్లాగని దూదిపింజల్లా తేలిపోవడమూ వుండదు. పింగళి వారి వొరవడికి తన పలుకుబడిని జోడించారేమోనని పిస్తుంది. రమణ గారి పౌరాణిక చిత్రాల సంభాషణలను గమనించినపుడు.

ముళ్లపూడి వారు రాయడం మొదలు పెట్టినప్పటి నించీ రాస్తూనే వున్నారు. పత్రికలకి రాయడం లేదని చాలా మంది "మీరేం రాయడం లేదేమండీ" అని అడుగుతుండేవారు. సినిమా స్క్రిప్ట్ రాయడమంటే - ఒక్కొక్కటి వంద కథల పెట్టు. రమణ గారు తన సినిమాలతో "కంట్రాక్టరు" లాంటి అద్భుతాన్ని సృష్టించారు. అద్భుతం ఎందుకంటె విలనపాత్రని ప్రజలు ఆదరించేలా చేయడం సామాన్యమైన సంగతి కాదు. కో.కొ.పా(భక్త కన్నప్ప) గుమ్మడి కాయ (బుద్ధిమంతుడు), తీ.తా (అందాలరాముడు), అమ్మ్యామ్మ్య లాంటి మాటలు నిత్యకృత్యంలో జనం వాడుకునేలా పాప్యులర్ అయినాయి.

ఒక విశ్వవిద్యాలయం కూడా చేయలేని పనిని వొంటి చేతిమీదగా చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి ఆరుద్ర. ఆయన రమణ గురించి చెబుతూ - " రమణ రాసిన ఏ కథ చదివినా సరే ఇది తెలుగువాడు తప్ప ఇంకోడు రాయలేడు అని స్పష్టంగా చెప్పవచ్చు. ఆయన ఊహలు తెలుగు తనంతో ఊపిరి పీలుస్తాయి. తెలుగువాళ్ల మంచి చెడ్డలు, మాయ మర్మాలు, కష్టసుఖాలు, నిత్యనైమిత్తికాలు, మధుర స్వప్నాలు ఒకటేమిటి తెలుగు జీవితం ఆయన కథా వస్తువు." అని విశ్లేషించారు.

హిపోక్రసీ తెలియని వ్యక్తిత్వం రమణ గారిది. ఆర్ద్రత, దయ, జాలి, ఆయనకు ఆనవాళ్లు. రమణ గారికి చేతిలో డబ్బుంటే తోచదు. డబ్బు లేకపోతే మరీ తోచదు. అతి నిరాడంబరమైన మహాభోగి ఆయన. సంతోషాన్ని సమస్యనీ కూడా నవ్వుతూ స్వీకరించి సమాదరించగల సమర్థుడు. వారు రాసిన కథలూ సమీక్షలూ వొక ఎత్తు, రచయితగా నిర్మాతగా రూపొందించిన సినిమాలు ఒక ఎత్తు. వీటన్నిటినీ మించి సృష్టిలో తీయనైన స్నేహానికి నిర్వచనం బాపురమణల జంట. "రెండు కళ్ళు- ఇద్దరిదీ ఒకే చూపు" అన్నారు కొందరు. అందమైన ద్వంద్వ సమాసం బాపురమణ అని అభివర్ణించారు మరికొందు. తెలుగుసంస్కృతికి వారిద్దరూ బొమ్మాబొరుసు అని ఇంకొందరు.

పచ్చని గోరింటలో అరుణిమలు పండినట్టు రమణ గారి హాస్యంలో దాగిన కరుణ రసమే రమణ ని పంట గడిలో కూచోపెట్టిందని అనుభవజ్ఞులు అంటారు. పసుపు సున్నం కలిస్తే పండు పారాణి అవుతుంది. బాపురమణల స్నేహరాసిక్యత ఆంధ్ర సరస్వతి పాదాలకు ఆరని పారాణి.



## గలగలా గోదారి...

★ 1931 జూన్ 28న తూర్పుగోదావరి జిల్లా ధవళేవ్వరంలో పుట్టారు. తండ్రి శ్రీసింహాచలం తల్లి శ్రీమతి ఆదిలక్ష్మి

★ 1945లో బాల పత్రికలో కథలూ, పద్యాలు రాయడం ప్రారంభించారు.

★ ఆంధ్రపత్రిక సంపాదక వర్గంలో 1954లో వుద్యోగంలో చేరారు.

★ 1960లో సినిమా డైలాగ్ రైటర్‌గా అవకాశం వచ్చింది.

★ 1964 జనవరి 26 శ్రీదేవితో వివాహం

★ రచయితగా, నిర్మాతగా తొలిచిత్రం సాక్షి 1967లో నిర్మించారు. ఇది బాపు డైరెక్ట్ చేసిన తొలిచిత్రం

★ 1976లో హైదరాబాదులో జరిగిన తొలిప్రపంచ తెలుగు మహాసభలలో సత్కారం.

★ అందాలరాముడు (1973), ముత్యాల ముగ్గు (1975), పెళ్లి పుస్తకం (1991), మిస్టర్ పెళ్లాం (1993) చిత్రాలకు ఉత్తమ సంభాషణా రచయితగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నంది అవార్డులు అందుకున్నారు.

★ 1981లో వంశవృక్షం చిత్రానికి కళాసాగర్, సితార అవార్డులు లభించాయి.

- ★ చలన చిత్ర రంగానికి చేసిన సేవలకు గుర్తింపుగా 1987లో రాష్ట్ర ప్రభుత్వం రఘుపతి వెంకయ్య అవార్డుతో సత్కరించింది.
- ★ ప్రాథమిక తరగతుల పాఠాలను వీడియోలో రూపకల్పన చేసినందుకు 1987లో రాష్ట్ర ప్రభుత్వం ఘనంగా సత్కరించింది.
- ★ 1988-89 ఆంధ్రప్రదేశ్ ఫిలిండెవలప్‌మెంట్ కార్పొరేషన్ డైరెక్టర్‌గా, 1990 ఆలిండియా చిల్డ్రన్ ఫిలింసొసైటీ ఎక్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా ఉన్నారు.
- ★ తెలుగు విశ్వవిద్యాలయం 1992 గౌరవ డాక్టరేట్‌తో గౌరవించింది.
- ★ 1992లో అమెరికా తెలుగు అసోసియేషన్ ''శిరోమణి'' బిరుదుతో సత్కరించింది.
- ★ 1992లో బాలల అకాడమీ ''బాలబంధు'' టైటిల్‌తో గౌరవించింది.
- ★ 1935లో తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా (తానా) బాపురమణలను ఆహ్వానించి గౌరవంచింది.
- ★ గుప్త ఫౌండేషన్ (ఏలూరు) అవార్డు, ఇంకా అనేక ఇతర సత్కారాలు.
- ★ E టివి కోసం భాగవత కథలు (హిందీ తెలుగు భాషలలో) 1996 నుంచి తీర్చిదిద్దుతున్నారు.
- ★ రాష్ట్ర సాంస్కృతిక శాఖ, క్రోక్విల్ అకాడెమీ పక్షాన 2002 డిసెంబర్ 15న లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్ అవార్డులో సత్కారం జరిగింది.

## వెలువడిన పుస్తకాలు

రాధాగోపాలం (కథలు)

సీతాకల్యాణం ( కథలు )

జనతా ఎక్స్‌ప్రెస్ ( కథలు)

భగ్నవీణలూ బాష్పకణాలు ( కథలు )

గిరీశం లెక్చర్లు

రాజకీయ భేతాళ పంచ వింశతిక

విక్రమార్కుడి మార్కు సింహాసనం

ఇద్దరమ్మాయిలూ ముగ్గురబ్బాయిలూ

ఋణానందలహరి

బుడుగు - రెండు భాగాలు

శ్రీకృష్ణ లీలలు

బాపురమణీయం (సినిమా సమీక్షలు)

కథానాయకుడి కథ (అక్కినేని జీవిత కథ)

80 రోజులలో భూప్రదక్షిణం (జూల్స్ వెర్న్ అనువాదం)

పి.టి. 109 (కెన్నాజీ జీవితం - అనువాదం)

బొమ్మ - బొరుసు (కదంబం)

ఇద్దరు మిత్రులు (వెండి తెర నవల)

వెలుగు నీడలు (వెండి తెర నవల)

భార్యాభర్తలు (వెండి తెర నవల)

(ఇప్పుడు ముళ్లపూడి సాహిత్యం రెండు సంపుటాలుగా వెలువడ్డాయి. మిగిలిన సంపుటాలు త్వరలో రానున్నాయి.)

★ తిరుమల తిరుపతి దేవస్థానం వారికి శ్రీవారి బ్రహ్మోత్సవాలు క్యాసెట్‌కు వ్యాఖ్యానం రాశారు.

★ ఇప్పటి వరకు 60 సినిమాలకు రచయితగా పనిచేశారు.

**పారిజాత పరిమళాలు పంచే సత్కీర్తి**
**మల్లెపూల తావులు వెదజల్లే విస్ఫూర్తి**
**పాలాశ ప్రసవాగ్ని ద్యుతులు చిమ్ముతుంది**
**పాత కొత్త లెరుగదులే 'యువభారతి' మూర్తి**

**- డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**







చుట్టూరా ఆవరించుకుని వున్న
చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం
కంటె, ప్రయత్నించి ఎంత చిన్న
దీపాన్నయినా వెలిగించడం మంచిది.

**యువభారతి ప్రచురణలు**

50% తగ్గింపు ధరలో లభిస్తాయి

వివరాలకు : యువభారతి

ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001









తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి